# మీరు ఎప్పుడైనా మరణించారా?

## పునర్జన్మపై అమెరికన్ డాక్టర్ల పరిశోధనలు!

రచన

**డా. వేదవ్యాస IAS. D.Litt.,**

ప్రచురణ :

**భారతీయ సంస్కృతి సముద్ధరణ సంస్థ (USCEFI)**

ప్లాట్ నెం.56, రోడ్ నెం.8, జూబ్లీహిల్స్, హైదరాబాద్ - 33

ఫోన్ నెం. 040-23547350

2017

**Rs. 60/-**

# నమ్మలేని - నిజాలు!

# 'నిర్మొహమాట' - నా ముందుమాట

మీరు ఈ గ్రంథం ఎందుకు వ్రాశారు ? ఈ ప్రశ్న, నా పాతకాలం స్నేహితుడూ, హేతువాది (నాస్తికుడు మొదలగునవి)అయిన వ్యక్తి, అడిగాడు! 'నిజమే ఎందుకు రాశాను?'

అని ఆలోచించేవముందే - **'ఔను? ఇతడీ ప్రశ్న ఎందుకు అడిగాడు?'** అన్న ప్రశ్న నాలో ఉదయించింది! ఎందుకు అడిగాడో నాకు వెంటనే తేలకపోయినా, దాదాపు ఐదేళ్ళు పాఠకులలో అనేక మనస్తత్వాలుగలవారితో పరిచయం అవటంవల్ల ఆ ప్రశ్న వెనుక వున్న ఆలోచన పంథా, కొంత కొంత క్రమేణా, అవగతం కాసాగింది!

మొదట్లో అయితే నాస్తికులు ఎందుకు ''దేవుడ్ని నమ్మం అంటున్నారంటే - దేవుడున్నాడని తెలియక'' అనుకొని దేవుని ఉనికిని తెలియజేసే అనేక తార్కాణాలను రోజుల తరబడి ఏకరువుపెట్టేవాళ్ళం, విద్యార్థులుగా వున్న రోజులనుంచీ! వారు అన్నీ విని మళ్ళీ యింకొకడి దగ్గర మళ్ళీ అదే టేపురికార్డుల్లా పెట్టడంచూసి ఆశ్చర్యపోయాను. 'ఇది ఇంతకుముందే అన్ని తార్కాణాలతో బుజువులతో అర్థం అయ్యేలాగ చెప్పాంగదా ?' అని !! ఆతర్వాతగాని తెలిసిందికాదు - ఈ

అపనమ్మకం, నాస్తికత్వం సహజంగా వొచ్చిన సందేహాలు కావని! అది ఒక 'వివాదం' అనీ!

వివాదం (Propaganda) అంటే అర్థం - అతడు మాట్లాడే 'వాదం' చెప్పే ఆర్గ్యుమెంట్లూ, మతాన్ని దుయ్యబట్టడం ఇత్యాది, ఇవన్నీ, అతనికి సహజంగా కలిగిన సందేహాలు, కావని! అలా అయితే వాటికి తగు సమాధానాలు ఇచ్చినతర్వాత కూడా — ఆ సమాధానలు ఇచ్చినవాడ్ని వదిలి, వేరేవాళ్ళని పట్టుకుని మళ్ళీ అవేవాదనలు, సందేహాలూ, ఏకరువుపెట్టడం వుంటుందా? ఇలాంటివాళ్ళ మనస్సు మార్చాలనుకోవటం అనేది జరగదు! అంటే అర్థం, ఎవరెన్ని సమాధానాలు వీరికి చెప్పగలిగినా, వీరు 'నచ్చజెప్పటానికి — వీలుకానివ్వని' స్థితికి చేరుకున్న **'ప్రత్యేక' వ్యక్తులు!**

వీరికి నమ్మకాపనమ్మకాలనేవి వుండవు! కేవలం వారికి నేర్పించినవే 'ప్రాపగాండా' (వివాదం) లాగా దొరికినవాడిదగ్గరల్లా వల్లించుకుపోవటమే, వీరి ''వృత్తి'' అని! టేపుచేసిన ఇలాంటి వాదాలు ప్రతి నడిబజారులోనూ స్విచ్‌నొక్కి వినిపించే ఇలాంటి మానవ యంత్రాలతో (Robots) మనం వాదించి, నచ్చజెప్పటం ఎలాంటిదో - వీరికి నచ్చజెప్ప బూనటం కూడా అంతే! కాబట్టి, అలాంటివారికి కాదు, ఈ పుస్తకం! ఇది ముందుగా నేను గ్రహించినదాన్నిసూటిగా చెప్పదలచుకున్న 'నిర్మోహ' - మాట!

అంతేకాదు — ఇతర దేశాలైన, అమెరికా, రష్యా, చైనావంటి రాజకీయ శక్తుల పన్నాగపు వలలో చిక్కుకుని, డబ్బుకో, నిరుద్యోగానికో, ఆకలికో బలి అయి — వాళ్ళు **చెప్పమని నేర్పించిన** చిలకపలుకుల నాస్తికవాదాలను **వల్లించేవారికి** కాదు; ఈ పుస్తకం! ఇది, 'ఆత్మ'ను అమ్ముకున్న రాజకీ బానిసలకు కాదు, 'కిరాయి' (వి)దేశభక్తులకో కాదు! — కానేకాదు!

అయితే, ఇలాంటివారి మాటలు తగిలి, వీరి వలలో చిక్కి నాస్తిక-ఆస్తిక విచికిత్సల మధ్యనపడి కొట్టుకుంటూ నిజంగా ఏర్పడే సందేహాలతో — సందిగ్ధావస్థలోపడ్డ, జిజ్ఞాసువుల కోసం మాత్రమే రాశాను! ఎందుకంటే — నిజంగా సందేహం కలిగి, తగు సమాధానాలు సకాలంలో దొరక్క — పై 'మానసిక-యంత్రాల' విషవలయంలో చిక్కి — వేశ్యావాటికలోచిక్కిన బాలికల్లా బలైపోకుండా, ఇది ఉపయోగపడాలని — మాత్రమే రాశాను ఈ పుస్తకం! ఎందుకంటే ఇలాంటివాళ్లను, అభాగ్యులు ఎందర్నోచూశాను — అనేకరంగాల్లో జీవితంలో 'దగా-పడ్డ' వారిని జీవితాన్ని సర్వనాశనం చేసుకున్న - 'సినిమా-భక్తులు', రాజకీయ, అనుయాయులు'గా 'బ్రిగేడ్'లలో ''సేవాదళ్''లలో చేరి, అవే జీవిత-ఆదర్శాలనుకుని రాజకీయాల సాలెవృత్తిలోచిక్కి గుర్తించాలి! వారు జీవితాన్ని నాశనం చేసుకోకుండా తోడ్పడే నిజానిజాలు, ఏమిటో అన్న విమర్శకు సహాయకారి అవుతుందని - రాస్తున్నాను!

ఇందులో విషయాలు ... రష్యాలో (అంటే ఈ హేతువాదులకు గురుస్థానం ఒకప్పుడు నాస్తికులకు పుణ్యక్షేత్రం ఐన కేంద్రములోనే,) ఏమి జరుగుతోందో తెలిపే ఉద్దేశ్యంతో వ్రాయబడిందీ గ్రంథము! అంతేగాక, అక్కడి మేధావులు (రాజకీయ తొత్తులుకాదు) సైంటిస్టులు చేస్తున్న ఆ ప్రయోగాలు **(Experiments)** పరిశోధనలూ, వంటి 'రీసెర్చి' ఫలితాల కారణంగా పెరిగే **'ఆస్తిక కిరణాలు'** ఇప్పుడు రష్యాలో ఉదయించే 'శుభోదయం' యొక్క తొలి నీలికిరణాలే - ఈ **ఆధ్యాత్మిక పరిశోధనలు**, అని తెలుస్తుందని!!

వీటిని చదివితే అరవై (60) యేళ్ళుగా నాస్తికత్వాన్ని నమ్ముతూ మతాన్ని నాశనంచేశామని విర్రవీగుతూ మతాన్ని దేవుడిని ఆత్మనూ పుణ్యపాపాలనూ నమ్మేవారిని బూర్జువాలుగా, అవకాశవాదులుగా,

మోసగాళ్ళుగా చిత్రించి, హింసించి సైబీరియాలోని ఐస్ (మంచు) ఎడారిలో 'చావండి!' అని వదిలేసిన 'మానవతావాదులు' (Humanists) — ఆ రష్యాలోనే - **ఆధ్యాత్మిక సత్యాలు** నిజమేననీ యోగశాస్త్రం, పూర్వఋషులు యోగులు మహాత్ములు సిద్ధపురుషులు ఉపదేశించిన మహాసత్యాలైన ఆత్మ, దివ్య శక్తులు, ఆధ్యాత్మిక సత్యాలనీ, ఈనాటికీ స్పష్టంగా సైన్సుద్వారా **ఋజువౌతున్న** మహాసత్యాలని తెలిపే - ఆధునికసైన్సుయొక్క ఆధ్యాత్మిక వెలుగు కిరణాలను ఇక్కడి **మనవారికికూడా** — మీకందరికీ అందించాలనే తపనే — అందుకే రాశాను, ఈ పుస్తకాన్ని!

**"అయితే ఈ పుస్తకంద్వారా మీరు చెప్పదలచుకున్న విషయం ఏమిటి ?"** — అని ఒక సూటిప్రశ్న వేశాడొక విద్యార్థి! ఇది నిజాయితీ అయిన గుండెనుంచి వచ్చిన ప్రశ్న! కాబట్టి, అతనికి ఇలాంటి సలహాయలవల్ల, ప్రయోజనం వుంటుంది! — అందుకే చెబుతాను!

## ఏమిటి? మీరు కనుగొన్న 'నిజాలు?' :-

ఈ పుస్తకంద్వారా మీరు తెలిపే విషయాలేమిటి? అవి ఏమి సత్యాన్ని నేర్పుతున్నాయి? గ్రంథం అంతా పూర్తిగా చూపితే నిదానంగా యోచిస్తే, తేలే అంశాలు ఏమిటి? అంటే, తేలే ....

i **మొదటి సత్యం:-** యుగ యుగాలుగా మానవజాతి నమ్మిన మహాసత్యాలనబడేవి కొన్ని **'ఆధ్యాత్మిక-సత్యాలు'** అవి, "బూటకం" కాదు అని!

ii ఇవి ప్రతివ్యక్తి తన స్వంతశక్తితో వాటిని ఋజువు చెయ్యలేకపోయినా - వాదనతోనూ ఎదురు-వాదనతోనే 'నాస్తికు'లతో స్వయంగా, **ఎదురు వాదించి గెలవలేకపోయినా,** అందులోని **సత్యాలు మాత్రం అబద్ధం ఎన్నటికీ కావు! అవి!**

దీనికి ఉదాహరణగా ప్రాచీన మతాలైన హిందూ క్రైస్తవ ముస్లిమ్ మతాలన్నింటిలో మనిషికి 'ఆత్మ' అనేది ఒకటి ఉంటుందనీ, అది ఈ, పైకి కనిపించే శరీరంలో వుండేదీ - ''కంటికి-కనిపించని''దీ, 'జీవుడు'(Soul) - ఒకానొక 'దివ్యశక్తి'తో తయారైవుంటుందని జోసెఫ్ కిర్లియన్ అనే రష్యను సైంటిస్టు కనిపెట్టిన సరికొత్త ఫోటోగ్రఫీ (Kirlian Photography)వల్ల తేలింది!

## 'జీవాత్మను ఫోటో తీశారు! :-

iii ఈనాడు డాక్టర్లు మన శరీరంలోవున్న (బైటికి కనిపించని) అవయవాల్ని బైటనించే ఫోటోతీయడం ఎలాగైతే ''ఎక్సరే'' (X-ray) **ఫోటోగ్రఫీవల్ల** సాధ్యమౌతున్నదో అలానే **కిర్లియన్ ఫోటోగ్రఫీ**ద్వారా, మనలోవుండే కంటికి కనిపించని **'జీవాత్మ'**ను - **ఫోటో తీశారు** రష్యాలో సైంటిస్టులు! ఇది మరి ఒక **'మహాసత్యం'** కాదూ!

iv ఎందుకంటే, ఇది మోసానికి తావులేని నాస్తికులైన రష్యను **'నాస్తిక-హేతువాదం'** అబద్ధం అని తేలి, ఖండితంగా ఋజువైన కనిపెట్టబడిన విషయం గనక ఇది, హేతువాదులు నాస్తికులూ కూడా **కాదనలేని సత్యం!** ! వారికంటేకూడా పదార్ధవాదులైన అమెరికన్ల పరిశోధనలోనూ ఖండితంగా ఎలా ఋజువైందో, ఆ పరిశోధనల వివరాలును మీముందు ఉంచుతున్నాను! — అది 'పునర్జన్మ' సత్యం అని మరణించాక మిగిలే 'జీవాత్మ' అనేది, నిజంగా మనకందరిలోనూ వుందని — తేలింది!

v యోగులు దీనినే ''సూక్ష్మ శరీరం'' అని 'లింగ శరీరం' అనీ సైంటిస్టులు **'ప్లాస్మా'** శరీరం (Plasmabody) అనీ, ఇలా

వేరువేరు పేర్లతో పిలిచినా ఇందలి వస్తువు ఒక్కటే! అది — బైటికి కనిపించే పదార్థంతో తయారైన ఈ **భౌతికకాయం** లోపల దాగివున్న — పదార్థంతో తయారుకాని. ఒకానొక **ఆధ్యాత్మిక శక్తి తరంగాలతోనే** తయారైన **'శరీరం'** వంటిదనీ — ఈ బైటికి కనబడే ఈ, స్థూలశరీరాన్ని - ఇదే **బ్రతికించి** వుంచుతున్నదనీ!

vi ఇది, గనక పోతే కేవలం బైటి **పదార్థ (Material Body)** శరీరం ''శవం''గా మారి ''మరణం'' పొందుతుందనీ!

vii మరోవిషయం — కిర్లియన్ ఫొటోలో చూస్తే కొన్నేళ్ళకి ముందే ఆ మనిషికి తర్వాత రాబోయే అనేక రోగాలను వ్రణాలనూ, ఈ 'సూక్ష్మశరీరం' అవన్నీ ఇప్పుడే చూపిస్తుందని!

అంటే శరీరానికి **'కలగబోయే'** రోగాలు 'బాధలు' ఇత్యాది వాటికి **'కారణాలు'** ముందే రికార్డు అయి వుండే సూక్ష్మశరీరాన్ని — ''కారణ-శరీరం'' అనటం ఎంతో సరైన **'విజ్ఞానంతో కూడిన వర్ణన'** అనీ — మూఢవిశ్వాసం కాదని ఒప్పుకోక తప్పదు!

ఇవి ఈ పుస్తకం ద్వారా తెలిసే అనేక విచిత్రమైన సత్యాలల్లో - ఇది **ఒక్కటి** మాత్రమే!!! మిగతావి — బోలెడు! అవన్నీ ఇక్కడ ఏకరువు పెట్టక్కర్లేదు! ఇందులో చదివేవన్నీ 'నమ్మలేనిసత్యాల'ను!

## పర్యవసానం:-

అయితే వీటన్నిటి పర్యవసానం(Conclusion) ఏమిటి? అంటే 'జీవాత్మ' గురించి విని జాతకాలనూ జ్యోతిష్యాన్ని చూసినప్పుడల్లా, 'మూఢనమ్మకాలో', అంటూ నాలిక పీక్కుని చావనక్కర్లేదు అనీ

అంతే!! అలా అరవటం మీ మూఢనమ్మకం (అపనమ్మకం)మాత్రమే అని తేలింది! ఏం చాలదా! ఇంకేం కావాలి?

★ ఇంకా కావాలంటే వీటి వెనకాలవున్న ఆధ్యాత్మిక రహస్యాన్ని సైన్సు తలవొగ్గి ఆమోదించక తప్పదనీ - ఇలా ఎన్నో ఉన్నాయి!

★వీటన్నిటివల్ల తేలేదేమంటే:- (1) మనస్సు పదార్థంకన్నా బలీయమైందని, (2) మనస్సుకన్నా మనస్సును పనిచేయించే 'ఆత్మ' నిజమనీ - కిర్లియన్ ఫోటోగ్రాఫీ ఋజువుచేస్తే, (3) జ్యోతిషం నిజమని డా॥ జోనాస్ (Dr Jonas) నిర్ధారించినట్లే, సత్యం (4) పదార్థం ఒక్కటే నిజమనే - కంటికి కనిపించని అబద్ధాలనీ,లేవనే ఆత్మనీ దేవుడినీ, లేరనే పదార్థ-వాదం ఘోరమైన అబద్ధం అనీ — దానివల్ల ఈ పదార్థవాదం నాస్తికవాదం నిజంగా ఇవే మూఢనమ్మకాలనీ వీటినే నిజమనీ నమ్ముకుని 60- ఏళ్ళుగా బ్రతికి, ఆ మూర్ఖత్వంలోపడి, మతాన్ని నాశనం చేయాలని చూసిన సోవియట్ రష్యాయే గ్రహించి దారి మార్చుకుందని — అలానే 'నల్లవాళ్ళు' అని తెల్లజాతి (బ్రిటన్, అమెరికా వగైరావాళ్ళు ఇన్నాళ్ళు తాను దూషించిన - సనాతనమతాలు తెలిపే సత్యాలనే తిరిగి నిజాలుగా ఏనాటికైనా ఆధునికదేశాలు అనబడే వారు గుర్తించక తప్పలేదనీ ఋజువయ్యింది కదా? — ఇంతకన్నా ఋజువులు ఇంకా ఏంకావాలి?

కాబట్టి మతాన్ని ఆధ్యాత్మికతనూ అనాదిగా విశ్వసిస్తున్న భారతీయ సంస్కృతి యదార్థమనీ గుడ్డివాళ్ళకు సైతం తెలిసేలాగ ఋజువు అవుతున్నాయి యీ ఆధ్యాత్మిక పరిశోధనలవల్ల! ఇవి, ఈపరిశోధనలు తేల్చే ముఖ్యసత్యాలు! -వీటన్నిటి పర్యవసానం ఏమిటి? అంటే -మానవజీవితం లక్ష్యంమారాలి! ఇప్పుడు నడిచేనడక, మనందరి

---

Note ★ దీని వివరాలు - ''జ్యోతిషం సైన్సా? - మూఢవిశ్వాసమా?'' - (గ్రంధంలోవున్నాయి.)

జీవితాలనడక -మారాలి! మారి తీరాలి!! అన్న సత్యాన్ని గుర్తించకుండా తప్పించుకొనే 'కప్పదాటు' -వల్ల '1999 -కలియుగాంత ప్రళయాలు తప్పవని! మార్పుకుంటే-విశ్వమానవాళి మనుగడకే మంచిది, అనేదే ఈ గ్రంధం తెలిపే సత్యం!

మరి ''మతంపేరిట జరిగే మోసాలు - అన్యాయాల మాటేమిటి?'' అని ఒక ప్రశ్న **నాలోనే ఉదయించింది!** అవును! మతం పేరిట దేవుని పేరా సామీజీలు, బాబాలు, స్వాములూ, పేర్లతో పీఠాధిపతులమంటూ ''దండుకునే'' - గండుకేశ్వరులవల్ల -రాజకీయ జేబులు నింపుకునే ''రామ-దండు'' వాళ్ళవల్లా - నిత్యం జరిగే జరుగుతున్న అన్యాయాలు అక్రమాల మాట ఏమిటి? అని ఆలోచిస్తే - ఈ 'ఆధ్యాత్మిక పరిశోధనలు' - అలాటివారిని ఈ స్వాముల్నీ, ''శఠకోప'' స్వాములూ ''గురుదక్షిణా'' మూర్తులనూ నిజమని **ఋజువు చెయ్యటంలేదు** - గనుక నిజమైన ఈ పరిశోధనలను ఈ ఆధ్యాత్మిక సత్యాలను నమ్మేవారు స్వాముల్ని వారి నామాలు, కాషాయాలు కావేషాలు చైతన్యా(అచైతన్యా)నందుల చైతన్యం అనవసరంగా చూసి **భయపడరాదు! ఇది చాలదు!** అసలైన 'వేదాలలో హిందూమతం' - ఇదికాదు. ఈ పుస్తకంలోని సత్యాలే - సనాతన ధర్మంగా మోసిన నిజమైన **హిందూమతం**. ఇది సనాతన 'సత్యయుగా'నికి ఇదే నాంది కాబోతున్నదని ''కిరాయి-మతం'' కాదు - ఇదే ''సత్యయాగానికి'' నాంది కాబోతున్నదని - అదే, ఎర్రకోట రష్యాలో ఉదయించిన - నాంది ఎర్ర సూర్యోదయం రక్త సూర్యోదయమైన 'నాస్తిక కమ్యూనిజం' నిజంగా 'సత్యయుగం' కాదని, సైన్సు సత్యాల ఋజువులతో ఉదయించే బంగారు సూర్యోదయమని అదే 1999 **కలియుగాంతం తరువాత వచ్చే నిజమైన 'కల్కి-భగవానుడి' అవతారానికి నాంది** అనీ నకిలీ కల్కి-బాబాల మోసాన్ని ఎవరూ నిజమని ఋజువు చెయ్యలేరు!!

ఎంరి ఈ నకిలీ కల్కి-బాబాలు, 'దొంగ సాధువులు' నకిలీబాబాలు అమ్మగార్లూ'ధర్మసాయి'లూ అంటే సమాధానం! ''అవతార పురుషులు'' వాళ్ళ మాటేమిటి? - ఒకటే, నిజం - అది, — నిజమైన బంగారపు నగలున్నప్పుడే ''నకిలీ'' బంగారం వస్తువులంటూ తయారవుతున్నాయి. అసలు ఈ ప్రపంచంలో బంగారం అన్నదే లేక పోతే 'నకిలీ బంగారం' సరుకు పుట్టదు! దేనికి 'నకిలీ' చెయ్యగలరు గనక?

'నకిలీ' బంగారం వుండటంవల్ల - బంగారమే నకిలీ అనిగాని, అసత్యం అని ఋజువు అవుతోందా? లేదు! లేక బంగారం ''సత్యమే''! - నకిలీవి మాత్రమే ''అసత్యం'' - అని మాత్రమే ఋజువు అవుతున్నది అలానే ఈ దొంగ-సన్యాసులు నకిలీ మహాత్ములూ - దొంగబాబాలు వుండటం అనేది ఋజువుచేసే సత్యం, ఇదే - అసలు నిజమైన మహాత్ములనేవారు ఎక్కడో నిజంగా వుండబట్టే - అలాంటి వారికి నకిలీలుగా 'వీళ్ళు' తయారవుతారన్న సత్యం తెలుస్తుంది! ఇలా తెలీటం - ఇది అందరికీ తెలీటం అదే - **''సత్యయుగం''** రావటం అదీ గుడ్డివాళ్లకూ-డా తెలిసే **సత్యయుగం** అని!

అంతే!!! - దీనివల్ల దేవుడు అసత్యం అనిగానీ - అసలు మహానుభావులే వుండరు అనిగానీ, బాబాలు, సాధువులు మతం అంతా బూటకం అంటూ ఋజువు అవుతాయని హేతువాదాలు చెప్పే నినాదాలు - కేవలం 'నినాదాలే' అని **''నిజం'' కాదనీ,** - కాజాలవనీ మనం తెలుసుకోగల వివేకం విజ్ఞానం మనలో మేల్కొన్ననాడు, ఈ నాస్తికులు, నాస్తిక సమాజాలు, హేతువాదులు నిర్వేతుకంగానే సహజంగానే నశించిపోతాయనీ, లేదా నిజం తెలుసుకోదలచిన వారిని - వీళ్ళేమీ చెయ్యలేరని స్పష్టంగా తెలుస్తోంది!

ఎందుకంటే సినిమా, వేశ్యలు భోగంవారున్న వీధిలో పడుపువృత్తి చేసుకునే అందాన్ని అముకునే ''మోడల్సు'' స్త్రీలు - ఉండటంవల్లే, పతివ్రతలే అసత్యం అనటం ఎంత నిజమో ఈ హేతువాదుల 'ప్రాపగాండా' (Propaganda) కూడా అంతే నిజమని! కాకపోతే - ఈ వేశ్యలను పడుపువృత్తి చేసుకునే వాళ్ళను ద్వేషించరాదని - జాలిపడాలనీ!

అలాంటి వారికి వీలయితే సరిదిద్ది నిజమైనదేదో తెలుసుకుని జీవితాలను వ్యర్థం చేసుకోరాదన్న సత్యాన్ని బోధించాలని మనం గ్రహిస్తే చాలు - అదే నిజమైన ఆధ్యాత్మిక జీవితానికి మొదటిమెట్టు!

కాబట్టి నకిలీ బాబాలను దొంగసాధువులను - జీవనోపాధికోసం రాజకీయవేత్తలుగా, దేశ నాయకులుగా దేశభక్తులుగా, గొప్ప సంఘసేవకులుగా దొంగవేషాలు వేస్తూ బ్రతికే అనేకరకాల మోసగాళ్ళవంటి వాళ్ళే అని - నిజానికి ఆలోచిస్తే ఆ రాజకీయ మోసగాళ్ళు దేశాన్ని దోచుకుతింటున్న దానికంటే దొంగసాధువులు దేశానికి చేసే నష్టం చాలా తక్కువ అని - అసలు సమస్య సమాజంలో మోసం చేస్తేగాని పైకిరాలేమన్న విశ్వాసమే దీనికి కారణమని గ్రహిస్తే మన దేశానికి, మన సమాజానికి సరైనదారి దొరికినట్టే!

'మోసం' అనేది ఒక 'జీవన విధానం' చెయ్యటమే మోసగాళ్ళకు ఆయువుపట్టు! అదే ''కలి-యుగం'' అనీ! అసలు అదే, నశించాలి!

అలానే దీన్ని బాగుచేసేది - నిజమైన ఆధ్యాత్మిక సత్యాలను ప్రజలకు తెలిపి - సత్యం, పవిత్రత, నిస్వార్థత, దైవశక్తి, పుణ్యం, పాపం, అనేవి సత్యమని కాన్వెంట్లలలో నేర్పటంగాక, సత్యాలని ప్రజలకు తెలియజేయుటమే నిజమైన మానవసేవ! ఈనాటి మోసాలు వేషాలు ఏనాటికైనా నివారించాలంటే! అదే నిజమైన మందు, నాస్తికత్వం కాదు!

ఒక సోదరుడు - రాశాడు ఏమిచ్చింది మీ 'హిందూమతం' - కులాల గొడవ తప్ప! అని!!! ''పాలపొడి''కోసం అలాంటి మతం మార్చుకునే - మన 'అమ్ముడుపోయిన అమ్మడులూ' 'పవిత్ర గ్రంధా'లు అని నమ్మి మోసపోయిన పరిశుద్ధగ్రంధాలలో చెప్పని ''పునర్జన్మ'' హిందూమతం, బౌద్ధమతం ఈజిప్టు, టిబెట్ మతాలన్నిటిలోనూ అంగీకరించిన 'పునర్జన్మ - **యదార్ధం**' అని !!!

ఇంకోమాట చెప్పాలి! ఇందులో కేవలం 'నిజం' అని మాత్రమే అమెరికా డాక్టర్లూ, రష్యా సైంటిస్టులూ, జపాన్ మోతోయామాలు **టిబెట్‌లామా**లు ఋజువుచేసినది. -అన్న 'నిజం' పునర్జన్మల గురించి - ఇంకా యిది ఓనమాలేనని - దీని గురించి పూర్తి వివరాలు కావాలంటే 'నచికేతుడ'నే ఋషి గత 'సత్యయుగం' కాలంలో కనుగొన్న రహస్యాలు, యమధర్మరాజుతో నచికేతుడి'' సంవాదంగా కఠోపనిషత్తులో ఇచ్చివున్న రహస్యాలూ - ఏ స్వాములూ, బాబాలూ, దండుకేశ్వరులూ చెప్పే 'దంపుడుబియ్యం' దండుకో(గో)పన్యాసాలకు అందని సత్యాలు పరిశోధనా దృష్టితో యోగసాధనచేసి 'నిస్వార్ధం'గా జీవించే - **మహాద్రష్టలకేలవి,** గాని జీవనోపాధిలేక **చదువులేని కాషాయాంబరధారులు**, నామాల శఠగోపస్వాములూ ప్రసాదరాజులవల్ల రాదనీ - వేదార్ధాన్నీ సైన్సు **వెలుగులో** అర్ధం తెలిస్తేనేగాని అది, గోచరించదని - తెలిపేందుకే, రాశాను!!! ఈ పుస్తకం!

**- అలా 'మన సనాతన వేదమతంలో ఏముందో తెలుసుకోవాలనే** నిజాయితీ, ఆసక్తీ కలవారికోసం, ప్రసాదాల రుచితో తృప్తిపడని **'జిజ్ఞాసువు'**ల కోసమే - ''**పునర్జన్మ** - గురించి మనఋషీశ్వరులు **తపస్సుతో**, దివ్యదృష్టితో తెలుసుకున్న ఆధ్యాత్మికసత్యాలను - **విడిగా ఇంకో గ్రంధం అవుతోంది।**

అందులో ''**పునర్జన్మ సిద్ధాంతం**'' - అన్నచోట వ్రాశాను! మీకోసం - వ్రాశాను!!! చావబోయే 'పెంకు ముదిరిన పెంకివారికి' చెప్పాలని మీ జీవితాలు 'వేస్టు' - చేసుకోకండి! పల్చని - పసి మాడు గల పసిపిల్లలకి చెప్పండి ! వారే - రానున్న **''సత్యయుగానికి''** వారసులు!!! 'మాడు' (సహస్రారం) సత్యంతో స్పందించే పల్చని మాడు పిల్లలకే - పెద్దయ్యాక పెంకు గట్టిపడి మూసుకుపోతుంది గనక! - వారికే చెప్పండి!

''**హిందూమతం**''-లో B.A./B.Sc. డిగ్రీకోర్సువారికి **Text-book** గా వేరే గ్రంథంలో వ్రాసిన దానిలో - **పూర్తి వివరాలు** కావలసినవారు చూసుకోండి! ఇది కేవలం - 'ఋజువు!'' కావాల్సిన - ఋజుమార్గీయులకు మొదటిమెట్టు 'తప్పటడుగు' - మాత్రమే! తప్పని అడుగు - సత్యమే!!! అది జీవితలక్ష్యం అని తెలుసుకోవటం కోసం! మీకివేనా శుభాశీస్సులు!

నిత్యసత్య'శుభసంవత్సరాది' కావాలని, మీజీవితాలలో ''సత్యయుగం'' ఆరంభం కావాలనీ- మనసారా దీవిస్తూ నూతన సంవత్సరం 1996- శుభాశీస్సులివిగో!! అందుకోండి!

ప్రేమతో

''గురుస్థాన్''

మీ

1-1-1996

వేదవ్యాస

1

# గతజన్మల పాపాలకు వైద్యం! రోగనివారణ!

## ~ అమెరికన్ డాక్టర్ల అద్భుతాలు!!

ఆరోజు ఏప్రిల్ 10, 1982 తారీఖు - గురువారం! అన్నిరోజుల లాగే జెన్నీ సాండర్స్ (Jenny Sannders) తల్లిలేని పసిబిడ్డలను సాకే 'అనాధ-బాలల' కేంద్రంలో సంఘసేవకురాలిగా తను నిత్యం డ్యూటీకి బైలుదేరినట్లే సిద్ధమౌతున్నది. బంగారువన్నె ఉదయ సూర్యకాంతితో మామూలు రోజులాగే తెల్లవారింది - ఎలాంటి విశేషమూ కనిపించకుండా!

పెందరాళే 9-గంటలకల్లా తన ఆఫీసుకు చేరుకోవాలనే తాపత్రయంలో జెన్నీ ఉదయం ఏడున్నరకే సిద్ధమై తనడ్రెస్సూ, హ్యాండ్‌బ్యాగు అన్నీ హడావుడిగా సర్దిపెట్టుకుంటోంది. బయల్దేరే

ముందు వేడిగా ఒక కప్పుకాఫీ తాగాలనిపించింది. హడావుడిగా కప్పులో చిక్కటి డికాక్షన్ వంపుకొని వేడిపాలు కలుపుకుంటూ మెత్తగా, అలవోకగా ఎదురుగుండా గోడవైపుచూస్తూ నడిచిన జెన్నీకాళ్ళు గాలిలోనే స్తంభించి ఆగిపోయాయి, బ్రేకువేసినట్లు! తెరిచిననోరు ఆశ్చర్యంతో అలానే వుండిపోయింది సరిగ్గా తనకు ఎదురుగా నాలుగు అడుగులైనా లేదు, గోడమీద ఎఱ్ఱటిరక్తం!! పైగా, రక్తపుమరకలు చిక్కగా బచ్చలిపండు రంగుతో గడ్డకట్టి మెరుస్తున్నాయి భయంకరంగా! ఆశ్చర్యంతోనూ త్రుళ్ళిపాటుతోనూ స్తంబించి నిలబడింది జెన్నీ! రక్తం ఎక్కడిది? కంగారుగా తనవేళ్ళు, చేతులూ చూసుకుంది — ఎక్కడా తెగిన గుర్తుకాని, రక్తంకారిన సూచనలుగాని కనిపించకపోయేసరికి — అది తన రక్తంకాదని జన్నీకి క్షణంలో తెలిసిపోయింది!

తన గదిలో తానొక్కతే ఉంటున్నదాయె! అదీ గోడమీదకి ఇలా ఈ రక్తంమరక ఎక్కడనుంచి వచ్చింది? ఎంత బుర్రపాడుచేసుకున్నా అంతుబట్టలేదు జెన్నీకి. తన కట్లెట్ పైకి వంపుకున్న టొమాటోసాస్ మరకలేమో అని సమర్ధించుకోబోయింది, మనలాగే! కాని — కాని, అవి తిలకంలా గడ్డకట్టి, ముదురు ఎరుపుగా స్పష్టంగా రక్తపుమరకలని తెలుస్తూనేవుంది. టొమాటోసాస్ రంగూ కాదది! ఏమో ఎటూ పాలుపోలేదు. అంతకన్న వేరే ఆలోచనలేమీ తోచలేదు.

ఆఫీసుటైము మించిపోతున్నదని ఆదరా బాదరాగా తన వస్తువులు సర్దిపెట్టుకొని 'తరువాత చూసుకోవచ్చులే' అని తన ఆలోచనలు ఎక్కడివక్కడే వదిలేసి రూముకు తాళంవేసి బైటపడింది ! ఆ తరువాత గాని గుర్తురాలేదు తానుకలుపుకున్న కాఫీ కనీసం పూర్తిగానైనా త్రాగలేదు అని! శరవేగంతో కారు ఆఫీసుకు చేరుకున్నది.

అమెరికాలోని అన్ని ఆఫీసులలాగే డ్యూటీలో దిగిన క్షణంనుంచే,

తీరికలేక ఉక్కిరిబిక్కిరిచేసే ఆఫీసు పని ఒత్తిడిలో జెన్నీసాండర్స్‌కు టైము ఎలాగడిచిపోయిందో సాయంత్రం ఆఫీసు అవగానే ఇంటిదారి పట్టేవరకూ గుర్తేలేదు! చివరకు రూము తాళం తెరిచాక ఒక్కసారి గుండె గుభేలుమంది — ప్రొద్దున్న తాను చూసిన రక్తపు మరకలు కాక — మరికొన్ని రక్తపుమరకలు గోడనిండా నెత్తురు చిందినట్లు ముక్కలుగా చిందివున్నాయి. ఇవి ఉదయం రక్తపు మరకలుకావు! అవి ఎండి నల్లబడుతున్నాయి! ఇవి సరికొత్త నెత్తుటి మరకలు పైగా సన్నని చిక్కని చారిక కట్టి రక్తం గోడవెంటనే స్రవించసాగింది. జెన్నీకి ఆలోచించే టైముగాని ఆ టైములో ఎదురుగా కనిపించే భీభత్సాన్ని చూస్తూ తట్టుకునే శక్తిగాని తనవద్దలేదు. ఒక్కగెంతులో రూములోంచి బైటపడింది.

బైటికివచ్చి దూరాన వేరే రాష్ట్రంలో వున్న తన తల్లిదండ్రులకు అర్జంటుగా ఫోన్ చేసింది! సాధారణంగా జెన్నీ తలిదండ్రులను తాను ఎప్పుడోగాని కలవటం వుండదు ఎవరిపనుల్లో వారుండే, అమెరికాలో నిత్యం బిజీగావుండే వేలాదిమందిలాగే - క్రిస్తమస్ పండగకో లేక కుటుంబంలో ఎవరన్నా మరణిస్తే ప్రేతకర్మలకో లేక క్రొత్త సంవత్సరం గ్రీటింగులకో ఎప్పుడో అలా పలకరించడం తప్ప సంబంధాలు తక్కువ. దాంతో, అకస్మాత్తుగా జెన్నీ నుండి ఫోన్ రావడంతో తండ్రి సాండర్స్, ఆయన భార్య పరిస్థితి వినగానే ఖంగారు పడి, హుటాహుటిన సాయంత్రానికల్లా జెన్నీ అపార్టుమెంటుకు కారులో చేరుకున్నారు.

అనుభవంతో పండిన ఆ వృద్ధ దంపతులు జెన్నీ చెప్పిందంతా శ్రద్ధగా విన్నారు ఓపికతో! గదిలోకి వెళ్ళి రక్తపు మరకలు కూడా చూశారు — మరుక్షణంలోనే జెన్నీ తల్లి అప్రయత్నంగా కేకపెట్టింది కెవ్వున అరుస్తూ

'' ఈ ఇల్లు దెయ్యాల కొంప దేవుడోయ్! ఏవో దుష్ట పిశాచాం పనే ఇది!

ముసలావిడ మాటలు అప్రయత్నంగా తుపాకీ ప్రేల్చినట్లు అనేసింది. మరుక్షణంలో అందరి మనసుల్లోనూ అదే భావం ముద్రపడింది.

అంతే, క్షణాలమీద కూతురిని అపార్ట్‌మెంట్ ఖాళీచేయించి అవసరమైన సామాగ్రి మాత్రమే తీసుకొని గది తాళంవేసి – అప్పటికప్పుడే మరొక క్రొత్త ఖాళీ అపార్ట్‌మెంటును చూసి అక్కడ దింపి వెడుతూ –

''నీ మకాం నిండా దెయ్యాలే! దీనికేదన్నా చెయ్యాలి! అంతదాకా నువ్వక్కడ వుండకు!'' అంది.

జెన్నీసాండర్స్ కూడా ఆ దెయ్యాల మాట వినగానే క్రొత్తగదిలోనే తాత్కాలికంగా నిలిచిపోవాల్సి వచ్చింది!

'దెయ్యాల కొంపల గురించి అమెరికాలో కూడా భయాందోలనలు సహజంగానే ఆడవారిలో ఎక్కువ! ఐనా పైకి మాత్రం వేంకపోతు గాంభీర్యం నటిస్తారుగాని, ఎవర్నడిగినా దాన్ని వదిలించుకోటానికి మార్గం ఏమిటో అంత తేలికగా ఎవరూ చెప్పలేకపోయారు.'

''నీ ఇంట్లో ఏవో దుష్టశక్తులు ఆవేశించాయి లాగుంది! ఇదంతా వాటిపనే!'' అంటూ తల్లి అన్న మాటలే జెన్నీ మనసులో సుళ్ళు సుళ్ళుగా తిరగసాగాయి.

అని – రాత్రంతా. జెన్నీకి రాత్రి కంటిపైన కునుకులేదు, తనా అపార్ట్‌మెంట్‌ను మార్చిన అవే ఆలోచనలు!

ఆదివారం సెలవు రాగానే జెన్నీ తలిదండ్రులు గాలించితే కెనడాలోని ఒంటారియో(Ontario) వద్ద పీటర్‌బరో (peters borough)అనే నగరంలో డాక్టర్ విట్టన్ (Dr. Whitton) అనే మానసిక వైద్యుడు ఉన్నాడని, ఆయన హిస్టీరియా వంటి కేవల మానసికరోగాలకు చికిత్స చేయడమేగాక జెన్నీగదిలో కనిపించినలాంటి 'గాలి-సంబంధమైన' వింతలు గల అనేక కేసుల్ని చేపట్టి వాటిని, సక్రమంగా అతీంద్రయ శక్తులు, హిప్నాటిజం వంటి ఆధ్యాత్మిక ప్రక్రియలద్వారా ఆ రోగులకు బాధ పూర్తిగా నివారణ చేసిన కేసులు ఎన్నో!

వెంటనే, జెన్నీ తలిదండ్రులు డా॥ విట్టన్‌తో 'అప్పాయింట్‌మెంట్' తీసుకొని జెన్నీని పరీక్షచేయించారు. గదిలోని రక్తపు మరకలూ, వరుసగా రెండురోజులలో కనిపించిన వింత అనుభూతులు అన్నీ ఓపిగ్గా విన్నాడు డా॥ విట్టన్!

ఐనా అంతటితో ఆగలేదు! గదితాళంవేసి ఆఫీసుకెళ్లి తిరిగివచ్చేలోగా ఈ రక్తపుమరకలు రోజురోజుకీ మార్చి మార్చి కనబడుతూనే ఉన్నాయి. దీనివల్ల ఇవి ఎవరో జెన్నీని అల్లరిపెట్టడానికి చేసిన ఆకతాయి చర్యలుకావని, ఇదేదో అతీంద్రయశక్తులపనే అని నిశ్చయానికి వచ్చాడు — డా॥ విట్టన్!

డాక్టర్‌గారి గదిలో సంప్రదించివచ్చిన జెన్నీ తలిదండ్రులకు వెనువెంటనే ఈ క్రింది వింతలు మరికొన్ని జరిగాయి:

1) గ్లాసులు శుభ్రంగా కడిగి ఆరడానికి వంటింట్లో టేబుల్‌పై పెట్టినవల్లా ఉన్నట్లుండి ఫెళ్లు మని పగిలిపోవడం! ఏ రాయి ఏ బైటి వస్తువూ తగలకుండానే 'టప్పున' పేలిపోవటం!

2) గది ద్వారబంధానికి అడ్డంగావేసిన డోర్‌కర్టెన్‌లు, గాలిలేకపోయినా పెద్దచప్పుడుతో తెరలు చిరిగి రెండుప్రక్కలకీ వెడల్పుగా

తెరచుకోవడం అందులోంచి, వింత చప్పుళ్ళు వినిపించడం!

3) జెన్నీ తలిదండ్రుల ఇంట్లో రాత్రి డిన్నరు పూర్తిచేసి, ఉల్లాసంగా మాట్లాడుతూ, డైనింగ్ టేబుల్‌వద్ద కూర్చునివుండగా పైన వ్రేలాడగట్టిన పక్షిపంజరం ఖాళీగావుంటే వింతగా దానివైపే చూస్తూ - '' ఎప్పుడైనా గతంలో అందులో ఒక పక్షిగాని అందులో వుండివుండేదా'' అన్న ఆలోచన యధాలాపంగా వస్తే ఊరికేనే ఆ పంజరంవంక పైకి చూసింది! మరుక్షణంలో పెద్ద చప్పుడుతో 'ధన్' మంటూ ఆ పంజరం క్రిందపడింది. ఆ పంజరాన్ని వ్రేలాడదీసిన ఇనుపగొలుసు తెగిపోలేదు...అలా చూస్తుండగానే కళ్ళముందే ఐస్‌ముక్కలా కరిగిపోయింది గాలిలో! ఎప్పటికీ మళ్ళీ ఆ గొలుసు ఎక్కడ పోయిందో, తిరిగి దొరకనే లేదు!

4) జెన్నీ ఫ్రెండు బహూకరించిన గాజు గులాబీపూల ఫ్లవర్‌వాజ్ చూడటానికి రమ్మని స్నేహితురాలికి ఫోన్‌చేసింది ! అలా టెలిఫోన్ పెట్టేస్తుండగానే ఆ గాజు ఫ్లవర్‌వాజు పెద్ద చప్పుడుతో ఎదురుగుండా డ్రెస్సింగ్ టేబుల్ మీదినుంచి దానంతట అదే ముందుకు జరిగి కళ్ళముందే క్రిందపడి పగిలిపోయింది!

5) జెన్నీ తన మకాం మార్చినా, ఇలాంటి గాలి బాధలు ఆమెను, అలా వెంటాడుతూనే వున్నాయి!

కాబట్టి ఈ భయానక వింతలను సృష్టిస్తూన్న అదృశ్యశక్తి ఏదైనా అది ఆమె అపార్ట్‌మెంట్‌లో మాత్రమే వున్నదికాదు అని తేలిపోయింది. ఆమె ఎక్కడవుంటే ఆ చుట్టుప్రక్కలే ఇలాంటి భయానక వింతలు, కోకొల్లలుగా జరగసాగాయి. దాంతో జెన్నీ ప్రాణభయంతో దిక్కుచచ్చిపోయి తన చుట్టూరా భయంతో అనుమానంతో

చూసుకుంటూ క్షణక్షణం సస్పెన్స్‌లో దుర్భరంగా గడిపేది. వేరేవారెవరూ ఆమెకు దగ్గరగా వుండటానికి కూడా నిరాకరించారు! ఎవరి భయం వారిది! ఇలా జెన్నీ సమస్య రోజులుగడిచినా, ఏమాత్రం కొరుకుడుపడకపోగా మరింత జటిలం కాసాగింది! ఈ పరిస్థితి — డాక్టర్ విట్టన్ జెన్నీసాండర్స్ కేసును చేపట్టి, ఆమెకు ఏవిధంగా ట్రీట్‌మెంట్ చెయ్యాలో కూడా అర్జంటుగా తేల్చుకోవాల్సిన సుడిగుండంలాంటి సమస్య ఇది!

డా॥ మైకేల్‌స్టోన్ (Michel Stone) అనే ఒక మానసిక శాస్త్రజ్ఞుడు వ్రాసిన స్పెషాలిటీ (Super Speciality Medicine) వైద్యగ్రంథం తెరచి దాని ఆధారంగా జెన్నీసాండర్స్ కేసును విశ్లేషించడం ఆరంభించాడు డా। విట్టన్!

మైకేల్ స్టోన్ సిద్ధాంతం ప్రకారం 'మానసిక పేషంటునేదైనా, అతీంద్రియమైన వింత అనుభవాలకు గురిచేసే ఒకానొక 'అతీంద్రియ' శక్తి, P.K. (Psycho kinesis) ఒక **విద్యుదయస్కాంత శక్తి** (Electro-magnetic Energyu)వంటిది ఆపేషంట్ మెదడునుంచే అన్ని వైపులకీ వ్యాపించి, ఆ వ్యక్తి చుట్టూవున్న వాతావరణాన్ని విద్యుత్తు మండలం (Electrical Field)ద్వారా 'హైటెన్షన్'లో ఉంచుతుంది. దానివలన ఒకానొక అణుధార్మికశక్తి లేదా కరెంటువంటి, సూదంటురాయి - ఆకర్షణవంటి లక్షణాలుగలిగిన ఒక వింత **మానసిక కరెంట్** (Psychic electricity) వంటి శక్తియే, ఆ చుట్టూజరిగే వింతలను నడిపిస్తుంది.

తన భయానక అనుభవాలకు తనలోని శక్తియే కారణమని తెలుసుకోలేని పేషెంట్ - అవి చూసి భయంతో కంపించిపోతాడు. దాంతో అతని **'మానసిక'** శక్తి మరింత తీవ్రంగా ప్రసారం కావడం జరుగుతుంది. అది దూరాన రిమోట్‌కంట్రోల్ (Remote Control) సిద్ధాంతం ప్రకారం పేషంట్ మనస్సునుంచి ప్రసరించే P.K. అనే ఒకానొక

అధ్యాత్మిక కరెంటువంటి శక్తి ఈ చుట్టూ జరిగే భయానక వింతలకు కారణమౌతుంది. దీనిని ట్రీట్‌మెంట్ చేసే డాక్టర్ ఎంతో నిశితంగా పరిశీలించాలి. ఆ పరిశీలన మీదనే సరైన ట్రీట్‌మెంట్ ఏదో నిర్ణయించాలి!

ఈ.. పై అభిప్రాయం వైద్యశాస్త్రంలోనే ఒక పెద్ద విప్లవం! 'మానసిక - అధిమానసిక సరిహద్దు వ్యాధులు' (**'Bordeline Syndromes'** - by Michel. H. Stone M.D.) అన్న అరుదైన, **'సూపర్-స్పెషాలిటీ'** వైద్యశాస్త్ర సిద్ధాంతగ్రంధంలో రూపొందించిన నూతన సిద్ధాంతమే పై విశ్లేషణకు ఆధారం!

దీనిని బట్టే డా॥ విట్టన్ చేపట్టిన రోగనిర్ణయం (**Diagnosis**), చికిత్సావిధానం అమెరికా వైద్యశాస్త్రంలోనే ఒక విప్లవాన్ని సృష్టించాయి! పూర్వజన్మలు, మనిషి ఆత్మ మరణించిన తరువాత ఏ స్థితిలో వుంటుందో అన్న నూతన అధ్యాయం ప్రారంభమైంది సైన్సు చరిత్రలోనే! అది జెన్నీసాండర్స్ కేసును, దాని చికిత్సా విధానంలోని ఆసక్తికర అంశాలను జాగ్రత్తగా చూస్తే తెలుస్తుంది. అదేమిటో ఇప్పుడే చూద్దాం!!

*

2

# మానసిక వైద్యంతో గుర్తుకువచ్చే గతజన్మల - జ్ఞాపకాలు

డా॥ విట్టన్ రోగుల పరిశీలనగదిలో (Consulting room) లో జెన్నీ సాండర్స్ తన మనస్సును, శరీరాన్ని తేలికచేసి ఆయనచెప్పిన ఒకానొక మానసిక హిప్నాటిక్ థెరపీ (Hypno- Regression, Therapy)లో చెప్పే శ్వాసక్రియతో ప్రారంభమైంది ఆమెకు ట్రీట్‌మెంటు. మానసికరోగుల చికిత్సలో ఉపయోగించే సైకోథెరఫీ (Psycho-Therapy) విధానాలతో మొదలై, తద్వారా ఆమెకు ఏవిధమైన మానసికరుగ్మతా లేదని ఋజువైంది.

డా॥విట్టన్ ఆమె బాల్యంనుంచీ జరిగిన సంఘటనలను ఆకళింపుచేసుకోమని ప్రతీ చిన్న అంశాన్నీ ఒక డిటెక్టివ్‌లాగా నిశితంగా అన్వేషించసాగాడు. గతంలో 23 జూన్ 1979లో, ఆమె ఆఖరి

కుమార్తెకు గర్భిణి ఐన రోజు ఆ - తేదీ తెలికగానే ఆమె డైరీలో లభించింది. ఎందుకంటే ఆమె కొన్ని సంవత్సరాలుగా మానేసిన సంసారపు జీవితంలో అప్పుడే పాల్గొనటం జరిగింది. ఈ సంఘటన, ఆ తేదీ జెన్నీ సాండర్స్ జీవితంలో, ఆమె మనస్సుపై ఎలాంటి ముద్ర వేసిందోనని పరిశోధించసాగాడు. ఆమె బాల్యం అంతా తీవ్రమైన కష్టాలకు మానసిక సంక్షోభానికీ గురైందనీ, ఆమె తరచూ తనను ఎవరూ అర్థం చేసుకోవటంలేదని అపార్థం చేసుకుంటున్నారన్న ఒక విధమైన దిగులుతో ఉండేదని; ఇలాగ అనేక వివరాలు ఆమె గతజీవితంగురించి సేకరించి వాటి ప్రభావంవల్ల ఆమె తీవ్రమైన మానసిక ఒత్తిడికి గురై, తద్వారా ఒక విధమైన అతీంద్రియశక్తి P.K. (Photo Kenesis Energy) ఆమెలో ఉద్భవించింది. ఫలితంగా జెన్నీ ఎరుకలేకుండానే ఆమెలోని ఈ P.K. - శక్తి పనిచేసి చుట్టూ జరిగే అనేక రకాల విచిత్రాలకు వింతలకూ కారణమౌతోందని నిర్ధారించాడు డా॥ విట్టన్.

పై విశ్లేషణతో జెన్నీ టేబుల్‌మీద గాజుగ్లాసు పగిలిపోవడం వంటి సంఘటనలు విశ్లేషించవచ్చునుగాని గోడమీద రక్తపు మరకలకూ ఈమెలోని అతీంద్రియశక్తులకూ సంబంధమేమిటి? మన డాక్టర్లవలే ఫీజు తీసుకుని పేషంటును అలక్ష్యంచేసే సంస్కృతి లేని, అమెరికా వైద్యసాంప్రదాయంలో శిక్షణపొందిన డా॥ విట్టన్, జెన్నీ సాండర్స్ కేసును శ్రద్ధతో ఒక సైంటిస్టు పరిశోధన చేసే ఆసక్తితో పరిశోధించాడు. జెన్నీ గర్భం ధరించిన - ఆ తేదీకి ఏమైనా ప్రాముఖ్యత వున్నదా? ఆరోజే సరిగ్గా గోడమీద రక్తపు మరకలు కనిపించడం ఏతేది? పైగా అది సరిగ్గా ఏప్రియల్ 10నే కావడంలో ఏమన్నా ప్రాముఖ్యత సూచిస్తుందా?

''నేను గత వేసవిలో గర్భిణినయ్యాను. కాని, మూడోకంటివారికి తెలియకుండా అబార్షన్ చేయించుకున్నాను'' అన్న అనాలోచితమైన జెన్నీ

సమాధానంతో డా॥ విట్టన్ మెదడులో ఒక మెరపు మెరిసినట్టైంది. సాధారణంగా ఏదైనా తాను చేసినపని గురించి గిల్టీ (Guilty)గా ఫీలయ్యే మనస్తత్వం గలవారికి - ఆ అబార్షన్ ఒక హత్యలాగా, రక్తపాతంలాగా మనస్సులో లోతుగా అతీంద్రియావస్థలోకివెళ్లి, ముద్రవేసుకుందని - డా॥విట్టన్ ఆమె ప్రసవించిన రోజు ఏప్రిల్ 10 ప్రాంతంలో వుండి వుండవచ్చునని తన మానసిక పరిశోధనతో నిర్ణయించాడు. కాని అది యదార్థమో కాదో, రూఢీచేసుకోవడం ఎలా? 'తన ఊహల్ని తానే నమ్మే'రకం వైద్యుడు కాడాయన.

వెంటనే జెన్నీ గర్భధారణ వైద్యం చేసిన 'గైనకాలజీ' డిపార్ట్‌మెంటుకూ టోరంటో జనరల్ హాస్పటల్‌కూ (Toronto, Genarak Hospital) టెలిఫోన్‌చేసి జెన్నీ కేసుఫైలు జాగ్రత్తగా చూసి తనకు కావలసిన భోగట్టా యావత్తూ, పంపవలిసిందిగా కోరాడు.

ఆశ్చర్యం! ఆ పసిబిడ్డ అబార్షన్ గనక జరుగకపోయివుంటే సంపూర్ణంగా శిశువు సరిగ్గా **ఏప్రియల్ 10, 1980** నాడే ప్రసవించి **వుండాల్సిన తేదీ అది!** ఆ సంఘటనతో డెలివరీ, రక్తపాతం అబార్షన్‌లకు అతి మానసికస్థితిలో సూచికగా గోడమీద ఈ రక్తపుమరకలు ఏర్పడ్డాయని డా॥విట్టన్ కనుగొన్నారు. దీనితో గదిలోని అనేక 'వింత అనుభవాల' వెనుక నిగూఢంగా ఆధ్యాత్మికంగా ముడిపడివున్న 'గోడమీది రక్తపు మరకల' సమస్య కూడా విడిపోయింది! ఈ చుట్టూ జరిగే సంఘటనలు ఏవీ '**గాలి సంబంధమైన భూతాలు**' సృష్టించిన వింతలు కావు!!

ఆ గోడమీద రక్తపు మరకలుకూడా జెన్నీ మానసికంగా గిల్టీగా అబార్షన్ ద్వారా తన శిశువును హత్య చేయించుకున్నట్లు ఫీల్ అవటంవల్ల ఆమెలోని 'అతీంద్రియ శక్తి' చుట్టూ జరిగే

'గాలి-సంఘటనలను' ప్రేరేపించినట్లే గోడమీద రక్తపుమరకలతో ముద్రవేసింది! ఇదే డాక్టర్ విట్టన్ చేసిన రోగవిశ్లేషణ! కాని, ఈ విశ్లేషణ చాలదు - ఇది యదార్ధమని **ఋజువు కావాలి!** అప్పుడే అది 'సైన్సు' అని నిరూపించుకుంటుంది.

లేకపోతే కేవలం ఒక 'విశ్లేషణ' (Hypothesis) లేదా సిద్ధాంతం (Theory) మాత్రమే! కాబట్టి జెన్నీ ట్రీట్‌మెంటు ద్వారా గనక ఆమె చుట్టూ జరిగే వింతలు ఆగిపోతేగాని డాక్టరుగా తాను డిటెక్టివ్ పద్ధతిలో కనుగొన్న అసాధారణ రోగవిధానం (Diagnosis) సరైనదన్నమాట!

## కాలంలో - వెనక్కి :-

పై నిశ్చయంద్వారా డా॥ విట్టన్ జెన్నీని మానసికంగా. **వెనక్కి పంపి** (Regression) యోగనిద్ర (Hypnosis) పద్ధతి ద్వారా ఆమె గతంలోకి పంపించాడు. ఇప్పుడీ పద్ధతితో అమెరికాలో అనేకమంది డాక్టర్లు ప్రతినిత్యం రోగుల గత ఆంతరంగిక చరిత్రను రోగిచేతనే ప్రత్యక్షంగా చూపించటానికి ఎంచుకున్న పద్ధతి! ఫలితంగా అటు నిద్రాఇటు జాగ్రదవస్థా కాని స్థితిలో జెన్నీ పదకొండేళ్ళ పిల్లగా వున్నప్పటినుంచీ జరిగిన అనేక సంఘటనలు ఆమె మరచిపోయినవికూడా, గతంలో అణగదొక్కబడిన జ్ఞాపకాలు కూడా నిద్రాణమైనస్థితి లోంచి జాగరితమై ఒక TV తెరపై దృశ్యాల్లాగా కనిపించాయి. ఎప్పుడో మరచిపోయిన గతంలోని భయంకర జ్ఞాపకాలు మనస్సులోకి తిరగతోడటంతో జెన్నీ తీవ్ర సంక్షోభానికి గురికాబడింది. ఇదికూడా గతజన్మస్మృతులు ఈ హిప్నాటిక్ పద్ధతిద్వారా దృశ్యాల్లా చూసిన అనేకమంది రోగులకు జరిగే సామాన్యమైన అంతర్మధనం, మానసిక సంక్షోభం మామూలే! కాని ఆ తరువాత ప్రక్షాళన (Cleaning)వల్ల గతజన్మస్మృతులు, వాటిలోని

దాచిపెట్టబడిన చెడు జ్ఞాపకాలు మనస్సు నుండి తొలగిపోవటమే కాక వారి రోగాలు కూడా పూర్తిగా మటుమాయం కావడం ఆశ్చర్యకరమైన మెడికల్ సైన్సు విజయం. అయితే యింతకీ జెన్నీ గత స్మృతుల్లోకి వెళ్ళి T.Vలో చిత్రాల్లాగా చూసిన భయానక సంక్షోభం ఎటువంటిది? దానికీ ఆమెకు ఏర్పడిన సమస్యకూ ఏమిటి కారణం?

అకారణంగా జెన్నీకి తన తల్లి అంటే వల్లమాలిన ద్వేషం వుండేది! దీనికి కారణం తనకే తెలీక ఎంతో ఆశ్చర్యంకూడా పడేది! గత స్మృతుల్లోకి అన్వేషించగా జెన్నీని చిన్నతనంలో తల్లి చాలా హింసించి అర్థంలేని హింసలతో రాచిరంపాన పెట్టింది. దానికితోడు దారుణమైన 'సెక్సుహింస'లకు (Sexual Abuse) గురిచెయ్యబడింది కూడా! తన తల్లియే స్వయంగా జెన్నీని అనేకసార్లు చిత్రహింసలు పెట్టేది. ఆమె మర్మావయవంలో బ్రష్‌పిడివంటి పరికరాలతో హింసించడం, బాధలేకాక శాశ్వతమైన గాయాలు ఏర్పడినాయి. దానికితోడు తల్లి తరచూ జెన్నీని చావబాది

''నిన్ను ఏ మగవాడూ ఇష్టపడకుండావుండేలాగ నాశనం చేస్తాను చూడు!'' అంటూ హింసించిన జ్ఞాపకాలు **'అతిమానసిక-చికిత్స'** ద్వారా మనస్సు అట్టడుగునుంచి పైకి తేరుకుని ఘోరమైన ఆ జ్ఞాపకాలు మళ్ళీ తెరమీద కనిపించినాయి! ఎప్పుడో జరిగిన సంఘటనలు ఇప్పుడు అనుభవిస్తున్నట్లుగానే జెన్నీ పిచ్చికేకలువేయడం టేబుల్‌మీద బాధతో మెలికలు తిరిగిపోవడం 'ఫిట్'లాగా వచ్చి మూర్ఛపోవటం రోజులతరబడి గదిలోపెట్టి తలుపులు వేస్తే దిగులుతో బిక్కచచ్చిపోవడం తన తండ్రికీ దగ్గర బంధువులకూ కూడా ఊహించడానికి వీలులేని రహస్య పద్ధతిలో హింసించబడ్డ గత స్మృతులన్నీ ఆశ్చర్యంగా పైకివచ్చాయి. ఫలితంగా సంవత్సరాల తరబడి తల్లితండ్రులకు దూరంగా వున్నా, జెన్నీకి అదే హాయి అనిపించేది. ఇలాగ పసిపిల్ల తాను హింసించబడే క్రూరత్వం,

రక్తంవచ్చేలా తల్లి చావబాదిన హింస జెన్నీ మనసులో పసితనంతో ముడిపడి తను బిడ్డను ప్రసవించే స్మృతిలో పెనవేసుకున్నది. అబార్షన్ చేసుకోవడం అంటే నోరులేని పసిబిడ్డను పీకనులిమి హత్యచేసి నెత్తురుపిండినట్లే ఫీలయి తన సంక్షుభిత బాల్యం గుర్తుకువచ్చి రక్తపాతంతో ముడివేసుకున్నది.

ఇదీ అసలు సమస్య! జెన్నీ మనసులోని అతీంద్రియ శక్తులు ఈ రక్తపాతాన్ని బాహ్యసంఘటనలోకి మార్చి, గ్లాసు యితర వస్తువులు కదిలించినట్లే గోడపైన ప్రత్యక్షమైన వస్తువులలో చిత్రాలను సృష్టించాయి.

కానీ అంతటితో ఆగిపోలేదు జెన్నీలోని మానసిక సంక్షోభం! ఈ విశ్లేషణతో కొంచెం ఉపశమించినా ఆమెకు చిరకాలంగా వున్న అనారోగ్య సమస్యలు నివారణకాలేదు. అవి నివారణ ఐతేగాని జెన్నీయొక్క కర్మసంబంధమైన దోషాలు తొలగినట్లుకాదు అని భావించాడు డా॥ విట్టన్! అందుకని ఆమె సమస్యలను గూర్చి పూర్తిగా వైద్యనివేదిక (Medical Report) తెప్పించాడు. చిన్నప్పటినుంచీ జెన్నీకి సంసారసౌఖ్యమంటే విపరీతమైన భయం, బాధా వుండేవి. అంతేగాక భర్త లేక మరెవ్వరూకాని సంసారిక కోరికతో ముట్టుకుంటే చాలు విపరీతమైన కచ్చ - అణుచుకోలేనంత ద్వేషం, వారిని తక్షణం హత్యచేయాలని కనీసం బాకుతో పొడిచిచంపాలని అణచుకోలేనంత ఉద్వేగం కలిగేది. ఈ విపరీతాన్ని అర్థంచేసుకోలేని జెన్నీ అది తన మానసిక దోషంగా భావించి ఆ కక్షను తనవేపు మళ్ళించుకొని, తనను తానే చిత్రహింసలు పెట్టుకునేది, ఇది ఆమె ఆరోగ్య సమస్యలలో ఒకటి మాత్రమే!

ఇకపోతే ఎలాగో అలాగ సంసార అనుభవం పొందాలని ప్రయత్నిస్తే కామోద్రేకం తనలో తల ఎత్తగానే గర్భాశయం (Uterus), యోనికుహరం మెలితిరిగిపోయి 'డెక్క'పడ్డట్టు పెనవేసుకొని బాధకలిగేది. ఇది అనేకమంది గైనకాలజిస్టుల నిరంతర మందుల వాడకంతో కూడా

ఏమీతగ్గలేదు. ముఖ్యమైన ఈ సమస్య యిలా ఎందుకు కలుగుతున్నదో తేలేవరకూ ''డాక్టర్ విట్టన్ '' పరిశోధన పూర్తికానట్టే!

అందుకని ఆమె బాల్య అనుభవాల విశ్లేషణ, మానసిక చికిత్స (Psycho Therapy)తో లభించిన ఉపశమనం మాత్రమే సరిపోదు. దీనికి సమస్య యింకా లోతుగా నిగూఢంగా ఉండి వుండాలి! బహుశా ఈమె గతజన్మలోని అనుభవాలకు సంబంధించినదేమో చూడాలి ! అదేమిటో కొంచెంకూడా ఊహించటానికి వీలుకాని తెర! మనిషియొక్క మరణం, జననం మధ్యన జ్ఞాపకశక్తిని వేరుచేసే ఒక 'అతిమానసిక స్థితి' (Meta Consciousness) అనిపేరు పెట్టాడు డా॥ విట్టన్.

ఈ మెటాకాన్షస్‌నెస్ మనిషి శరీరంలో మానసిక చికిత్సద్వారా అందుకోలేనిది! మొత్తం మందులద్వారా కూడా మనస్సు చేరుకోలేని స్థితి!! అంటే ఈ శరీరంలోంచి జెన్నీ ఆత్మను తాత్కాలికంగానైనా సరే విడదీసి ఆమె గతంలో మరణించిన తరువాత - ఈ జెన్నీగా పుట్టకముందు ఆకాశంలో తేలుతూవుండే 'ప్రేతాత్మలు' లేక జన్మించబోయే 'జీవాత్మలు' వేచివుండే లోకంలోని అతి మానసిక ప్రజ్ఞ - దీనిని టిబెట్ యోగులు, హిమాలయాలలోని గురువులు యోగ పరిభాషలో 'బార్డో' (Bardo) అంటారు.మన హిందూమతంలో దీన్ని 'విరజా' అంటారు. అంటే మరణించిన వ్యక్తి ఆ జన్మకు సంబంధించిన వన్నీ మరచిపోయి మళ్లీ తరువాత జన్మ కోసం వేచివుండే స్థితిలో వారి మనస్సు ఏఅంతస్థులో పనిచేస్తూంటుందో దానినే 'విరజ' లేక 'బార్డో'(Bardo)అని యోగులు పిలిచే స్థితిని డాక్టర్‌విట్టన్ సులువైన మెడికల్ ప్రక్రియ ద్వారా మెటాకాన్షస్‌నెస్ లేక పూర్వజన్మప్రజ్ఞలోకి పంపేవాడు.

కాని ఈ జన్మలోని అణచివున్నకోర్కెలు నిద్రాణమైన జ్ఞాపకాలు మామూలు సైకోథెరపీ ద్వారా త్రవ్వితీసి, హిప్నోథెరపీ ద్వారా మానసిక

రుగ్మతలేమైనా వుంటే బైటికి వచ్చేలా ప్రక్షాళన కార్యక్రమం పూర్తి ఐనాకగాని గత జన్మలోని 'మెటాకాన్షస్‌నస్' అనే అతి మానసిక ప్రజ్ఞలోకి పేషంటును పంపటం వీలుకాదు! ప్రవమాదంకూడా! ఎందుకంటే ప్రతీవ్యక్తీ మనస్సూ అతడు భయపడే అనుభవాలనుంచి తప్పుకుంటుంది సహజంగానే! అలానే మృత్యువన్నా, తనకి యిష్టంలేని జ్ఞాపకాలన్నా మనస్సు వెనక్కులాగుతుంది. భయంతో బాధతో! అలానే ఒక వ్యక్తి చేసిన పాపం లేక హింస, అన్యాయం లేక ఆత్మప్రబోధానికి వ్యతిరేకంగా చేసినవాటి జ్ఞాపకాలనుంచి కూడా ఆ పేషెంటు మనస్సు తరచూ అయిష్టంతో వెనక్కువదలి సైకోథెరఫీ నుంచి వెనక్కు తగ్గటం డాక్టర్ విట్టన్, ఆయన సహచరుడూ, వైద్యుడూ, డాక్టర్ ''జోఫిషర్'' తరచూ తమ పేషెంట్ల చికిత్సలలో 30 ఏళ్ళ అనుభవంలో గమనించిన యదార్థ సత్యం! అందుకే మనస్సు యిలా అణచిపెట్టివుంచుకునే స్వభావం వల్లనే మనకి గతజన్మల జ్ఞాపకాలు గుర్తుకురాకపోవటం! మానసిక ప్రక్షాలన పూర్తి అయితేగాని అతిమానసిక ప్రజ్ఞ తలుపులు తెరచుకోవు! ఇది సహజమే కదా! అందుకే జెన్నీ విషయంలో కూడా మానసికచికిత్స పూర్తి అయినప్పటికీ మిగిలివుంటే ఆ సమస్యల అన్వేషణ ఈ జన్మలోని కారణాలతో విశ్లేషణతో తేలకపోతే అమె రోగసమస్యలు నిర్మూలన కాకపోతే, అప్పుడే దానికి కారణాలు, నివారణ పూర్వజన్మ అనుభవాలతో ముడిపడివుంటుంది! అందుకని జెన్నీ విషయంలో కూడా ఆమెను తన వైద్యసహాయంద్వారా అతిమానసికప్రజ్ఞ (Meta Consciousness)లోకి పంపాలని వైద్యుడిగా నిర్ణయం తీసుకోక తప్పిందిగాదు (ఆపరేషన్ తప్పదని సర్జన్ నిర్ణయించినట్లే!)



# 3

# 'గతజన్మల' పాపాలకు వైద్యచికిత్స!

## — అమెరికన్ వైద్యుల అద్భుతాలు!!!

డాక్టర్ టేబుల్‌మీద పడుకున్న కొద్దినిమిషాల్లోనే జెన్నీ తన శరీరంలోంచి పొగమంచులా తేలివైద్యుని గది కప్పుకు దగ్గిరలో ఒక బెలూన్‌లో ఊగిసలాడటం గమనించింది. ఆశ్చర్యంతో వెనుదిరిగి చూస్తే జెన్నీ ఫోటోలను పోలిన శరీరం టేబుల్‌మీద వుంది. మరుక్షణంలో ఆమె తనకే తెలీకుండా ఒక నీలాకాశంలాంటి తెరను పోలిన లోకంలోకి తేలిపోయింది. కాస్సేపు ఏమైందో తెలియలేదు.

అది 1689 సంవత్సరం. లండన్ నగరం! స్పష్టంగా అతి మానస ప్రజ్ఞలో తేదీలు సంవత్సరాలు పుస్తకంలో పేజీల్లాగా గుర్తించబడివుండటం ఆశ్చర్యకరమైన అనుభూతి! లూసీ బౌడెన్ అనే బ్రిటిషు వనిత! ఒకే ఒక్క మూడేళ్ళ కూతురు. మానసికంగా ఎదగని మతిలేని బిడ్డ! 'ఇది ఒక బరువు, వదిలించుకో! దీన్ని పెంచడం అసాధ్యం' అంటూ ఇరుగుపొరుగు

స్నేహితులు లూసీని అవసరంలేని సలహాలతో కుళ్ళబొడిచేశారు. ఎంత చెప్పినా లూసీ మాతృహృదయం అంగీకరించలేదు! తల్లిగా భారమైనా భరించాలనే నిశ్చయించుకుంది. కాని చేతిలో చిల్లిగవ్వలేదు. బ్రతుకే బరువైన దారిద్ర్యం తన పొట్టపోసుకోవడానికి చాలని బాధలు. ఇక తన మతిలేని బిడ్డను సాకే పరిస్థితేది? వారి నుంచీ లభించే చందాలవల్ల, బిచ్చంవంటి సహాయంవల్ల జీవనాన్ని నడిపిస్తూ వుండేది గతజన్మలోని జెన్నీ! ఆశ్చర్యం! ప్రతిరోజూ యింటినుంచి బైటికి వెళ్ళే సమయంలో లూసీ బౌడెన్ పిల్లకు నీళ్ళుపోసి, పాలుపట్టి, భద్రంగా గదిలో తలుపేసి యింటి బయట తాళంవేసి మరీవెళ్ళేది. ఎవరైనా తనకు తెలీకుండా తనబిడ్డను దొంగిలించి ఏదైనా అపకారం చేస్తారేమోనన్న భయంతో!

కాలం గడవటం టేపురికార్డుమీద చురుకుగా సాగినట్లు గత జన్మస్మృతులు సినిమాలోని దృశ్యాల్లాగా శరవేగంతో కదలిపోవడం కనిపించింది. ఒక రోజు అనేకమంది స్నేహితులుతో లూసీ షాపింగుకి అయిష్టంగానే అంగీకరించింది. 'అందరం కలిసి జల్సా చేసుకుందాం' అని ఆపేశారు! అయిష్టంగానే అంగీకరించింది. 'త్వరగా వెళ్ళిపోదాంలేం!' అనుకుంటూ. ఇంతలో మద్యం నిషాలో అయిదారుగంటలు గడిచిపోయింది. పార్టీ అయిపోయిన వెంటనే ఆదరాబాదరా లూసీ తన యింటిలో తాళంవేసి వచ్చిన మతిలేని పసిబిడ్డ గుర్తుకువచ్చింది. పరుగుపరుగున యిల్లుచేరాలని ఉరుకుతీసింది....

.... ఇంతలోకే వీధి మొదట్లోనే జనం గుమికూడివున్నారు ఒక యింటిపైనుంచి నల్లని దట్టమైన పొగ కారుమేఘాల్లావస్తోంది తన యింట్లోంచే! పెద్దగా ఏడుస్తూ చుట్టూ రద్దీగా ఉన్న జనాన్ని తోసుకుంటూ లూసీ పరుగెత్తింది!

అప్పటికే అంతా అయిపోయింది. ప్రమాదవశాత్తూ వంటపొయ్యిగ్యాసు అంటుకొని లూసీ యింటితోపాటు మతిలేని

పసిబిడ్డకూడా కళ్ళముందే బూడిదవటం చూసి మాతృహృదయం విలవిల్లాడింది! బలంగా పదిమంది పట్టి మండుతూన్న యింట్లోకి దూకకుండా లూసీని ఆపారు! గింజుకుని ఏడ్చింది. చావాలని రోదించింది. తన మాతృహృదయం బాధతో మెలికలు తిరిగింది. తన గర్భాశయంలో ఒక డెక్కవంటి మెలిక! జాలితో అణుచుకున్న బాధతో తనమీద తనకే అసహ్యంతో మెలితిరిగింది. ఆ జ్ఞాపకాలతో లూసీగా మరణించిన జెన్నీ ఆత్మ మళ్ళీ ఒకసారి ప్రేతాత్మలుండే అతి మానసికలోకం లోకి తేలియాడింది. ఆకాశంలోంచి క్రిందికి తన గతంలోకి చూసింది.

... అకస్మాత్తుగా పొలికేకలు వేస్తూ, అరుస్తూ టేబుల్‌పై మెలికలు తిరిగిపోతున్న జెన్నీని అనునయిస్తూ, సముదాయిస్తూ డాక్టర్ విల్టన్, నర్సులూ సేదతీర్చి మేల్కొలిపారు. ఇది ఆమె ఒక జన్మలోని జ్ఞాపకం మాత్రమేనని తేలింది. అది తరువాతి ట్రీట్‌మెంట్‌లో బయటపడింది! జెన్నీ చూసింది కేవలం పీడకల కాదు ఊహజనితం కాదు! లేక హిప్నసిస్‌లో యిచ్చిన మానసిక ప్రేరణ (Hypnotic Suggestion) కాదని నిశ్చయంగా ఋజువుచేసే అనుభూతి...

ఆమె గర్భాశయంలో డెక్కపడ్డట్టు సంసారిక జీవితానికి అడ్డుగా నిలిచిన పీడ ఆనాటి నుంచీ తొలిగిపోయింది!

మరి మిగతా గత జన్మల అనుభూతి కూడా తిరగతోడాలి! అప్పుడే పూర్తి ప్రక్షాళన కావడం జెన్నీ అంతరాత్మకి విశ్రాంతి లభించడం జరిగేది!

అది 18వ శతాబ్దపు ప్రారంభకాలం. క్రైస్తవఫాదరీలు పొడుగాటి బురఖాలతో మధ్యనిలబడివున్న ఒక నిస్సహాయ స్త్రీమూర్తికి చేతులకు కాళ్ళకూ గొలుసులను వేసి బంధిస్తున్నారు. నల్లని పొడుగాటి విషాద సూచకమైన కమీజువంటిది ఆమెకు తొడిగారు. ఆమె సిగ్గుతో భయంతో

తలదించుకుని వారుపెట్టే చిత్రహింసలన్నీ మౌనంగాభరిస్తున్నది. ఆమె ఏంజిలాగా జన్మించిన జెన్నీ ఆత్మ! తను క్రైస్తవ మతం ప్రకారం చేసిన పాపాలకు ప్రక్షాళనగా ఈవంతడురువులచేతిలో చిత్రహింసలు అనిభవిస్తున్నదిగతజన్మ దృశ్యం!

ఆరోజుల్లో మధ్యకాలపు క్రైస్తవ మూఢవిశ్వాసాలలో భాగంగా జెన్నీలోని ఆధ్యాత్మికశక్తులు, అతిమానసికశక్తులు దైవశక్తులుగా (Spiritual Powers) గుర్తించకపోగా అవి సైతానుప్రభావం(Power of the Devil)అని క్రైస్తవభిషప్‌లు ఆమెకు ఆశిక్షవిధించారు. సైతాను శరీరంలోంచి పోవాలంటే ఏసుక్రీస్తు పేరిట ఆమెకాళ్ళకూ చేతులకూముళ్ళ చక్రాలు బిగించి చెరకుగానుగలో చెరుకుగడను తిప్పినట్లు తిప్పేవారు. నెమ్మదిగా అతినెమ్మదిగా. ఆమె ఎంత నీలైతే అంత మంచిదని!!! రక్తపాతాలు, తనబిడ్డ రక్షణ విషయంలో అజాగ్రత్త వహించానన్న గిల్టీమనస్సుతో మరణించిన లూసీ ఆత్మ ఏంజలాగాజన్మించి తనలోని నిద్రాణమైన ఆధ్యాత్మికశక్తులో మేలుకొన్న ఫలితంగా ఆనాడు క్రైస్తవ ఫాదరీలచేతిలో యిత్రహింసలలో మరణించిన జన్మలో ఏంజిలా!

మూలుగుతూ, మౌనంగా బాధనణుచుకున్న ఏంజిలా లూసీలాగా కేకలు వేయులేదు. చిత్రహింసలలో మరణించిన ఏంజిలా ఆత్మను వెంటాడమని డాక్టర్‌విట్టన్ నెమ్మదిగా అతినెమ్మదిగా ఆమెగతజన్మస్మృతుల టి.వి. చిత్రాలను చెదరకుండా హెచ్చరిక చేస్తున్నాడు.

'' ముందుకి ! యింకా ముందుకి వెళ్ళు! మరణించావు! యిప్పుడు యింకా ఏం జరిగింది! చూడు! భయంలేదు! నీవిప్పుడు ఆత్మవే! ''?

ఈ హెచ్చరికతో ఏంజిలాగా మరణించిన తాను ఆ నల్లని గొలుసుల చిత్రహింసలు శవం నుంచి పొగమబ్బులాగా విడివడి నెమ్మదిగా ఆకాశంలోకి తేలింది. క్రమంగా పైపైకి తేలిపోతున్నది... అది ఏలోకమో తెలియదు. సూర్యుని చూట్టూ వెలిగే బంగారు నీరెండవంటి కాంతి!

అక్కడ వెన్నెలలాగా చల్లగా, అతి సుకుమారంగా వచ్చితాకే చల్లటిగాలిలాగా ఎక్కడినుంచో దయార్ద్రమైన ప్రేమతరంగాలు!!! పరికించి చూస్తే ఎదుట ఆకాశంలో ఒక దివ్యమూర్తి! జాలితో ఆ కళ్ళు ఏంజిలాపై దయావర్షం కురిపించాయి. సన్నగా ఆజానుబాహువైన విగ్రహం. ఆయనను చూస్తేనే ఆయనముందు తాను నిలబడే అర్హతకూడా లేదని సిగ్గుతో చిన్నతనంతో చీమలాగా కుచించుకుని భయంతో నిల్చున్నది ఏంజిలా! క్రమంగా ఆ తేజోమూర్తి నుండి ప్రసరించే బంగారు కిరణాలు బాధతో, దుఃఖంతో, దిక్కులేని ఒంటరితనంతో క్షోభించే ఏంజిలా అంతరాత్మను వచ్చితాకాయి!

''భయంలేదు! ధైర్యంగా వుండు!! బాధపడకు!!'' అంటూ పలికిన మాటలు మంత్రాలలాగా, టానిక్కులా శక్తినిచ్చాయి ఆమెలోకి ఒక కరెంటును పంపుచేసినట్లుగా పనిచేసాయి. క్షణాలమీద ఆమెలోకి ఒక తేజస్సు నింపుకున్నది. నిటారుగా లేచి నిలబడింది. తల ఎత్తి ఆకరుణామూర్తి వంక భక్తితో, కృతజ్ఞతతో చూసింది. ఆయన ఆపాదమస్తకం ఏంజిలా ఆకారాన్ని నిమిరినట్లు పరికించి చూసాడు అంతే! ఏంజిలా కాళ్ళకూ చేతులకూ కట్టివున్న గొలుసులు వాటంతట అవే రాలిపడ్డాయి. ఆయన విగ్రహం మరింత స్ఫుటంగా కనిపించింది.

ఆయన పద్మాసనంలో ఆసీనులై ఉన్నారు. బుద్ధుడిమూర్తిలాగా! సూర్యతేజస్సు వంటి కాంతి ఆయన శిరస్సుచుట్టూ ఆవరించివున్నది. ముఖం ఒక ఋషీశ్వరుని వలే దేవతా పోలికలతో అతిలోక సౌందర్యం, కాని ఒక హిందువుల లేక బౌద్ధుల దివ్యపురుషుడిలాగ వున్నది! ఆయన కరుణతోనే తన కర్మబంధాలు, తనలోని గిల్టీఫీలయ్యే చింతనలు గొలుసుల్లాగే వీడిపోయాయని తెలుసుకున్నది ఏంజిలా ! అప్పుడాయన స్పష్టంగా ఆమెకు ఆదేశాలిచ్చాడు

''చూడు! క్రిందకుచూడు నీకర్మ యొక్క గతిని ప్రత్యక్షంగా చూడు!''

ఆమెకు విమానంలోంచి చూస్తే కనపడే న్యూయార్కు నగరంలాగ క్రిందవున్న తన జన్మలన్నీ బారులుకట్టి కనిపించాయి. ప్రతీజన్మలో చేసిన దానికీ మరుజన్మలో అనుభవించినదానికీ దారంలాగ మల్లెపూలను కలిపికట్టే చెండులాగ ఒక బంగారుతీగవంటి కర్మసూత్రం గోచరించింది. క్షణంలో భూమిపైన ఆకాశంలోనే ఒక మైదానంవంటిది మసక వెలుతురులో కనిపించింది. దానిపైన లేతనీరెండకాంతిలో పసిబిడ్డలు కొందరు ఆడుకుంటున్నారు. ఎంతోముద్దుగా చూడటానికి బొద్దుగా ముచ్చటగొలిపేలా వున్నారు... వారి మధ్యకు తాను ఆకాశంలోనుండి దిగినట్లు తేలియాడుతూ వాలింది. పిల్లలందరూ ఆమెను చూశారు. కాని గమనించలేదు. అందులో ఒకపిల్లాడు తల ఎత్తి ఏంజిలావంక చూసి మెరిసేకళ్ళతో తన చిట్టిచేతులుచాపి కేరింతలు కొట్టాడు.... ఎత్తుకోమన్నట్లుగా తన ప్రేమను మమతను ఆపేక్షను కోరినట్లు వున్నాయా చూపులు.

అప్రయత్నంగా జెన్నీలోమాతృప్రేమపొంగి ఆబిడ్డను దగ్గరకు తీసుకొని గుండెలకు అదుముకున్నది!.... అంతే! మరుక్షణంలో తన కడుపు బెలూన్లాగా ఉబ్బినట్లు అనుభూతి కలిగింది!!! ఎదురుకుండా ఆ పిల్లవాడు తనవంకే చూస్తున్నాడు.

ఆ పిల్లవాడే తరువాత తన కడుపున బిడ్డగా పుట్టబోతున్నాడని ఈ అనుభూతితో స్పష్టంగా తెలిసిపోయింది. ఏంజిలా ఆత్మగా మరణించిన జెన్నీసాండర్స్‌లోని అంతరాత్మకు!

''అవును అతడే! లూసీగా నీ కడుపున పుట్టిన బిడ్డ. తిరిగి తల్లిగా అతనికి జన్మనిచ్చి నీ ప్రేమరుణాన్ని తీర్చుకో! నీ కర్మబంధాలను ప్రేమద్వారా తీర్చుకో! అప్పుడే నీ మాతృత్వపులోటు శాశ్వతంగా నీ

ఆత్మలో తీరుతుంది!'' పైనున్న తేజోమూర్తి నుండి ఈ ఆదేశాలు మానసికంగానే వినిపించాయి. తరువాత జెన్నీసాండర్స్‌కు తెలిసింది. ప్రతి ఆత్మకూ కర్మలయొక్క పద్దును సరిచూసే అలాంటి దివ్యపురుషులు తగుసలహాలిచ్చి సహాయం చేస్తున్న అనుభూతి చాలామంది పేషంట్లకు కలుగుతుందని! వారు 'కర్మదేవుళ్ళు' (Lords of Karma) అని దలైలామాల హిమాలయ సాంప్రదాయంలో పిలుస్తారు. మన హిందూసాంప్రదాయంలో చిత్రగుప్తుడి ఎకౌంటు సరిచూసే ధర్మదేవత వీరేనేమో! అలాటివారు 3గురు, 4గురు మరికొన్నిసార్లు 5గురు 7గురుకూడా తమ మానసిక వైద్యంలో అనేకమంది పేషంట్లు చూసిన దాఖలాలు విట్టన్ కేసుల రికార్డులలో వున్నాయి.

ఈ అనుభూతివల్ల జెన్నీకి, జెన్నీ ఆత్మకు అందించబడిన 'కర్మసందేశం' స్పష్టం కాసాగింది. తన కడుపున జన్మించి అసంపూర్ణంగా మరణించిన బిడ్డకూ, ఆత్మీయతతీరక, తల్లిగా మాతృత్వాన్ని పొందకుండా మరణించిన ఏంజిలా, లూసీ జన్మలలోని తన ఆత్మకూ కూడా ఒక్కటే వైద్యం. జన్మనివ్వాలి! తద్వారా తన మాతృత్వం పరిపూర్ణతకావాలి! ఆ పిల్లవాడికి కూడా మాతృప్రేమ లభించనీ! చెడుకర్మనుంచి విముక్తి లభించాలంటే మాతృప్రేమ అందాలి. ఈ విధంగా తల్లిగా తనకూ, బిడ్డగా ఆ జీవునికీ విముక్తి లభించే తరుణోపాయం ఒక్కటే! మాతృత్వంద్వారా తల్లిప్రేమద్వారా జన్మలద్వారా అనుబంధంద్వారా ఒకరికొకరు అందించే అనుబంధం, ఆత్మీయతా ఆత్మలకు అవసరం! అవి వికసించడానికి, చెడుకర్మల నుంచి తరించడానికి, జన్మలూ, కర్మలూ అనుబంధాలూ తప్పించుకోరాని ఆధ్యాత్మికశిక్షణలోని తరగతులు. ఎక్కడైనా తప్పిపోతే వెనక్కిపోయి ఆ తరగతి పాసైనప్పుడే ఆ ఆత్మకు (తల్లికీ, బిడ్డకూ) విముక్తికలిగేది. అదే ఋణానుబంధం! ఆత్మల విముక్తికీ ఆ అనుభూతయ్యే వికాసం!!!

ఆ గాఢమైన గత జన్మ విశ్లేషణ నుంచి మేల్కొన్న జెన్నీకి బోధపడింది. తన చిన్నప్పటి హింసలు తల్లినుండి అనుభవించినది, గర్భాశయంలోని డెక్కువంటి మెలిక తన సంసారిక సుఖానికి అడ్డుతగిలిందీ, తాను ప్రసవించవలసిన పిల్లవాడి అబార్షన్ 10-4-1980 తేదీతో వీటికి కల లింకు ఏమిటో.

ఇప్పటికైనాగాని జెన్నీసాండర్స్‌కు తన కర్మ పాతపద్దును తెరవలేదని, ఏనాటికైనా దాన్ని ఖర్చుచేయాలని స్పష్టంకాలా! అందుకే అందుకే ... తలిదండ్రులు లేని శిశువులకేంద్రం (orphanage)లో మానసికంగా వెనుకబడిన (Retarted Children) ఆలనా పాలనలకు సంబంధించిన ఉద్యోగాన్ని జెన్నీసాండర్స్ ఎన్నుకోవటం తన తెలివికాదని పైనున్న కర్మదేవతల సహాయం, ప్రబోధన ఫలితమేనని, అస్పష్టమైన తన శారీరక మానసిక సాంసారిక రోగాలకు వెనుక మూడు జన్మల గాథవున్నదన్నమాట! తన సమస్యలకు కారణం తనకు స్పష్టంగా మనస్సులో విడివడటంతో జెన్నీ జీవితం ఒకపువ్వులాగా విప్పారింది! అనుకోకుండా అంతర్యంలో ఆకాశంలానిర్మలం కాజొచ్చింది. ఇప్పుడు ఎవరిమీదా వల్లమాలిన ద్వేషంగాని, కక్షగాని మునుపటిలాగ కలగటంలేదు.

చివరికి తనను చిన్నప్పుడు హింసించిన తల్లిని చూసినా జాలీసానుభూతీ కలిగాయే గాని మునుపటి కక్ష, మాతృత్వంపై శత్రుత్వంలా దానితోపాటు లింకుపడివున్న గర్భాశయరుగ్మత ఆ రెండూ కలిసి మటుమాయం కావడం ఆశ్చర్యం!!!

పూర్వజన్మల అనుభూతితో రోగనివృత్తి కూడా కావడం అమెరికా వైద్యచరిత్రలో డా॥ జోయెల్ విట్టన్ వంటి ఘనవైద్యులు ప్రారంభించిన నూతన శకం!

జెన్నీసాండర్స్ అనుభవాలను రికార్డుచేసిన ఆమెకేసు ఫైలును మూసేస్తూ ఆమెకు చికిత్సచేసిన డాక్టర్ విట్టన్ అన్నమాటలివి!

''ఇంతజరిగాక ఇన్ని జన్మల కార్మిక శిక్షణ పొందిన శాండర్సుని యిప్పటినుంచీ స్వయంగా బిడ్డలను కన్న తల్లులకంటే మమతతో ఆత్మీయతతో దిక్కులేని బిడ్డలను ఆదరించి పెంచడంలో ఆశ్చర్యమేమున్నది? ఆమె జన్మజన్మలనుంచి నేర్చుకోవాల్సిన పాఠాలుపూర్తిగా జీర్ణించుకున్నది కదా? యిప్పుడు ఆత్మతో తల్లి జెన్నీ సాండర్సు!''

ఈ మాటలు పిల్లలులేక బాధపడే అనేకమంది తల్లులకు సంతానంలేక పూజలు జపాలుచేసే గత చెడుకర్మల బాధితులకు కన్నులు తెరిపించే వెలుగురేఖలు! అంతేకాదు! ఆధునిక మెడికల్ చరిత్రలోనే గ్రుడ్డిగా వైద్యంచేసే డాక్టర్ల చీకటి అధ్యాయం ముగిసి ఆత్మకు వైద్యం చేసే సత్యయుగ విజ్ఞానానికి తొలిసంధ్యకాంతులు. రానున్న సత్యయుగానికి ఇవి సైన్సుపరమైన సందేశాలేమో? ఎవరికి తెలుసు?



4

# ''పునర్జన్మ'' - అనేది, సంభవమా?

న్యూటన్ సిద్ధాంతం ప్రకారం లెక్కవేస్తే ఒక జన్మలో మనిషి చేసిన కర్మ దాని ఫలితం అనుభవించడానికి ఆ జీవితమంతా అనుభవించినా చాలనప్పుడు మిగిలిన ఆకర్మను అనుభవించేదెప్పుడు అని సహజంగానే ప్రశ్నఉదయిస్తుంది!

ఈ జన్మకు చివర మిగిలిన కర్మ (పుణ్యమైనా, పాపమైనా) మరుజన్మలో ''పద్దు''-కింద ప్రారంభిస్తుంది. ఈ విధంగా 'కర్మసిద్ధాంతం', 'పునర్జన్మ సిద్ధాంతం' ఒకదానితో ఇంకొకటి ముడిపడి వున్నాయి. అసలీ పునర్జన్మ సిద్ధాంతం ఏ సూత్రంమీద ఆధారపడి పనిచేస్తుంది? అనేది శాస్త్రదృక్పదంతో ఆలోచిస్తే — అసలీ పునర్జన్మ అనేది వుండటానికి అవకాశం వుందా? — అన్న ప్రశ్నలు ఇతర మతాలతో హిందూమతాన్ని సరిపోల్చి చూసినప్పుడు ఉదయించే

సందేహాలు! ఎందుకంటే ముస్లిముల ఇస్లాంమతం, క్రిస్టియన్ మతమూ మనిషికి ఒకే జన్మవుంటుందనీ, అది ఈమరణంతోటే సరిఅనీ ఇంకా మరుజన్మలుండవనీ సామాన్యంగా భావిస్తారు. ఐతే పునర్జన్మ అనేది వుండటం శాస్త్ర దృక్పథంతో యోచిస్తే సహేతుకమా? అన్న ఆలోచన ఈనాటి హిందువులకుకూడా ఇతరమతాల్ని చూసినతరువాత మనస్సులో తలయెత్తే సందేహం! దానికి ఈ పునర్జన్మ సిద్ధాంతాన్ని కొంత లోతుగా పరిశీలిద్దాం.

ప్రకృతిలో సహజంగానే మనకు కొట్టవచ్చినట్టు కనబడే యదార్థవిషయం - ఒకటుంది! అదే, మనిషికీ మనిషికీ మధ్య మనకి కనిపించే తేడా!

ఉదాహరణకు ఒకే పాఠశాలలో ఒకే తరగతిలో చదివే పిల్లలను పరిశీలిస్తే అతిచిన్నపిల్లల వయస్సులోనే ఒక్కొక్కరి మధ్యా , కనిపించే తేడా ఎంతో వుంటుంది! ఒకరు బాలమేధావులైతే అదేవయస్సుగల ఇంకొక పిల్లవాడు జీవితాంతం కష్టపడినా ఒక్క ముక్కకూడా చదువులోపైకి రాడు. ఒకడు బాల్యంలోనే గొప్పసంగీతగాయకుడో లేక కళాకారుడో కావటం చూస్తున్నాము. అలాగే మరికొందరు పుట్టుకనుంచే జ్ఞానులుగా పుట్టిన శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీరమణమహర్షి షిరిడీసాయివంటి అద్భుతజన్మలూ కనిపిస్తాయి. మరి,వ్యక్తుల వీరందరికీ పుట్టుకతోనే ఇంతింతతేడా ఎలా వచ్చింది? అని ఆలోచిస్తే, పూర్వజన్మలో ఒక్కొక్కరు చేసిన కృషి లేదా వారి 'గతజన్మలోని కర్మఫలితమే '.

అలా కర్మ పునర్జన్మ సిద్ధాంతాన్ని అంగీకరించకపోతే ఏమౌతుంది? భగవంతుడు పుట్టుకతోనే కొందరు జీవులను అదృష్టవంతులుగాను, తెలివీ, పాండిత్యమూ, కళలూ ఇచ్చి సృష్టిస్తే, మరికొందరిని కావాలని

మూఢులుగానూ, ధనహీనులుగానూ కష్టాలలో బాధపడేవారిగానూ సృష్టిస్తాడని అనుకోవలసివస్తుంది! కాని సర్వజీవులకూ తండ్రియైన ఆ సృష్టికర్తకు ఈ ఒకరియందు పక్షపాత దృష్టిగాని మరి ఇంకొకరియందు ద్వేషబుద్ధి గాని ఎందుకుంటుంది? అలా వుండదు! కాబట్టి మరి వీరిలో కనిపించే తేడాలు జ్ఞానము, అదృష్టమూ, తెలివీ ఇలాంటి మనిషి మనిషిలో తారతమ్యాలూ వారివారి పూర్వజన్మలలో జీవించిన అనుభవాల ఫలితమే అని రూఢీఅవుతున్నది. కాబట్టి శాస్త్రీయతర్కంతో చూసినా ఈ ప్రపంచంలో కనబడే వైవిధ్యం అలా ఎందుకుందో పునర్జన్మ సిద్ధాంతాన్ని అంగీకరిస్తేనే బోధపడతుంది. అందుకే ప్రాచీన వేదకాలం నుంచీ హిందూమతం, జీవులకు పునర్జన్మ అనేది వున్నదనీ మానవుడు ప్రతిజన్మకీ తన జీవితంలోని అనుభవాలదృష్ట్యా ఎదుగుతూ క్రమక్రమంగా పరిణామం (Evolution) చెంది చివరకు సర్వోత్తమమైన దైవసాక్షాత్కారాన్ని పొందుతాడు అన్నదే హిందూమతంలోని మూలసిద్ధాంతం అనబడే పునర్జన్మల గురించిన సత్యము.

ఉపనిషత్తులలో నచికేతుడనే బాలఋషి యోగశక్తితో శరీరాన్ని వదలి యమలోకానికి చేరుకొని అక్కడ జీవులకు జన్మ మృత్యువుల అధికారి ఐన యమధర్మరాజుతో 'మృత్యురహస్యం' గురించి ప్రశ్నిస్తాడు. అతి ప్రాచీనమైన ఈ ఉపనిషత్తులో యమ-నచికేతుల సంవాదంలో ఈ పునర్జన్మను గురించి ఎన్నో రహస్యాలు తెలుపబడినవి.

అంతేగాక అనుభవంలోకూడా పత్రికలలో అనేకసార్లు ఎక్కడెక్కడో జన్మించిన పిల్లలకు సైతం పూర్వజన్మ జ్ఞానం కలగటం తాము ఇదివరకు ఎక్కడ జన్మించామో తమ తల్లిదండ్రులకు చెప్పటం తరువాత పరిశీలిస్తే పూర్వజన్మలోని పేర్లు ఉండేస్థలాలు ఇంకా జీవించివున్న వాళ్ళతాలూకు బంధువులు మొదలైన వివరాలు సరిపోవడం- వీటన్నిటితో పాటు

సైన్సులో మనస్తత్వ శాస్త్రజ్ఞులు చేసిన పరిశోధనలవల్లా పునర్జన్మ సత్యమని ర్యాఢీ అవుతున్నది.

ఇంకొక నిదర్శనం కూడా కనిపిస్తోంది. ప్రాచీనమహర్షులు వ్రాసిన 'నాడీగ్రంధాలు' అనబడే తాటియాకు పుసకాలపై యుకొన్నివేల సంవత్సరాలకు పూర్వమే పుట్టబోయేజీవుల జాతకాలు వారిపేర్లు వారు పుట్టేకాలము వారిజీవితచరిత్రలోని సంఘటనలూ వారు జీవించే ఆయుష్షు ఎంతకాలమో ఇలాగ అద్భుతంగా అనేక అంశాలు వర్ణించబడివుండటం ఈ **నాడీ గ్రంధాలను** పరిశీలించినవారందరికీ తెలిసిన సత్యమే !

ఈవిషయమై ప్రఖ్యాత పరిశోధకుడూ మహాపండితుడైన శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు పురాతన గ్రంధాల సేకరణకై గ్రామగ్రామాలూ సంచారం చేసినప్పుడు 'నాడీ' - గ్రంధాలలో ఋషీశ్వరులు వ్రాసినభవిష్యత్తు యధాతధంగా తన జీవితంలో ఎలాగ జరిగిన వాటితో సరిపోతున్నదో తమ పరిశోధనావ్యాసాల్లో, 'భారతి' పత్రికలలోనూ ఇంకా 'కృష్ణా' పత్రికలోనూ మరిన్ని రచనలలోనూ ఋజువుచేశారు.

ఈ నాడీగ్రంధాల్లో అగస్త్యనాడి, వశిష్ఠనాడి, భృగుసంహిత, కాశ్యపసంహిత, శుక నాడి, కౌమార నాడి, శుక్రనాడి, కాక భుషుండి నాడి స్కందనాడి, కృష్ణ సహదేవవాక్యం సప్తర్షినాడినంటి అనేక ప్రసిద్ధి చెందిన నాడీగ్రంధాలు ఈనాటికీ మద్రాసు, బెంగుళూరు, కేరళ, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో ప్రభుత్వప్రచురణలుగా కూడా కనిపిస్తున్నాయి. వీటిలోంచి అనేకమంది ప్రఖ్యాతవ్యక్తుల శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీవివేకానంద, మాస్టరు C.V.V. జీవితాలను అందులోనుంచి ఎత్తి వ్రాయించుకోవటంకూడా పరిశోధనలో ఋజువైన యదార్ధసత్యము! ఈ నాడీగ్రంధాలపైన బోలెడంత సాహిత్యమున్నది.

ఈ నాడీగ్రంధాలలో వ్రాయబడ్డ జీవులజాతకాలలో శ్రీరామకృష్ణ పరమహంస జీవితము, స్వామీ వివేకానందుల నాడీజాతకము, (కుంభకోణం సద్గురువు) Master C.V.V.గారి జాతకము, గాంధి, లాల్ బహదూర్‌శాస్త్రి, జవహర్‌లాల్ నెహ్రూవంటి ప్రముఖుల జాతకాలు పరిశోధకులు సేకరించి పూర్వపు ఋషీశ్వరులు వ్రాసిన శ్లోకాలను ఎత్తి వ్రాసి ప్రచురించటం కూడా జరిగింది. అవేగాకుండా, ఎందరో సామాన్యుల జాతకాలు (నావంటివారికి) కూడా అందులో వ్రాసిన ఫలితాలు ఎక్కడా బీరుపోండా యథాతథంగా జరగటం నేటికీ నాస్తికులకు సహితం నోటమాటరాకుండా నిరుత్తరులను చేయగల సాక్ష్యాధారం. (శ్రీరామకృష్ణ పరమహంస నాడి — **అనుబంధం** -లో చూడండి!)

## "గత-జన్మల పద్దు" (పూర్వజన్మకాండ) :-

ఈ నాడీగ్రంధాలలో ముఖ్యంగా కనిపించే ఆశ్చర్యం — జాతకుని పేరు, తల్లిదండ్రుల పేర్లు **జీవిత వివరాలను** భవిష్యత్తుగా వ్రాయడమే కాకుండా అతడు **క్రిందటి జన్మలో** ఏపేరుతో ఎక్కడ జన్మించాడో ఆజన్మలో చేసిన చెడుకర్మ, పుణ్యకర్మల వివరాలు వాటి దోషాలనివృత్తికి చేయవలసిన జపము, శాంతీవంటి నివారణోపాయాలు వ్రాయబడివున్నాయి. అంతేకాదు! ఈ జీవుని ఆయుష్షు ఎన్ని సంవత్సరాల ఎన్ని నెలలు నడుస్తుందో, ఇతడు మరణించాక తిరిగి ఎంతకాలానికి ఫలానాగ్రామంలో ఫలానాపేరుతో ఎలాగ జన్మిస్తాడో కూడ 'పుర్వజన్మకాండ ' అనే భాగంలో ఋషీశ్వరులు ఈ నాడీ గ్రంధాల్లో వ్రాసిపెట్టారు. సైన్సు యుగంలో సహితం విదేశీయులను కూడ ఆశ్చర్యపరిచే ఈ నాడీగ్రంధాలు కేవలం మనదేశంలోనే హిందూమత గ్రంధాలలోనే లభిస్తాయి. వీటివల్ల ముఖ్యంగా ఋజువయ్యే

''మనిషిమరణం ఎంతసత్యమో, తిరిగి జన్మించటంకూడా **అంతేసత్యం**'' — అన్న పునర్జన్మ సిద్ధాంతం యదార్థయని బుజువవుతున్నది.

ఇప్పుడు, మనం తేల్చుకోలేని ప్రశ్న — "అయితే మనిషి మరణించి ఎక్కడికి పోతున్నాడు? అతని జీవాత్మ ఏస్థితిలో వుంటుంది. **తిరిగి** తల్లిగర్భంలోకి ఎలా ప్రవేశిస్తున్నాడు? గతజన్మ జ్ఞాపకాలు అనేకులకు ఎలాగ **పునర్జన్మ జ్ఞానం** కలిగిస్తున్నాయి?'' — అన్న ప్రశ్నలన్నింటికి సమాధానం ఒక్క హిందూమతంలోనే లభిస్తోంది. ఇతరమతాలు ఇంతనిశితంగా వీటిని ఎత్తుకోవటమే లేదు!

ఉదాహరణకు 'బౌద్ధమతం'! బుద్ధుని జాతకకథలలో బౌద్ధులు సహితం ఈ **హిందూమత మౌలిక సిద్ధాంతాలలో** ఒకటైన **పునర్జన్మ** సిద్ధాంతాన్ని యదార్థమని అంగీకరించినట్లు బుజువవుతున్నది.

మనిషి **జన్మించటం మరణించటం** మధ్యలో జరిగే ఆశ్చర్యకరమైన **మార్పులు**, ఆ మధ్యదశలో జీవుని స్థితీ — హిందూమతంలో ఎలా వర్ణించబడినాయో **వచ్చే అధ్యాయంలో పరిశీలిద్దాం.**



5

# పూర్వజన్మల్ని - 'రికార్డు' చేసే — కర్మదేవతలు!

మైకేల్ గెల్లాండర్ (Michael Galander) Ph.D పేరుమోసిన ఒక కంప్యూటర్ సంస్థ (IBM) లో సీనియర్ రిసెర్చి ఆఫీసరుగా హాయిగా జీవిస్తూ - ఈ ప్రపంచంలోని అరుదైన అదృష్టజీవుడుగా తోటివాళ్ళకు కనిపించటం సహజమే!! ఎందుకంటే మైకేల్‌ను 'బ్రిలియంట్' అనీ, చాలా అందగాడనీ గొప్ప క్రీడాకారుడనీ, మంచి అంగసౌష్టవంగల స్ఫురద్రూపి అనీ, అతడిని చూడగానే అందరూ అనేక విధాల మెచ్చుకుంటారు. అందులో - నిజంకూడా లేకపోలేదు! కాని అదే అతని కష్టాలకు ప్రారంభం అవుతుందని, ఎలా ఊహించటం?

మంచితెలివైన మేధావిగా 'ఎలక్ట్రానిక్స్' (Electronics Technocrat) గా, వ్యాపారరంగంలో గొప్పపరిశోధనలతో కొత్తకొత్త యంత్రాలను కనిపెట్టి కంప్యూటర్లను సృష్టించగల 'జీనియస్'గా ఆ కంపెనీలో

'బాస్' - ఆఫీసర్లలోకల్లా మైకేల్ గొప్ప పేరు సంపాదించుకున్నాడు. అంతేకాదు సమాజంలో మంచివాడిగా మంచిపేరు ఉండాలని కూడా జవితంలో చాలా చేశాడు. ప్రతి ఆదివారం నీట్‌గా డ్రెస్సువేసుకొని ఇంట్లోంచి బైటికెళ్ళేముందు తన జేబులన్నీ చిల్లర నాణాలతో నింపుకొనిమరీ బైలుదేరేవాడు - దారిలో అతితాగుడుతో, బ్రతుకు వీధినపడ్డ బిచ్చగాళ్ళకోసం! అలానే తను నివసించే ఫ్లాట్ (Flat) బైటకివచ్చి ఇల్లు తాళంవేసుకునే ముందు కూడా 'కిచెన్'లోకెళ్ళి రాత్రి మిగిలిన బ్రెడ్డుముక్కలూ, మిగిలిపోయిన సగం బిస్కెట్టు పాకెట్‌లు, అన్నీ ఒక బ్యాగ్‌లో నింపుకొని అపార్టుమెంటు తలుపువేసి బైలుదేరేవాడు. దారిలో కనిపించినవారికి ఉదారంగా వాటిని పంచడమే మైకేల్‌కు మంచి పేరుతెచ్చే ప్రచారసాధనం! కానీ ఎవరికీ తెలియని ఒక భయంకరమైన నిజం మైకేల్ జీవితంలో దాగివుందని అతని ఆంతరంగిక మిత్రులకు కూడా తెలీదు. ఎందుకంటే అతని అంతరంగంలో దాగివున్న తీవ్రమైన వ్యధ ఒక్కోసారి అతను భరించలేనంతగా మంటపుట్టేది. అది ఎందుకో, ఎలా పోగొట్టుకోవాలో అర్ధంకాక విలవిల్లాడేవాడు ''మైకేల్ గెల్లాండర్''. ఎవరితోనూ చెప్పుకోలేనిదీ, చెప్పుకుంటే తనస్థితి బైటపడితే ... ఏమికాను. ఈ ప్రపంచంలో మనిషన్నవాడికి ఒంటరితనం దుర్భరం. అదే మైకేల్ నిత్యం అనుభవించే నరకం. అది ఏమిటో ఎందుకోకూడా అంతుబట్టక బైటికి నిగనిగలాడే మేడిపండులా. లోపల ప్రెజర్ కుక్కర్లోతీవ్రవేడిమితో సలసలలాడే వ్యధను మనస్సులోదాచుకుని, తనజెర్కిన్ పాకెట్లలో చేతులు పెట్టుకుని నాగాగా నడుస్తూ బ్రతికేవాడు.

ఒక్కోసారి తన మీద తనకే భరించలేని అసహ్యం, రోతా, లోపల్నించి తన్నుకునివచ్చేవి! అవి ఎంత తీవ్రంగా ఉండేవంటే ఏదైనా యిష్టమైన వస్తువు తింటున్నప్పుడు అకస్మాత్తుగా లెట్రిన్‌లోని మలం

కనిపిస్తే ఎలా డోకు వస్తుందో అలా వాంతిలాగా భరించలేని అసహ్యం కంఠంలోకి తన్నుకువచ్చేది.

తనకు ఏమౌతోంది? తనేమైనా మానసికరోగియా? రోజుల గడుస్తున్నకొద్దీ మైకేల్ గెల్లాండర్ అరుదైన తన అదృష్టజాతకుడి జీవితాన్ని ఒక్క-క్షణమైనా భరించలేని స్థితికి వచ్చేశాడు. నిప్పులాంటి నిజాన్ని ఫ్యాంట్‌జేబులో ఎన్నాళ్ళు దాచుకోగలడు? కానీ సమస్యేమిటో అంతుపట్టదు.

మైకేల్ ఆంతరంగిక జీవితంలోకూడా అర్థంలేని సమస్యలే ఎందుకంటే భార్య షారోన్ అందమైన యువతి, తెలివైంది చదువుకున్నది. ఆకర్షించి పెండ్లాడిన 'ఆదర్శదంపతులు'గా సమాజంలో ముద్రపడినా ఎందుకో ఏకాంతంలో మైకేల్ తన భార్యషారోన్‌ను సమీపించినప్పుడల్లా అణచుకోలేని భయం, తీవ్రమైన పరికితనం తలయెత్తేది.

ఐనా పట్టువీడలేదు మైకేల్! ఇదేదో మానసిక వికారంలే అనుకుంటూ సైన్సు ప్రకారం సర్దిచెప్పుకున్న పిడివాదం ప్రకారం ఎన్నోసార్లు 'నాకేం కష్టాలున్నాయి?' అని సరిపెట్టుకోజూసేవాడు.

మైకేల్ గెలాండర్ బాల్యంలో న్యూయార్కు-లోని బ్రాన్క్స్ (Bronx)లోని బీద కుటుంబీకులైన యూదులు (Jews) నివసించే కాలనీలోనే పెరిగాడు. తండ్రి అనాదరణకూ, తల్లి చెండుకుతింటూ రాచిరంపానపెట్టే తన దుర్భరమైన బాల్యంలోఅంతా ప్రతినిత్యమూ చివాట్లూ అనాదరణతోనే పెరిగాడు! యవ్వనంలో అడుగుపెట్టిన మైకేల్ ఆంతర్యాన్ని ఇదంతా పూర్తిగా వికృతంగా మార్చివేసింది! బయటి ప్రపంచమంటే బెదురుగానూ భయంగానూ అది క్రమంగా అసహ్యంగానూ, మారసాగింది! ఇతరులంటే 'జంకు' అయిష్టం

గూడుకట్టుకొని పెరగసాగాయి! అది చివరకు ఎంతదాకా వెళ్ళిందంటే తాను 'డ్రైవ్'చేసుకుని వెళ్తున్న కారులో పెట్రోల్ పూర్తిగా అయిపోయినా సరే పక్కనేవున్న పెట్రోల్‌బంక్‌లోకి వెడితే మాట్లాడాల్సి వస్తుందేమోనని రోడ్డుప్రక్కనే ఆపి ఊపిరి తీసుకుని ధైర్యం పుంజుకోవాల్సి వచ్చేది, యితరులకు ముఖం చూపించటానికి!

ఇరవయ్యేళ్ళు వచ్చేసరికి చదువులోనూ, స్కూల్లోనూ మంచిశ్రేణిలో కష్టపడి పాసవుతూ వచ్చినా, తనక్లాస్‌మేట్లకు ఎవరికీ అంతుబట్టని మానసిక క్షోమాలాంటిది మైకేల్ స్వభావాన్ని పచ్చిపుండులాగా వేధిస్తూ ఉండేది. చివరికి భరించలేక వైద్యసహాయాన్ని అర్థించక తప్పలేదు. న్యూయార్క్ Newyork, మిస్సౌరీ Missouri, ఒహాయో Ohio, సైంట్‌లూయీ St. Louis, నగరాలలో ఉద్యోగరీత్యా తాను ఉండవల్సిన ప్రతీ ఊళ్ళోనూ సంప్రదించిన వైద్యులందరూ అతనికి ఏరోగమూలేదని దానికి వైద్యం ఎలావుంటుందనీ ఎదురుప్రశ్నవేసేవారు! పైగా చక్కటి అదృష్టజాతకుడు అంటూ ఒక సర్టిఫికేట్ కూడా యిచ్చేవారు! మామూలు మానసిక చికిత్సచేసే సైకియాట్రి స్పెషలిస్టులకు (Psychiatrists) కూడా మైకేల్ గెలాండర్ రోగమేమిటో బోధపడలేదు! బైట మనుషుల్ని చూస్తే ఆ పిరికితనం ఎందుకు? అందమైన, యవ్వనంలోవున్న భార్యను సమీపిస్తే భరించలేని జుగుప్స తనమీద తనకే కలగటమేమిటి?

ఇవే మైకేల్ శేషజీవితాన్ని చెఱకుగానుగలో తిప్పినట్లు పీడించే 'శేషప్రశ్నలు'! ఇవి శేషప్రశ్నలుగానే మిగిలిపోయాయి!

ఎందుకంటే మైకేల్ మనస్తత్వంలోని కొన్నిలక్షణాలు - యితరులను చూస్తే బెరుకూ, అయిష్టతా, బహుశా తన చిన్నతనంలో బాల్యంలో అనుభవించిన అవమానం, బాధల కారణంగా ఏర్పడివుండవచ్చుననే సైకాలజీ వివరణ సమంజసంగానే కనిపిస్తున్నా

భరించలేని జుగుప్సా, తనపై ఏవగింపూ ఎవరికి అర్థంకాకుండా అంతుపట్టని ప్రశ్నార్థకంగానే మిగిలిపోయింది! పోనీ సెక్సు అనుభూతిద్వారా ఈ లోపలి మానసిక వ్యథను వెళ్ళగొట్టుకోవచ్చునని సాటి యువతులతో సరదాగా గడపాలని ప్రయత్నించినా వీలుపడేదికాదు. ఎవరిని తాను గట్టిగా ప్రేమించినా విపరీతమైన భయోత్పాతమూ, అసహ్యమూ తనలోంచి తన్నుకుని వచ్చేవి! గాఢంగా ప్రేమిస్తే తను తీవ్రమైనబాధలూ కష్టాలూ పడాల్సివస్తుందేమోనన్న అర్థంకాని భయం రోజురోజుకీ ఎక్కువకాసాగింది! ఏమిటీపీడ? అందమైన తన జీవితం అనుభవించకుండా పానకంలో ఈగపడ్డట్టు ఈ ఏహ్యత?

ఫిబ్రవరి 1979. చలిగావున్న ఈదురుగాలి మొహంమీదికి వీస్తుంటే బరువుగా అడుగులువేస్తూ మైకేల్ ఒక వైద్యుని వాకిట్లో అపాయింట్‌మెంట్ కోసం నిలిచివున్నాడు. ఆయనే డాక్టర్ విట్టన్ Dr. Whitton! గత జన్మల జ్ఞాపకాలు తిరగదోడి ఎన్నోరోగాలను నయంచేసిన పెద్దపేరు! డాక్టర్ విట్టన్ మైకేల్ సమస్యలన్నీ ఓపికగా విన్నాడు!

"నీది బైటి వైద్యాలతో నయంచేసే ఏరోగమూ కాదు! అసలు ఈ జన్మకి సంబంధించినదేదీ దీనికి కారణంలాగ కనిపించటంలేదు. నీ కష్టాలకు కారణమేమిటో చూద్దాం! ప్రయత్నించి చూద్దాం! నీ గతజన్మలో ఏమివుందో!"

ఆసక్తిగా యిష్టపడ్డాడు మైకేల్ గెల్లాండర్! అనాలోచితంగా అడుగుపెట్టిన డా॥ విట్టన్ టేబుల్‌మీద తన భయంకర బాధలకు తెర ఎత్తుబోతున్నానని ఎలా ఊహించగలడు? ఏం జరిగిందో చూస్తే భయంవేస్తుంది.

సైకిక్ ట్రీట్‌మెంట్ రోగులను పడుకోబెట్టే టేబుల్‌పై బారజాపుకొని పడివున్న మైకేల్ దాదాపు శవాకారంలో సగంమెలకువ సగంమృత్యువూ కాని స్థితిలో కొట్టుమిట్టాడుతున్నాడు.

''అది 1915 సంవత్సరం నా గతజీవితం....'' అంటూ మధ్యలోనే ఆగిపోయాడు. కొంతసేపు వేచివుండిన డా॥విల్టన్ మళ్ళీ అతడిని అనేకసార్లు ముందుకుపొమ్మని, ఏమి కనబడుతోందో చూడమని నెట్టగా నెట్టగా మళ్ళీ మైకంలోకి జారుకున్నాడు మైకేల్.

ఈసారి భయంతో వణకసాగాడు. పెదవులు వణకసాగాయి. అస్పష్టంగా వినబడీ వినబడ నట్టు సణుగుతున్నాడు. దగ్గరగా చెవిపెట్టివింటున్న వైద్యుడు విల్టన్‌కు మైకేల్ మాటలు చెవిలో రహస్యం చెప్పినట్లుగా గొణుగుతున్నాడు.... ''నేను వెళ్ళను! ముందుకుపోను! నాకొద్దు!'' అంటూ ఉన్నట్టుండి చేతిమీద ఎఱ్ఱనికాల్చినకడ్డీ వాతపెట్టినట్లు బాధతో కెవ్వున కేకవేశాడు! శరీరమంతా చెమటపట్టింది. వణకుతూ తానుపెట్టిన పొలికేకకు త్రుళ్ళిపడి మేలుకున్నాడు. ఎన్నిసార్లు ప్రయత్నించినా మైకేల్ ఆంతరిక మనస్సు (Sub-Conscious mind) తన భయానకమైన జ్ఞాపకాలు తెరవడానికి ఏమాత్రం యిష్టత లేకుండావుంది. మళ్ళీ నెమ్మదిగా బుజ్జగించి భయంలేదని, తప్పక 'తన జీవిత జన్మరహస్యం ఎంత భయంకరమైనదైనా చూడక తప్పదనీ!' అంటూ మైకేల్‌ను మళ్ళీ గత జన్మలస్మృతి (Meta Consciousness)లోకి పంపాడు డా॥విల్టన్.

ఈసారి ఫోటో తీస్తే వచ్చే ఫ్లాష్‌లాగా తళుక్కున మెరసి వరుసగా విమానంలో ఎగురుతూంటే క్రిందపర్వతాల పంక్తులూ మధ్యలోయలూ కనిపించినట్లు గత జన్మలు దొంతర్లు దొంతర్లుగా దూసుకుపోతున్నాయి. జ్ఞాపకాలలోంచి ముందుకి, బాగాముందుకి పోయాక గాలిలో ఎగురుతున్న 'తాను' ఆగి, నిలకడగా పరిశీలించి తన అనుభవాన్ని వర్ణించసాగాడు.

''అది 1216వ సంవత్సరం! ఎత్తైనపర్వతం మీద ఉన్న రాతికోట! ... బలమైన బురుజులు .... కళ్ళుతిరిగేంత ఎత్తుంది. లోపల

దర్వాజాని తెరుచుకొని ఎత్తైన ద్వారబంధంలోంచి నిండా కవచం ధరించిన ఒకవ్యక్తి ఉన్నత సైనికాధికారివలే క్రూరంగా కఠినంగావున్న ముఖకవళికలతో తనవైపే వస్తున్నాడు.... దళసరిగా యిత్తడిలాగ మెరుస్తూన్న శిరస్త్రాణం (Helmet), రొమ్ముమీద, చేతులకూ పాత్ర సామాగ్రిలాగ దళసరిగావున్న మొద్దు కవచం! జర్మన్ యోధుడిలాగా వున్నాడు. .... ఆc! తెలిసింది. ''హిల్ డెబ్రాంట్'' (Hilldebrant). అది వెస్ట్‌ఫాలియా (West Phalia)లోని మధ్యకాలపు కోట బురుజాలు. తానే హిల్ డెబ్రాంట్. కఠోరమైన వ్యాయామంతో కండలుతిరిగిన శరీరం, స్వార్థంతో పదవీ వాంఛతో కరడు కట్టుకుపోయిన సేనాని స్వభావం, జీవితంలో ఊపిరి సలపనివ్వని రాజకీయాలు. ఆ ఎత్తైన ఆజానుబాహుని విగ్రహం చూడగానే ఉన్నట్లుండి డొక్కలు పొట్ట ఎగురవేస్తూ వాంతి వచ్చినంత రోత కల్గింది మైకేల్‌కు. మళ్ళీ తన మీద అసహ్యం! గట్టిగా డా॥విట్టన్ ప్రశ్నిస్తూంటే పెద్దకేకపెట్టాడు

'నేను భగవంతుడి ఆయుధాన్ని! Iam the Weapon of God! క్రైస్తవమతాన్ని ప్రపంచంలో స్థాపించే ఖడ్గాన్ని!!'' అంటూ వెఱ్ఱికేకలు వేయసాగాడు. ఏమీ వినిపించుకోని తన ధోరణిలో తానే వుండి. మధ్యకాలంలో క్రైస్తవమత దండయాత్రల రక్తపాతంలోని (Crusades) గతజన్మల అనుభూతిని వర్ణిస్తున్నాడు! గతంలో ఆయన్ని అతని శత్రువులు హిల్‌డెబ్రాంట్‌ను దొమ్మిచేసి యుద్ధంలో ఓడించి తరిమేశారు. తిరిగి సైన్యాన్ని పుంజుకొని 1219 ప్రాంతంలో 3వ క్రూసేడ్ (Crusade) యుద్ధసమయంలో పాలస్తీన్ ఎడారివద్ద జరిగిన యూదుల, ముస్లింలమధ్య జరిగిన సమరంలో హోరాహోరి తలపడి లెక్కలేనంతమంది శత్రువులను నిర్మూలించాడు. తాను భగవంతుని పనిముట్టు!! క్రైస్తవమతాన్ని ఉద్ధరించవద్దా?

''...... యింతలోకే ఎర్రగా కాలిపోతున్న ఎడారి యిసుక! గుఱ్ఱంపైన ఈటె పుచ్చుకొని దానికి ఎగురుతున్న జెండామీద నల్లటి క్రాస్ శిలువగుర్తులతో హిల్‌డెబ్రాంట్ గుఱ్ఱంమీద స్వారీచేస్తున్నాడు. ఎదురుగా ఒక అరబ్‌వనిత .... పేరు రాచెల్... తెల్లగా దంతపుబొమ్మలాగా నాజూగ్గా మల్లెపూవులా వున్నది. ఆమె ముందు ఇరవై, ఇరవై ఐదుమంది స్త్రీలు తలపై నల్లని మేలిముసుగులు ధరించి కాలిపోతున్న ఎడారి యిసుకలో పడుతూ లేస్తూ నడుస్తున్నారు! బాధతో వాళ్ళ ఏడుపులు, మూలుగులూ బ్రతిమాలుడూ శిలవంటి హిల్‌డెబ్రాంట్ హృదయాన్ని కొంచెమైనా కదలించలేదు సరిగదా తనలోని కూరత్వం తృప్తిగా నవ్వుకొంది. బ్రతిమాలిన ప్రతిస్త్రీవంకా అసహ్యంతో చూస్తూ తన కత్తి మొనతో ముందుకు నడవమని కుళ్ళపొడుస్తూ నడిపించసాగారు వీళ్ళంతా యుద్ధంలో గెల్చిన శత్రువుల తాలూకు స్త్రీలు, చుట్టూరా తెగిపడిన మొండెములూ, చేతులూ, కాళ్ళు ఎడారి యిసుక రక్తంతో తడిసివున్నది.

.... హిల్‌డెబ్రాంట్ గుఱ్ఱాన్ని ఆపి సైనికులను ఆజ్ఞాపించాడు. ''ఈ స్త్రీలనందరిని తాళ్ళతో బంధించ''మని. క్షణాల మీద, ఏడుస్తూ దండాలు పెట్టి బ్రతిమాలుతున్న నిస్సహాయులైన ఆ స్త్రీలను బలమైన మోకులతో కవచాలను డాళ్ళకు కట్టి బంధించి కదలకుండా ఎండలో మాడిపోయే ఎడారి యిసుకపై పడేశారు నెమ్మదిగా అతినెమ్మదిగా ఎడారి ఎండవేడికి మాడి చావమని! ''క్రైస్తవమతాన్ని పుచ్చుకోనందుకు కరుణామయుడైన క్రీస్తు శిక్షమీకు యిదే!'' అని వికటంగా నవ్వుతూ గుఱ్ఱాన్ని దౌడు తీయించాడు. దూరాన్నుంచే ఒక్కొక్కరుగా మరణిస్తున్న ఆ స్త్రీల ఆర్తనాదాలు వింటూ, మధ్యమధ్య వెనుదిరిగి చూస్తూ తృప్తిగా సాగిపోయాడు ''**హిల్‌డెబ్రాంట్**''గా జన్మించిన మైకేల్.

ఇంతలో తెల్లగా నాజూగ్గా వున్న యువతి బ్రతిమాలుతూ కాళ్ళను

చుట్టేసింది. ఎత్తుగావున్న గర్భం! ఆమె నెలలు నిండిన చూలాలు అని తెలుస్తోంది. దయతలచి తనను, తన కడుపులోని బిడ్డను ఎలాగైనా రక్షించమని ప్రార్థిస్తోంది.

''నాకు అప్పుడు కనీసం జాలిగాని, దయగాని నాలోకదలికలేదు!'' అంటూ మైకేల్ గెల్లాండర్ డాక్టర్ విట్టన్‌తో తను చూసిన వివరాలను విడమరచి వర్ణించాడు భయంతో వణికిపోతూ....

''అలా బ్రతిమాలుకున్న ఆ వనిత కడుపులోకి స్పీడుగా తన కత్తిగుచ్చి మల్లెపూవులోపలినుంచి గుచ్చేసూదిలాగ వెనక్కులాగిన కత్తివెంటే రక్తం చిమ్మింది. క్రిందబడి తన్నుకుంటున్న ఆ చూలాల్ని మళ్ళీ మళ్ళీ కసిగా పొడిచి చిత్రవధచేసి చిక్కటి రక్తంతో తడిసిన ఖడ్గాన్ని పైకెత్తి ఊపుకుంటూ పొలికేకపెట్టి.

''నేను భగవంతుడి ఆయుధాన్ని! క్రైస్తవమత స్థాపన నా ధ్యేయం!'' అంటూ మేకేల్‌గా మేల్కొన్న హిల్‌డెబ్రాంట్ వణికిపోతూ ఆనాడు తాను చిత్రవధచేసిన స్త్రీయే యిప్పటి తన భార్యషెరోన్ అని భయపడుతూ వణికిపోతూ చెప్పాడు. మళ్ళీయింకోసారి తనని గతజన్మస్మృతులలోకి పంపవద్దని కాళ్ళావేళ్ళాపడుతూ బ్రతిమాలాడు! ఆ దుర్భర అనుభవాలను తట్టుకోలేనని గోలపెట్టాడు.

ఆ చికిత్సకు మరోమార్గంలేదని డా॥విట్టన్ సలహాపై తెలుసుకొని కొంచెం వ్యవధి కావాలని కోరాడు. అలా మధ్య మధ్య వారంరోజులు లేక నెల రోజులు పట్టేది. మైకేల్ మానసికంగా దెబ్బతిన్న ఆరోగ్యం దెబ్బతిన్న గతజన్మస్మృతుల బాధనుంచి కోలుకోడానికి అలాక్రమంగా కొన్ని నెలలుపాటుసాగింది డాక్టర్ విట్టన్ చేసిన మానసిక చికిత్స. చాలాసార్లు ఈ అనుభవాల ఒత్తిడి జీవితంలో ఎంతో అదృష్టవంతుడు అనిపించుకున్న మైకేల్ గెల్లాండర్ ప్రతీసారీ వణికిపోతూ మానసికంగా

క్రుంగిపోయాడు. జాలిగా ప్రార్థించేవాడు తానీ అనుభవాలను చూసి తట్టుకోలేనని! కానీ తన కర్మ ఏమిటో తెలుసుకోకపోతే దానినుండి దాని బాధనుండి తప్పించుకునే మార్గాంతరంలేదు. గతిలేక మళ్ళీ గతజన్మల జ్ఞాపకాలలోనికి వెళ్ళకతప్పేదికాదు. డాక్టర్ విట్టన్ టేబుల్పై పడుకోకా తప్పేదికాదు... మైకేల్కు! కాని పసిపిల్లలు ఆపరేషన్ చేయటమంటే ఎంత భయపడతారో దానికి వందరెట్లు భయపడిన మైకేల్ ''సైకిక్ట్రీట్మెంట్'' అంటే వణికిపోయేవాడు. ఇలా సేకరించిన అనుభవాలను సంగ్రహంగా (మెడికల్ రిపోర్ట్స దాదాపు వందపేజీలుంటుంది పరిశీలిస్తే) ఏం చూశాడు? ఎందుకని భయంతో గడగడలాడిపోయాడు? మైకేల్ చూసింది ఏదో సినిమాకాదు! TVలో చూసే హత్యల సస్పెన్సుకాదు! అది తన గత జీవితం!! అంతేకాదు అప్పటి అనుభవాల బీజాలు మానసికంగా తనలో లోతుగా పాతిపెట్టిన బాంబువలే యిన్నాళ్ళు రహస్యంగా తన మనస్సులోనే దాగివుండి తనని వేధిస్తున్న వేదన అంతా వెలువడసాగింది, ఒక్కొక్క అనుభవంలో! అలా మనసు పొరలు ఒక్కొక్కటే తెరచుకుంటుంటే ఆ జన్మల్లో చేసిన ఘోరకృత్యాలవేదన తనలో అణచిపెట్టబడి ప్రెషర్కుక్కర్లో ఆవిరివలే మూత తీయగానే వెలికివచ్చింది. ఇలాగజరిగింది డా॥విట్టన్ చేసిన మానసిక చికిత్స. ఫలితంగా ఏ వైద్యానికీ మందులకూ, బైటశరీరానికి చేసే ఏ ట్రీట్మెంట్కూ లొంగని మైకేల్ అంతరాత్మలోని మూగబాధ ఆశ్చర్యంగా వెలికివచ్చేది. తద్వారా అతనికి బాధా నివృత్తి కలిగింది! మొట్టమొదటిసారిగా హాయిగా నిద్రపోయాడు!! ఇంతకూ అతను అనుభవాలలో చూసిన భయంకర గతజన్మ స్మృతులు ఏమిటి? అతని గత జన్మపరంపరలలోకి వెళ్ళిచూడాలి! చూద్దాం!



# 6

# 'రెండు - జన్మల మధ్యన మరణించిన 'ప్రేతాత్మ!'

## పాపాలకు - 'శిక్ష'తో రోగనివారణ!!!

దిగచెమటలుపోసి ఆయాసపడుతూ మేలుకొన్నాడు మైకేల్ గెల్లాండర్! రెండవజన్మ జ్ఞాపకాలనుంచి. డాక్టర్ సహాయంతో ఊపిరికూడ తీసుకొని నిట్టూర్పు విడుస్తూ తన గతం నుంచి తేరుకోడానికి విశ్వప్రయత్నం చెయ్యసాగాడు! ఎందుకంటే తాను చూసింది యదార్థమని ఏ సైక్రియాటిస్టూ విడమరచి చెప్పనవసరం లేకుండానే మైకేల్ అతి మానసిక ప్రజ్ఞ (Meta Consciousness) నుంచి చూసింది లాగే స్పందించాడు, తెలుసుకోవడంకాదు! సలసలకాగే నూనెలో పడవేసిన పకోడిలాగ తన గతంలోని వ్యధలు మైకేల్ ఆత్మను ఉడకబెట్టినాయి! అందుకే దిగచెమటలూ, ఈ ఎగశ్వాస, వల్లమాలిన నీరసమూ!

హిల్‌డెబ్రాంట్ చిన్నతనంలో విశాలమైన కోట బురుజులపై కత్తిసాము నేర్చుకుంటున్నాడు తన తండ్రివద్ద! చిన్నప్పటినుంచీ ప్రేమలేని తల్లివద్దా, తన సెక్సుకు అడ్డమైనాడని ద్వేషంతో పెంచి పెద్దచేసిన తండ్రివద్దా పెరిగిన హిల్‌డెబ్రాంట్ ఆత్మ విషంతో నిండివున్నది పితృద్వేషంతో! తల్లిప్రేమకూ తండ్రిప్రేమకూ దూరం చేయబడ్డ పసిమనస్సులోని రోదన నిస్సహాయమైన కచ్చగామారి, విషంలాగ తండ్రిపై పగతీర్చుకోడానికి ఎదురుచూస్తున్నాడు హిల్‌డెబ్రాంట్!

అకస్మాత్తుగా కత్తియుద్ధం నేర్పుతున్న తండ్రికి ఆదమరచివున్న సమయంలో నిటారుగా కత్తిని తండ్రిడొక్కలోకి దింపేశాడు! ఆశ్చర్యంతో త్రుళ్ళిపడి తనవేపు బాధగానూ జాలిగానూ చూసిన తండ్రిచూపులు కచ్చతీరిన మరుక్షణమే హిల్‌డెబ్రాంట్ హృదయాన్ని పశ్చాత్తాపంతో జాలితో అంతులేని పాపభీతితో నింపసాగాయి..... తాను పితృహంతకుడు! తనను ఎవరైనా పొడిచి చంపాలని... ఆ కచ్చ తనపైనే తిరిగింది.

బయట ప్రజలందరూ ప్రమాదవశాత్తూ తన కత్తితగిలి తండ్రి మరణించాడనే నమ్మారు..

నడియవ్వనంలో వున్న హిల్‌డెబ్రాంట్‌ను ఆశతో గోముగా ప్రేమగా సమీపించింది తన ప్రేయసి రేచల్! .... అదే స్ఫురద్రూపం! దంతపుబొమ్మలా నాజూగ్గా తెల్లగా పొడుగ్గా వున్నది. అందంగా చిరునవ్వు నవ్వుతూ తన చిరకాల ప్రేమ ఫలితంగా వివాహం చేసుకొమ్మని కోరడానికి వచ్చింది. అవసరమున్నప్పుడల్లా తనకు తీరికదొరికిన సమయంలో తన కామాగ్నిని తీర్చుకోడానికి ఆమెను వాడుకున్న హిల్‌డెబ్రాంట్ పెళ్ళి అంటే దాటవేస్తూరాసాగాడు! ఈసారి ఆమె గట్టిగా మంకుపట్టుపట్టి త్వరలో తాను హిల్‌డెబ్రాంట్ బిడ్డకు తల్లిని కాబోతున్నాననీ ఆశగా చెప్పింది ఎంతో సంతోషిస్తాడనుకొని.

.... అంతే! హిల్డెబ్రాంట్ హృదయం భయంతో అవమానంతో నిండిపోయింది. తన పరువేంకాను? రాజవంశంలో పుట్టిన తాను ఈమెనా పెండ్లాడేది? పైగా రాచెల్ యూదు (Jew) వనిత! తను పరిశుద్ధమైన రోమన్ కాథలిక్ క్రైస్తవుడు!!! ఇప్పుడేమిటి గతి? ఈమె యిలాగ నిర్బంధిస్తోంది! శరవేగంతో ఆలోచించాడు, సైనికుడిగా శిక్షణపొందిన హిల్డెబ్రాంట్!

.... .... .... .... అమాయకంగా తన భుజంపై చేయివేసిన ప్రియురాలిని గోవుగా ప్రేమతో నడిపించుకుంటూ వెళ్ళాడు, కోటబురుజుపైనే! చల్లగాలికి విహరిస్తున్నట్టు యిద్దరూ పిట్టగోడ చేరుకోగానే తృటిలో ఒక సైనికుని దెబ్బతో ఆమెను పల్టీలుకొడుతూ గాలిలో ఎగిరి పక్కనున్న అగాధంలో పడిపోయేలాగా తోసేశాడు. ఆశ్చర్యంతో త్రుళ్ళిపడి మరుక్షణంలో భీతిగా జాలిగా తనవైపే చూస్తూ మరణించిన ఆమెచూపు యిన్ని జన్మల తరువాతకూడా మైకేల్ను కాల్చుకుతినేది.

కోటగోడ మీంచి తొంగి చూస్తే క్రిందనున్న లోతైన కందకంలో నిండివున్న నీళ్ళలో చెత్త, గడ్డీ, నాచూ మధ్య ప్రియురాలి శవం తేలుతోంది! ఆమె వెంటనే మరణించలేదు. గిలగిలా కొట్టుకొని తను చేసిన ద్రోహంవల్లనే మరణించింది, దెబ్బవల్లకాదు!

లోతుగావున్న బావిలోకి చూస్తే కళ్ళుతిరిగినట్లు, చీకటికోణం లోంచి సుడిగుండంలా తిరుగుతూ ఒక రకమైన వికారం, జుగుప్స, భీతి హిల్డెబ్రాంట్ ఆత్మలో సుళ్ళు తిరగసాగింది. గూడుకట్టుకున్న కర్కశత్వం... జన్మల మధ్యనున్న అతి మానసికస్థితిలో

.... త్రుళ్ళిపడి టేబుల్పైన మైకేల్కు అదే వాంతి వచ్చే వికారం స్పష్టంగా గుర్తుకువచ్చింది. అదే వికారం! అదే వాంతి! అదే జుగుప్స! ఆశ్చర్యం! మూడు జన్మల తర్వాతకూడా తనజన్మ భార్య షారోన్ను

ప్రేమతో బెడ్ రూమ్‌లో సమీపించిన తనకు లోపల ఎగదన్నే వికారం సరిగ్గా అదే! అదే! ఆశ్చర్యం! షెరోన్ ఎవరోకాదు. గతంలో ఎడారిలో తను క్రూరంగా కత్తివేటుకి గురిచేసిన రాచెల్! ఆ తర్వాత స్వయంగా తాను కోటగోడమీంచి తోసి హత్యచేసిన ప్రియురాలూ గర్భిణిప్రేయసి రాచెల్! .... గతజన్మలో పొడిచి చంపిన ఎడారిలోని దృశ్యం తిరిగి మైకేల్‌గా జన్మించినా తన ఆత్మని వెంటాడింది. ఇప్పటికి తన అజ్ఞాతమైన మూగబాధకు అర్థం కొద్దికొద్దిగా కదలసాగింది. తనలోని వ్యధా, అసహ్యమూ, జుగుప్సా, ఆత్మద్వేషమూ, తన మీదే తనకు కచ్చ ఎందుకో మైకేల్ గెల్లాండర్‌కు క్రమంగా అర్థంకాసాగింది! జన్మలు మారినా తన ఆత్మ తను చేసిన పాపాలను క్షమించలేదు! జుగుప్సతో తనను ద్వేషిస్తున్న అంతరాత్మ శరీరాలను మార్చినా గతజ్ఞాపకాలను ఆశ్చర్యంగా తనలోనే టైంబాంబులా అణచివుంచింది! విట్టన్ ఆసక్తిగా మైకేల్ చెప్పిన అనుభవాలన్నీ రికార్డు చేయసాగాడు. ఇతడి రోగానికి, వైద్యులకు అంతుబట్టని రోగానికి మూలకారణం యిప్పుడే అవగతం కాసాగింది!

"Go back! వెనక్కు వెళ్ళు!" డాక్టర్ విట్టన్‌గొంతు మైకేల్‌ను తిరిగి హిప్నసిస్‌తో గతజన్మల అతీతమానసిక స్థితికి నెట్టింది. ఎందుకంటే గతజన్మలలో ఏమి జరిగిందో ఆ దృశ్యాలు మాత్రమే కనిపించాయి మైకేల్‌కు కాని ఏజన్మలో చేసిన ఫలితం తనకు ఎందుకు ఏ ఫలితాన్ని యిప్పించిందో తెలయాలంటే ఇది సరిపోదు! ఆత్మరెండు మరణాలకు మధ్యన పైలోకంలో వ్రేలాడుతుండే నరకం (Bardo) అనే ప్రేతాత్మలు నివసించే మానసిక భూమికలోకి వెళ్ళాలి! ఎందుకంటే రానున్న జన్మను ముందుగానే తాను అనుభవించవలసిన సంఘటనలు ఏర్పాటు చేసుకుంటుంది ప్రతీవారి జీవాత్మ! అక్కడే తెలుస్తుంది ఏ సంఘటనలు ఎందుకు ఏర్పాటు చేసుకున్నదో!

ఇది చాలా మందికి తెలియని రహస్యం!! డాక్టర్ విట్టన్ 30

సంవత్సరాల పరిశోధనతో కనుగొన్న అపూర్వమైనన్ను సూత్రం యిది!
అదేమిటంటే ఈ జన్మలో మనంపడే కష్టాలన్నీ సరిగ్గా మన ఆత్మముందే
కోరుకుని ఏర్పాటుచేసుకున్నవే!! ఏ దేముడూ ఈపని అన్యాయంగా మన
తలపై రుద్దేవి కావు!! మనలోని జీవాత్మకూడా రెండుజన్మల మధ్యనుండే
ఈ ప్రేతలోకంలోనుంచే యిప్పటి జన్మలోని సంఘటనలను బంధువులను
తల్లిదండ్రులను ఎంచుకుంటుంది! తానే ఎంపిక చేసుకుంటుంది.
అయిష్టమైనాసరే, భయంతోనైనాసరే ఆ మనుషులను, ఆ సంఘటనలను
తనవైపు ఆకర్షించుకుంటుంది మన ఆత్మే!!

అందుకే తీవ్రంగా ద్వేషించిన వారికీ, తీవ్రంగా ప్రేమించేవారికీ
సన్నిహిత బందువులుగా ఆ కుటుంబాలలోనే జన్మిస్తాము. ఐతే మనం
ప్రేమించేవారితో జన్మించాలని అనుకుంటారేగాని, మనం పూర్తిగా
ద్వేషించేవారితో మన రానున్న జన్మ ముడిపడివుంటుందని చాలామందికి
తెలియదు. డా॥ విట్టన్ పరిశోధనలో తేలింది, అనేకమంది
భార్యాభర్తలుగా, తల్లీ బిడ్డలుగా తమ బద్ధ శత్రువులలోనే జన్మిస్తారని,
జీవితం బాగుపరుచుకోవాలని! అప్పుడే వారికర్మలను పంచుకోవడం
సాధ్యపడుతుంది! తద్వారానే మనం గతంలో చేసిన అన్యాయం, దుర్మార్గం
వారినుంచే అనుభవించే అవకాశం ఏర్పడుతుంది!

''.... ... బాబోయ్! వద్దు! వద్దు! నావల్లకాదు!'' అంటూ కేకలు
వేస్తూన్న మైకేల్‌ను సముదాయిస్తూ అడిగాడు డా॥విట్టన్

''ఏమిటది? నువ్వు రెండు జన్మలమధ్య ప్రేతలోకం లోనికి
వెడుతున్నావు. అదిగో! వెళ్ళు! ఏమి కనిపిస్తోంది? చూడు!'' అంటూ
ప్రోత్సాహించాడు అప్పుడు మైకేల్‌కు రెండు జన్మలమధ్యన జరిగిన
పైలోకంలో దృశ్యం గోచరించింది

''నేను తేలిపోతున్నాను! పైకి .... యింకాపైకి! కానీనాకు శరీరం
లేదేమి? స్పష్టంగా నేను అనే గుర్తూ, జ్ఞాపకమూ నన్ను వెంటాడుతూనే

వుంది. కాని నాకు శరీరంగాని, ఆకారంగానిలేదు. గాలిలాగా ఫీలయ్యాను. పైకి తేలిపోతున్నాను. నక్షత్రాలలోకి తేలిపోతూ మిలమిల మెరుస్తూన్న తారకల్ని చూశాను. విశాలమైన ఒక మైదానం వంటి ప్రదేశం. ఎక్కడో అది! అది ఈ భూమ్మీదదికాదు! అక్కడ ఎవరో ఒక ఉన్నతుడైన ఆజానుబాహుడు వున్నాడు. తన ఆత్మ నెలల పసిపాప రూపం ధరించి తేలియాడుతోంది''

''ఏం చూస్తున్నావు? చెప్పు!'' డాక్టర్ విట్టన్ గొంతు తన అనుభవాల్లో తేలియాడుతున్న మైకేల్‌ను పొడిచినట్లు అప్రమత్తం చేసింది!

టేబుల్‌మీది మైకేల్ కండరాలు కొంకర్లుపోయి కాళ్ళు చేతులూ మెలికలు తిరగటం ఆరంభించాయి. మూర్ఛరోగిలా పెదవులు బిగబట్టసాగాయి! కళ్ళు మూసుకునే వున్నా రెపరెపలాడుతున్నాయి. ఏదో భరించలేని అనుభూతిని అతని ఆత్మ చూస్తున్నట్లుగా తెలుస్తూనేవుంది. మళ్ళీ అరిచాడు మైకేల్!

''కటిక చీకటి! నాకేమి కనిపించటంలేదు! నాకు భయంగా వుంది! నేను ముందుకు వెళ్ళలేను! నాకొద్దీ అనుభవాలు!'' అంటూ తనని జన్మజన్మలుగా ద్రోహంచేసిన ప్రియురాలైన 'రాచెల్' యింకా అనేక యితర పేర్లతో, పీకనులిమి హత్యచేసిన సుకుమారినే భార్యగా తిరిగి వచ్చే జన్మలో పొందాలి! తానీ హింస భరించలేడు! ఆమె ఎదుట తల ఎత్తుకొని నిలబడలేకపోతున్నాడు. కాని పైనున్న దివ్యపురుషుడు అంతులేని దయతో సానుభూతితో పరమ పాపిష్టుడైన తన గత జన్మల కథను పరిశీలించి జాలిగా నిట్టూర్చాడు!

''భయంలేదు! నీవు సరిదిద్దుకోగలవు! కాదు నీవే సరిదిద్దుకోవాలి! నీ తప్పిదాలను! ఇంకొక అవకాశం తీసుకొని చూడు! ఈసారి శ్రద్ధగా ప్రయత్నించు! మూడు జన్మలుగా ఘోరంగా అన్యాయంచేసిన ఆమె ఆత్మకు న్యాయం చేసి ప్రేమధారపోసి, గతంలో నీవామెకు చేసిన ఘోరమైన

అన్యాయం నుండి, దారుణమైన హింసనుండి, పాపాలనుండి నీ ఆత్మను ప్రక్షాళనం చేసుకో! ఇంకో అవకాశం యిస్తున్నాను. వెళ్ళు (బదర్ అదే భార్య! ప్రయత్నించు!''

ఆ దివ్యపురుషుడి కంఠం బుజ్జగిస్తున్నట్లుగా మైకేల్ గుండెల్లో మారుమ్రోగింది! (చెవులతో వినలేదు!) క్రమంగా తాను అంగీకరించాడు. తన పాపాలవిముక్తికి వేరే దారిలేదని! ఎంత భయంకరమైనా సరే తిరిగి తాను అన్యాయంచేసిన వ్యకితోనే జన్మించాలి! అప్పుడు గ్రహించాడు ఈ జన్మలో తన భార్య షారోన్‌ను సమీపిస్తే తనలో ఎందుకు ఆత్మజుగుప్స, వాంతియ్యేటంత అసహ్యం ఎందుకు కలుగుతున్నాయో!

..... అలానే తనకన్న తండ్రిని కత్తియుద్ధంలో హత్యచేసిన దారుణమైన అన్యాయానికి బలైన ఆ తండ్రితోనే మళ్ళీ జన్మించాలి! బాబోయ్ తప్పదు!. అని అరచింది మైకేల్ గెలాండర్ ఆత్మ! న్యూయార్క్‌లోని బ్రాంక్స్‌కాలనీలో తాను మైకేల్ గెలాండర్‌గా యూదులకుటుంబంలో జన్మించటం తల్లీతండ్రి తనని దారుణంగా హింసిస్తారని ముందే తెలిసి, ఆ జీవులు గతంలో తనచేత క్రూరంగా హింసించబడ్డవారని ఎరిగివుండికూడా అదే తల్లితండ్రులను ఎంచుకోక తప్పలేదు! పైన దివ్యపురుషుడు సహాయంచేయకపోతే తన కర్మలగతి తనకు వ్యక్తమయ్యేదికాదు. ప్రతీ వ్యక్తీ అనుభవించవలసిన కర్మకు సరిపోయే తలిదండ్రులను ఎంపికచేసుకునే పైలోకాల్లోని ప్లానింగ్ ప్రక్రియలో ఈ దివ్యపురుషుని (కర్మదేవుళ్ళు) సహాయం అవశ్యం అవసరం వుంటుంది.

తలిదండ్రుల ద్వేషం, చిన్నప్పటినుంచీ అభిమానం ఆదరణ లేకుండా పెరిగిన తన దుర్భర బాల్యావస్థ యిన్నాళ్ళూ ఘోరమైన అన్యాయంగా భావించి ద్వేషం పెంచుకున్న మైకేల్‌కు ఆ బాధలు సక్రమమేనని బోధపడింది! అంతేకాదు ఆ బాధలుపడటం వల్ల లా

ఆత్మకు గతంలోని పాపం నుండి విముక్తి! దాన్ని మార్చటానికి వీల్లేదు! కాదు మార్చటం సరికాదు పాతబాకీలు తీర్చాలి తప్పదు! అప్పుడర్థమైంది తలిదండ్రులయెడల తాను పెంచుకున్న ద్వేషం చాలాతప్పు అని!

క్రమక్రమంగా మేనెల 1981 దాకా మైకేల్ గెల్లాండర్ రాత్రిళ్ళు పాలికేకలు వేస్తూ రాత్రిళ్ళు నిద్రనుండి మేల్కొనేవాడు! డెలీరియం ¼lirium) లాంటి మెలకువా, నిద్రాకాని స్వప్న దృశ్యాలనుంచి భయంగా మేల్కొనేవాడు. ఇలాగ అనేక జన్మల జ్ఞాపకాలు ప్రతీరోజూ క్రమం తప్పకుండా పీడించటం నెమ్మదిగా నెమ్మదిగా తక్కువ కాసాగింది! చివరికి తన మానసిక శాంతినీ ఆరోగ్యాన్నీ కోలుకున్నాడు డాక్టర్ విట్టన్ సహాయంతో!

డాక్టర్ విట్టన్‌కు మాత్రం మైకేల్ అసలు సమస్య యింకా బహిర్గతం కాలేదని తోచింది. ఎందుకంటే మొదటి సైకిక్‌ట్రీట్‌మెంట్‌లో 1915 సంవత్సరం గురించి మాటాడిన మైకేల్ తరువాత ఎన్నిసార్లు ప్రయత్నించినా వెనుకంజవేస్తున్నాడు! ఇంతవరకూ వచ్చిన పునర్జన్మల రికార్డులో 1915కు సంబంధించినదేదీలేదు! ఇంత విపరీతంగా మైకేల్ భయపడే నిగూఢమైన పూర్వకర్మ రహస్యం చెప్పిన అనుభవాల్లో కనిపించదు కాస్తకోలుకున్న మైకేల్‌ను మళ్ళీ రెండు జన్మల మధ్యనవుండే ప్రేతాత్మల లోకంలోకి పంపించాడు! అక్కడగాని ప్రతీజన్మలోని సమస్యలూ వాటివెనుకగల కర్మకారణాలూ విశ్లేషించటం జరుగదు.

ఎంత ప్రయత్నించినా నాలుగు నెలలపాటు మైకేల్‌కు ట్రీట్‌మెంట్‌లో ఎట్టి పురోగతీ లభించలేదు! ''నేను వెళ్ళలేను! నాకేమీ కనిపించటంలేదు! నల్లగా తెర అడ్డువస్తున్నది ..... విక్టర్! అదుగో విక్టర్!'' అన్న అస్పష్టపుమాటలే తప్ప, యింతకు మించి ఏమీ ఫలితం శూన్యం. దీనికి మైకేల్ ఆత్మ ఏమాత్రమూ సహకరించటంలేదని డాక్టరుకూ, పేషంటుకూ అవగతమయింది. ఒక రెండునెలలు సెలవుగా ట్రీట్‌మెంటునుంచి విశ్రాంతి

తీసుకొని తనభార్య షెరోన్‌తోపాటు విహారయాత్రకై వెళ్ళాడు. ఈ యాత్రలో చిరకాలంగా తన సహోద్యోగి ఆహ్వానిస్తూన్నా వెళ్ళకుండా వున్న సేలం (Salem) అన్న పురాతన నగరంలో గడపాలని మైకేల్ దంపతులు స్వంతకారు ఏర్పాటుచేసుకొని వెళ్ళారు. రోజా బీచ్‌వద్ద వ్యాహ్యాళీ, రోజంతా వింతలూ విచిత్రాలూ చూడటం ముగిశాక అక్కడవున్న పాత లైబ్రరీలోగాని మైకేల్‌కు తన గతస్మృతుల ద్వారం తెరుచుకోలేదు.

సేలం నగరంలో 17వ శతాబ్దంలో రోమన్ కాథలిక్ బిషప్‌లు అనేకమంది స్త్రీలను మంత్రకత్తెలుగా నిందవేసి, వారిని శిలువలకు కట్టేసి కాలబెట్టి చిత్రవధ చేసి హింసించి చంపిన చారిత్రక గుర్తులిప్పటికీ టూరిస్టులకు చూపిస్తారు. లైబ్రరీలో యధాలాపంగా మైకేల్ ఒక పుస్తకం తీసి చూచాడు. కరెంట్‌వంటి షాక్ తగిలింది! ఏమిటా అని చూస్తే ఆ గ్రంధం ''చేతబడులు - భూతవైద్యం' (Witchcraft and Wemonology) అన్నది. అదితీసి చదువుతూంటే ఉన్నట్టుండి ఎవరో నల్లని పొగమంచులాంటి అస్పష్టమైన ఆకారం తనపై తచ్చాడుతున్నట్టుగా తోచి ఊపిరి సలపనట్టయింది. ఇబ్బందిగా ఫీలయ్యాడు! పుస్తకం మూసిలేచి నిల్చున్న వికారపెట్టి కళ్ళు చీకట్లు కమ్మసాగాయి! ఉన్నట్లుండి ఉవ్వెత్తుగా కడుపులోంచి మెలిపెట్టినట్టు వాంతివచ్చే వికారంతోపాటు ఉధృతమైన సెక్సువికారం (కామోద్రేకం) మొదలైంది. ఏమిటా ఈ చిత్రం అని ఆలోచించేలోగానే వికృతమైన కామోద్రేకం యొక్క చిత్రహింస, కామంతో కలిసిన ద్వేషం సెక్సూ కలిసిన జుగుప్సాకరమైన పాతసంస్కారాలు పడగవిప్పి మళ్ళీ తనలో తలెత్తి తనను ఊపివేస్తున్నాయి. ఈ అనుభవాలు అతనికి తన డాక్టర్‌తో సంప్రదించేదాకా వ్యవధినివ్వలేదు! హోటల్‌కు చేరి బెడ్‌మీద విశ్రాంతి తీసుకుంటూండగానే గత జన్మ స్మృతి యిన్నాళ్ళు తాను ప్రయత్నించి తెరవలేని గత జ్ఞాపకాల ద్వారం మూసివున్నది భళ్ళున

తెరుచుకున్నట్లైంది! ''విక్టర్ బ్రాక్‌నెల్ అనే శరీరంలో చర్చిలో పనిచేసే ఒక Vicar గా వుండిన జన్మ! చిన్నప్పటి నుంచీ కఠోర మూఢవిశ్వాసాల ఛాందసంతో రోమన్‌కాథలిక్ నియమాలతో పెరిగిన విక్టర్ 'సుఖం అనుభవించడమే పాపం' అని — ఏరూపంలో సుఖం అనుభవించినా అది ఏసుక్రీస్తుకు అపరాధమేనన్న వికృతమైన మనస్తత్వంతో పెంచబడ్డాడు తగినంత భోజనం కూడా చేయకుండా, రాత్రుళ్ళు విశ్రాంతి కూడా తగ్గించుకుని తనను తాను హింసించుకుంటూ, బైబిల్ చదువుతూ గడిపేవాడు! యవ్వనం రాగానే సహజమైన కోరికలు తనలో రేకెత్తటంతో విక్టర్‌కు భయాందోళనలు మొదలైనాయి. అవి వయస్సుతో సహజంగానే రోజురోజుకీ బలీయం కాజొచ్చినాయి. అప్పుడు ఒక ఇనుప పరికరాన్ని తన మర్మాంగానికి గొట్టంలా బిగించుకొని తన కామోద్రేకం పెగినప్పుడు అది నిరోధించేలా బాధపెట్టేవిధంగా అమర్చుకున్నాడు!

ఇంతలో అతనికి వివాహం జరిగింది. మొదటిరాత్రే భార్యతో సంసారం చెయ్యాలా? క్రీస్తుకకు అపరాధంలేకుండా తనకే సుఖమూ అనుభవంకాకుండా సంతానం కలిగేలా వుండాలని తన పరికారాన్ని తీసివేయకుండానే భార్యతో సంసారం చేసే ప్రయత్నం చేశాడు.

వికృతమైన అతని చేష్టలకు ఆ అమాయకురాలు తీవ్రంగా భయపడి బాధతో భయంతో విలవిల్లాడింది. ఆపుకోలేని రక్తస్రావంతో బాధతో మెలికలు తిరిగిపోయింది. తన తప్పు తెలుసుకున్న విక్టర్ వైద్యానికి తీసుకెళితే తన పరువుపోతుందన్న భయంతో అణిచిపెట్టాడు! ఫలితంగా భార్య మరణించింది పెళ్ళినాటి రాత్రే! ఎవరికీ తెలియకుండా విశాలమైన తన కాంపౌండు వెనుక తోటలో త్రవ్వి పూడ్చిపెట్టాడు! ఏమి ఎరగనట్టు బైటికి మామూలుగా సంచరిస్తూ చర్చిలో ప్రార్థనలూ వగైరా మతగురువుగా నిర్వహించేవాడు. ఎవరైనా అడిగితే పెళ్ళినాటిరాత్రే తనభార్య తనతో చెప్పకుండా లేచిపోయిందనీ, తనని ఏసుప్రభువు ఆ విధంగా రక్షించాడనీ

బొంకేవాడు. క్రమంగా అతనిలో జుగుప్స, నేరం చేసినదానికి పశ్చాత్తాపంతో పాటు, వికృతమైన కామోద్రేకాన్ని అణచటం వల్ల కలిగిన వికృతి తన ఆత్మను పీడించగా భరించలేక దూరంగా వున్న సేలం నగరానికి బదిలీ చేయించుకున్నాడు ఆ సేలంలో అప్పుడు అనేకమంది బిషప్పులు పాదరీలు వందలాది మంది స్త్రీలను మంత్రగత్తెలని ముద్రవేసి ఉరితీయటం, చితుకులు పేర్చి నెమ్మదిగా కాలబెట్టి చంపడం జరుగుతున్నది. అందులో పాల్గొనేవాడు విక్టర్ పైశాచికానందంతో!

బాధతో విలవిల్లాడుతూ చనిపోయే స్త్రీలను వికృతంగా హింసించి బాధించి వారు చనిపోతుంటే చూసి ఆనందించేవాడు. విక్టర్‌గా మరణించిన తన ఆత్మ చాలాకాలం ప్రేతలోకంలో వర్ణించలేని ఊహించలేని భయంకరవేదనకు ఉక్కిరిబిక్కిరై గిలగిలా తన్నుకోసాగింది! చీకటి, భయం, అవమానం, జుగుప్స జిగటవంటి జిడ్డువంటి అసహ్యకరమైన సెక్సు ప్రేతాత్మల వైబ్రేషన్లతో మాటలకు అందని భీకరపరిస్థితిలో తన్నుకోసాగింది విక్టర్ ఆత్మ! ఇప్పుడర్థమైంది మైకేల్‌కు ఇన్నినెలలు ఎందుకని తన ఆత్మ ఈ భయంకర అనుభూతిని డాక్టర్ విట్టన్ టేబుల్ మీద చూడలేక పోయిందో!

''నరకం!'' అన్నది పాపాలు చేసేవారి ప్రేతాత్మలు విలవిల్లాడి వందల సంవత్సరాలపాటు మురుగుకాలవలోని కప్పల్లా కుళ్ళుతూ వుండే ఆ ప్రేతలోకం అన్నమాట! భయంతో వణికిపోయాడు మైకేల్. దాని గుర్తు కూడా మరిచిపోవడానికి ఊపిరిబిగబట్టి విశ్వప్రయత్నం చేసి అణిచేసుకునేవాడు. అందుకే అతని ఆత్మ ఈ ఘోరమైన జ్ఞాపకాలు గుర్తుచేసుకోడానికి నిరాకరించింది.

డా. విట్టన్‌కు వెలుగురేఖలుగా ఈ సమస్యకు నివారణ తోచసాగింది! అయినా 1915 సంవత్సరం మిస్టరీ వీడిపోలేదు! విక్టర్‌గా సేలంనగరంలో మతగురువుగా మరణించిన జ్ఞాపకాలు 1692 ప్రాంతంనాటివిగదా!

ఈసారి పూర్తిగా ఆరోగ్యం దెబ్బతిన్న మైకేల్ 'తన సమస్యకు పరిష్కారమో తాడోపేడో తేలిపోవాలి!' అన్న ప్రయత్నంతో డ్యాక్టర్‌తో కలిసి పని చేశాడు. ఫలితంగా. ఈ విచిత్రానుభవం మెరసింది అతని గతజన్మల స్మృతిలో!

''జూలియా! జూలియా మర్చిసన్ (Julia Murchison)అన్నపేరుతో కెంటకీ రాష్ట్రంలో 1910లో జన్మించాడు మైకేల్ అతి బీద కుటుంబంలో గాఢమైన కాథలిక్ మతస్థులైన తలిదండ్రులకు జన్మించాడుస్త్రీ శరీరంలో!! తండ్రి రోజూ తప్పతాగి వచ్చేవాడు. ఐదేళ్ళ జూలియాను రోజూ చావబాదేవాడు! భరించరాని చిత్ర హింసపెట్టేవాడు!''

పైజ్ఞాకాలు అనుభవిస్తూన్న మైకేల్ మూర్ఛలాగా ఫిట్సువచ్చి నోటివెంట నురగలు రాగా నేలపైబడి విలవిలా తన్నుకోసాగాడు!రెండుచేతులతో కడుపుపట్టుకొని పొరాడుతూ తలనేలకేసుకుని బాదుకోసాగాడు. అతడిని వారించడానికి ఏమాత్రం ప్రయత్నించక డ్యాక్టర్ యొక్క అనుభవం యిప్పుడతనికి అందుబాటులోకి వచ్చిందన్నమాట!!! ఇలాటి అవకాశం పాడుచేయరాదు ఎంత బాధైనా సరే దాన్ని వాంతి చేసకున్నట్టు లోపల్నుంచి క్రక్కివేయడం కోసం మైకేల్ ఆత్మ గింజుకుంటున్నదని గ్రహించాడు. దాన్ని అడ్డుకోలేదు. అతని ఆవేదనను ఆపలేదు. అలానేలపై నురగతో చొంగతో పొరాడి కొంతసేపటికి కాళ్ళు చేతులు పట్టువీడి మైకేల్ మరణించినవానిలా స్థబ్దుడైనాడు.

గత అనుభవం మళ్ళీ అందుకున్నాడు

అయిదేళ్ళ జూలియాను ఆరోజున చిత్తుగా త్రాగివచ్చిన తండ్రి చితకబాది దారుణంగా మానభంగం చేశాడు! బాధతో, కుళ్ళుతో తండ్రి సెక్సుతో కలుషితమైన వికృతమైన హింస, కామం కల్సిన విషం వంటి

వికారం అప్పుడు జూలియా శరీరంలోనిదన్నమాట! యిన్ని సంవత్సరాల తరువాత కాదు యిన్నిజన్మల తరువాత మైకేల్‌కు తనలోని కామం హింస కలిసిన పాపం భరించలేని బాధ కలిగే వాంతిలాంటి వికారానికి అర్థం గోచరించసాగింది. చాలాసార్లు ఆనెలలో మళ్ళీ మళ్ళీ అవే ఫిట్సు, అవే మూర్ఛలు, అవేహాలికేకలు ఉధృతంగా మెలితిరిగి పోవటమూ తట్టుకోలేని బాధతో తలనేలకు బాదుకోవటం! క్రమంగా ఈబాధల ఉధృతం తగ్గసాగింది. ప్రఖ్యాత మానసిక వైద్యుడు ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం చిన్నప్పుడు సెక్సుకు సంబంధించిన ఘోరమైన బాధ ఏమైనా జ్ఞాపకాల అడుగున వుంటే దాన్ని తిరిగి తిరిగి పునరావృతం చేసుకునే మూర్ఛ వంటి చక్రానుభూతి (Cycle Experience)తరచూ మానసికరోగులలో గమనించానని వ్రాశాడు!

డా.విట్టన్ కూడా చిరకాలం ప్రేతలోకాల్లో దారుణమైన నరకయాతనలు అనుభవించిన వారి ఆత్మలకు తరచూ తమ గత పాపాలను హింసనూ మళ్లీ మళ్లీ అనుభవిస్తూ సుడి గుండంలా చక్రాకారంగా పునరావృతం చేసుకోవడం, జ్ఞాపకాల వలయంగా గుండ్రంగా తిరగటం దానివల్ల కలిగే శిక్షను తీవ్రంగా కోరుకుంటాయి ఆ ప్రేతాత్మలు! ఏదోవిధంగా ఆ అనుభూతి బహిర్గతమైతేగాని మనస్సు తేలికపడదు! కాని అందరిలోను ఒకే విధంగా బహిర్గతం కాదు! అనేక సంవత్సరాలు అసలు మరుగునపడి బహిర్గతంకాదు! అలాజీర్ణించుకుపోయిన గతజన్మలపాపాలు మరోవిధంగా బహిర్గతమైతే గాని ఆ జీవికి విముక్తి లేదు. మైకేల్ విషయంలో కొన్నివందల సంవత్సరాల జ్ఞాపకాలు అనేకజన్మలలో పేరుకుపోయిన పాపాల వ్యధకు మూలకారణం , నివారణ ఈరోజు వెలివడిందన్నమాట! ఆరోజునుంచే మైకేల్ రోగం, అతని మానసిక వికారాలు క్రమంగా నయం కాజొచ్చాయి కొద్దిటైములోనే!! అతని ఆత్మలో 1112 నుంచి 1915 వరకూ దాగి వున్న గతజన్మపాపం నివృత్తి అయింది

కాని ఎలా నివృత్తి అయిందో ఆ తరువాత గాని అర్థం కాలేదు. అది అతని రెండుజన్మల మధ్య విక్టర్‌గా మరణించి జూలియాగా జన్మించే మధ్యకాలంలో ప్రేతలోకంలో పైనున్న దివ్యపురుషుని కోర్టులో జరిగిన విచారణలోగాని బోధపడలేదు. సంగ్రహంగా దాని సారాంశం ఈ విధంగా వున్నది.

నిర్మలమైన వినీలాకాశం! వెన్నెలలా లేతనీలపువెలుగు. అదేదో లోకం! ఒకమైదానం వంటి ప్రదేశం! భూమ్మీదకాదు! సినిమాలలో డ్రీమ్ సెట్టింగ్‌లా ఆకాశంలోనే వున్న మైదానం. విక్టర్‌గా మరణించిన ప్రేతాత్మ ప్రేతలోకంలో అతి మానసికస్థితి (Meta Consciousness) లో తాను ప్రతీజన్మలోనూ స్త్రీలను, ప్రేమించిన స్త్రీలను హత్యచేసి మతోన్మాదంతో మూటకట్టుకున్న పాపాలకు నివారణకూడా మొదలుకాలేదు! 1112లో హిల్ డెబ్రాంట్‌గా జన్మించిన (Crusade) క్రూసేడ్‌ల కాలంనుంచీ తన జన్మపరంపర ఒక పుస్తకంలోని పేజీలవలే ఐమూలగా గోచరించాయి! అనేక జన్మలపాపాలు, ఘోరాలూ ఒకేసారి ఐమూలగా పుస్తకం పేజీలు ఓరగా చూస్తే కనిపించినట్లు 4, 5 పేజీలు ఒకేసారి గోచరించినట్లు పైనుండి చూసిన విక్టర్ ఆత్మ బాధతో మూల్గింది. పాపాల బరువుతో క్రుంగి పోసాగింది.

ఎదురుగా ఒక మహోన్నత వ్యక్తిత్వం గల యిద్దరు లేక ముగ్గురు కర్మాధికారుల వంటివారు కూర్చునివున్నారు. అదేదో ఒక సైనిక న్యాయస్థానంవలే కమిటీ వంటి (ధర్మాధిపతులు, కర్మాధిపతులు అని హిందూమతంలో పిలిచే) వ్యక్తుల రూపాలు! విక్టర్‌పాపాలకు విషాదంగా తలపంకించారు. భరించరాని తప్పులు జన్మజన్మకీ చేస్తూ పాపాన్ని పెంచుకుంటూ పోతూన్న అతని ఆత్మ వంక చూశారు దయార్ద్ర దృక్కులతో! శూలాల్లాగా విపరీతంగా బాధించాయి వారి కరుణతో కూడిన సానుభూతి చూపులు విక్టర్ ఆత్మను. తనకు కావల్సింది శిక్ష

ఘోరమైన శిక్ష ! విలవిలాడుతూ తన పాపాలకు నిష్కృతి లేదని తగిన ప్రాయశ్చిత్తం కోసం ప్రార్థించాడు తలబాదుకుంటూ! వారు మరొక్కసారి విక్టర్ ఆత్మవంక ఏకాగ్రతతో చూశారు జాలిగా! అంతే అతనిలోని ఆవేశం తగ్గింది! ఆకాశంలా మనస్సు క్షణకాలం నిర్మలమైంది.తానిప్పుడేం చేయాలి! అన్న ప్రశ్నతో తలయెత్తిన విక్టర్ వైపు ఆ దివ్యపురుషుడు

''నీవు మళ్ళా జన్మెత్తాలి! నువ్వు చేసిన సెక్సూ, హింసా, పాపమూ ఈసారి నీవు అనుభవించే పనివుట్టుగా బాధలనుభవించాలి! నీవే ఎంచుకో!'' మరుక్షణంలో భయంతో అరిచాడు విక్టర్ ''వద్దు! వద్దు! మళ్ళీ జన్మలోకి పంపవద్దని. కానీ తప్పలేదు. వారి సలహా తన మనస్సులోనే ప్రతిధ్వనించినట్లైంది.

''ఇదివరకు జన్మలు వేరు! ఇప్పుడు జన్మించేది నీ పాపముల నివృత్తి ప్రారంభం! అది యింతవరకూ జన్మలలో పాపాలు పెంచుకుంటూనే వచ్చావు! ఈ నివారణ కొన్ని జన్మలు పట్టవచ్చు. కానీ పాపం తగ్గించుకుంటూ పోవచ్చు. నీవు మాత్రం నీ కర్మను అనుభవించడానికి తగుశిక్షను అంగీకారంతో స్వీకరించి అనుభవించాలి!''

అన్న సలహాను మహాప్రసాదంగా భావించి విక్టర్ ఆత్మసుళ్ళు తిరుగుతూ ఆకాశంలో చిన్నసైజుకు ఒక పసిబిడ్డలా మారిపోయింది! కానీ ఆడపిల్ల!! అదే జూలియా! ఐదేళ్ళ జూలియాగా గతంలోని తన అనేక జన్మల చెడుకర్మను అనుభవించేశాడు విక్టర్! కాని తను అన్యాయం చేసిన జీవికి యివ్వవలసిన ఆనందం మిగిలిపోయింది. దానికి మళ్ళీ పురుషునిగా జన్మించి దాంపత్యసౌఖ్యాన్ని రాచెల్‌గా అనేక జన్మలలో కాలరాసిన తాను ఆమెనే షెరోన్‌గా పొందాలి! భయంతో కంపించాడు. తాను అనేక జన్మలలో హింసించిన వ్యక్తిని ఎదురబడి తల ఎత్తి చూసే సాహసం లేదు తనకి. కానీపై దివ్యపురుషుని తీర్పు తాను అంగీకరించి ఈ జన్మలో ప్రేతలోకంలో ప్రోగ్రాము వేసుకుని మరీ జన్మించాడు.

ఇప్పుడర్థమైంది మైకేల్ గెల్లాండర్ Ph.Dగా మిగిలిన అనేక జన్మల ప్రేతాత్మకు - తన భార్య షారోన్ ఎందుకు తప్పదో! గతంలోని తన ప్రతి ఒక్క అనుభూతీ, దాని వెనుకవున్న అర్థమూ, అనేక సంవత్సరాల ఈ పూర్వజన్మల జ్ఞాపకాల ట్రీట్‌మెంట్‌తో తన మనస్సు తేలికపడింది. తనకున్న ఆరోగ్య మానసిక సమస్యలు సంపూర్ణంగా నిర్మూలించబడ్డాయి. ఇప్పుడు తాను మామూలు వ్యక్తి కాదు. మామూలు వ్యక్తికి అంతుబట్టని జన్మలూ కర్మలూ ప్రత్యక్షంగా చూసిన అనుభవశాలి!

'' ఈ కర్మ తప్పించుకోలేని సూత్రాలు! ఎవ్వడూ తన ప్రతి చిన్నపనికీ తన అనుభవం గుణపాఠం నేర్చుకుంటేనేగాని చచ్చినా విడిచిపెట్టనిది - నిరంకుశమైన యజమాని కర్మ! దాని తీగెలు టెలిఫోన్ తీగెలవలే అనంతంగా వ్యాపించి వుంటాయి! వందల సంవత్సరాలు అవసరమైతే వేల సంవత్సరాల వరకూ వేచివున్నా దానినుంచి తప్పించుకోవడం అసాధ్యం!''

తప్పించుకోకుండా అనుభవించడమే ఆరోగ్యం! పూర్వజన్మలు ప్రేతలోకాలు విశ్వాసంమీద ఆధారపడ్డవి కావు. అత్యవసరమైన పనిముట్లు. ప్రతీవాడూ తన తప్పొప్పుల అనుభవాలలోంచి పురోగమించి గట్టి గుణపాఠం నేర్చుకుంటేనే కాని యింక వేరేమార్గం కనిపించదు! దీనికి తలఒగ్గి బుద్ధిపూర్వకంగానే సరైన నిజాయితీ కలిగిన న్యాయసూత్రం (Natural Justice) మీద ఆధారపడి ప్రతివారూ తాముచేసిన ప్రతీ పనికీ జవాబుదారీ వహించాల్సిన ఏకైక న్యాయస్థానం మన అంతరాత్మయే!' అంటారు మైకేల్ గెల్లాండర్ తన గత అనుభవాలు మాత్రకట్టిన మాటలతో!



7

# రష్యాలోని సైన్సుకూడా గుర్తించిన ''సూక్ష్మశరీరం'' లేక ''జీవాత్మ''

మహాయోగులు తమ యోగశక్తితో మాత్రమే చూడగలిగిన ఈ 'జీవాత్మ'ను సైన్సుకు సరిపోయేలా ఋజువుచేసే దెలాగ ? ఈ కంటికి కనిపించని సూక్ష్మశరీరాన్ని లేక పదార్థంతో తయారుకాని (స్థూలశరీరానికి అతీతమైన) ''తేజోమయు'' శరీరాన్ని, ఈనాడు భౌతికవాదులైన (Materialists) రష్యన్ సైంటిస్టులు కూడా ఫోటోలతో ప్రత్యక్షంగా చూపించడంలో విజయం సాధించారు!

ప్రపంచంలోని అనేక దేశాల సైంటిస్టులను కూడా కలవరపెడుతున్న సమస్య ఇది! ఎందుకంటే డాక్టర్లు ఎవరూ సూక్ష్మ శరీరం మీద

దృష్టిపెట్టుకుని వైద్యం చెయ్యరు! వీరు శరీరం ఒక రసాయనశాల (Chemical Store) అయినట్టుగా చూస్తారు! ఈనాడు హాస్పిటల్‌లో చాలామంది రోగులు ఆపరేషన్లో కాలుగాని, చేయిగాని తీసివేసిన (Amputation) తర్వాత కూడా చాలాకాలం తమకి పూర్వం ఉన్న చేయి లేక అవయవం ఇంకా తమకువుండి గాలిలో కదులుతూ ఉన్నట్లే భావన కలగటం, చాలామంది రోగుల అనుభవంలోని విషయం!

## నాస్తికుల - వాదం తప్పు :-

దీనికి డాక్టర్లు ఏంచెబుతారంటే — ఇది కేవలం మనస్సుయొక్క ''భ్రాంతి'' అని! అందులోనవూ నాస్తికవాదులైన మనదేశపు వైజ్ఞానికులమనుకునేవారిలో కొందరు తమకు ఏమీ తెలియని (ఆ విషయంలో ప్రత్యేక పరిశోధనేమీ పూర్తి చేయకున్నా) రూఢిగా 'ఆ విషయాలేవీ లేవని' యదార్థంగా చెప్పగలరు! ఇది, సైన్సా? అంతేగాక, యదార్థంగా కూడా నిజానికి యదార్థ సత్యానికి విరుద్ధంగా వీరు అదంతా **'మానసిక భ్రాంతి'** లేక 'గ్రంధుల లోపం' అని పరిశోధనలేని దొంగమాటలతో సరిపుచ్చి ''సైన్సు'' యొక్క లోటును వీరి, సొంత ఊహతో పూరిస్తారు. ఇది అందరం గమనించాల్సిన వీరిలోని పెద్ద లోపం!

## రష్యన్ సైంటిస్టులు -నిజమైన పరిశోధకులు :-

కాని రష్యన్ సైంటిస్టులు మాత్రం అలా చేయలేదు. వీరు తమ సొంత అభిప్రాయాలను ఒక ప్రక్కన ఉంచి, తమ విశ్వాసాలతో ఎట్టి, సంబంధం లేకుండా కేవలం నిజాన్ని తెలుసుకొనే దృష్టితోనే పరిశోధనలను చేశారు! ఈ పరిశోధనల ఫలితంగానే - 'స్థూలశరీరంతో ఏ సంబంధంలేని (స్థూల శరీరంనుంచి విడిగా వుండేది) ఒక ''సూక్ష్మశరీరం'' ఉన్నట్లు స్పష్టంగా కంటికి కనిపించేటాగ, ఋజువుచేసిన పరికరమే - ''కిర్లియన్

ఫోటోగ్రఫీ'' (Kirlian Photography). ఈనాటి ''ఎక్సరే''లాగ ఇది ఒక సరిక్రొత్త పరికరం!

ఐనాకూడా చాలామంది ''కిర్లియన్ ఫోటోగ్రఫీ'' గురించి సిద్ధాంతంలో భ్రమింపజేసేందుకు ఒక సందేహాన్ని లేవదీశారు. ఏమని? అంటే ''కిర్లియన్'' ఫోటోలో మనిషి శరీరంచుట్టూరా కనిపించే 'తేజస్సు'(Aura), అనేది నిజానికి అదేమీ ఆధ్యాత్మిక తేజస్సేమీకాదనీ, అది కేవలం ప్రతి వస్తువుచుట్టూ ఉండే 'అయస్కాంత కిరణాల' (Electro Magnetic Radiation) దర్పణ-ప్రసారం (Refractrion) వంటి కేవల శక్తి తరంగాలే అది, 'జీవాత్మ' గాని మరేమీ కాదంటారు.

దీనికి వీళ్ళు చెప్పే వాదమేమంటే ''కిర్లియన్'' ఫోటోగ్రఫీతో నిర్జీవమైన లోహాలు ఇంకా ఇతర వస్తువులవంటివి ఫోటో తీసినా వాటిచుట్టూరా,కూడా ఇలాంటి తేజస్సులా కనిపించే విద్యుదయస్కాంత కిరణాల ''ఆవరణమే'' (Aura) ఐ ఉంటుందనీ, అలా నిర్జీవమైన వస్తువులకు కూడా ఈ ''తేజస్సు'' ఉంటుంది కాబట్టి ఈ తేజస్సుకు 'అంతరాత్మ' లేక — 'జీవాత్మ' అని పేరు పెట్టడానికి వీల్లేదని వీరి వాదం! -

అంతేకాదు అసలీ తేజస్సును విడిగా పదార్థమయ శరీరంనుంచి వేరుచేసిగాని, లేక పదార్థమయ శరీరం ఆధారం లేకుండా గాని ఈ ''సూక్ష్మ శరీరాన్ని'' చూపించడమే, సాధ్యంకాదనీ ఈ భౌతికవాదులైన ''నాస్తికుల'' మూఢనమ్మకం! ఈ వాదాన్నికూడా పరిశోధించడంలో తప్పులేదు గదా!

## వాదంకన్నా - పరిశోధనే, మిన్న!

రష్యన్ సైంటిస్టుల పరిశోధనలు కేవలం ఇలా, వాదంమీదే ఆధారపడినవి కావు. ఇది యదార్థమైన సైన్సు పరిశోధనతో ప్రత్యక్ష ప్రమాణంగా ఋజువులతోసహాప్రచురించినవి సైన్సు బృందాలచే మళ్ళీ పరిశీలించబడినాయి. ఎందుకంటే సత్యాన్వేషణలో సైన్సులోకూడా,

తర్కంమీద ఆధారపడిన వాదం (Hypothesis) కంటే ప్రత్యక్షమైన "రీసెర్చిలో" కనబడే (Experimental evidence) సాక్ష్యాలకే విలువ ఎక్కువ. ఎందుకంటే తర్కం సైంటిస్టుయొక్క విశ్వాసాన్ని బలపరచవచ్చు. కాని, పరిశోధనాఫలితం అతని సిద్ధాంతాన్ని ఒక్కోసారి బలహీనపరిచినా పరుస్తుంది! ఒకసారి బలపరుస్తుంది. ఇంకోసారి వ్యతిరేకంగానూ రావచ్చు! రష్యన్ సైంటిస్టుల విషయంలో కూడా సరిగ్గా ఇదే జరిగింది.

## రష్యాలో 'ఆధ్యాత్మిక' పరిశోధన!

రష్యాలో 1906లో కొన్ని జంతువులలో కనిపించే వెలుతుర్ని("Bio-luminscence లేక Phosphorescence") (మిణుగురు పురుగుల కాంతివంటిది) గురించి కొన్ని పరిశోధనలు చేయబడినాయి. ఇందులో కూడా కిర్లియన్ ఫోటోగ్రఫీ తీసే కమేరాతో రకరకాల చెట్లను, ఆకులను, అనేక విధాలుగా ఫోటోగ్రాఫ్ తీయడం జరిగింది, అందులో ప్రత్యేకించి - "సూక్ష్మశరీరం అనబడేది, కేవలం తేజస్సు మాత్రమే. పదార్థమైన వస్తువు ఆధారంలేకుండా శరీరంనుంచి, దీన్ని విడిగా చూపడం సాధ్యం అవుతుందా?" అన్న ప్రశ్నవేయడం కూడా జరిగింది.

దానికి సమాధానంగా యువకుడైన ఒక సోవియట్ సైంటిస్టు "కజక్స్థాన్" ప్రభుత్వ యూనివర్సిటీలో (University of Kazaksthan) పనిచేస్తున్న సైంటిస్టు — "ఇదిగో ఇవి చూడండి" అని ఈ ప్రశ్నకు సమాధానంగా, తన సూట్‌కేసులోంచి కొన్ని ఫోటోగ్రాఫుల కట్టల్ని బయటకుతీశాడు ! అందులోంచి ఒక ఫోటో తీసిచూపెట్టాడు. అది ఒక ఆకు యొక్క ఫోటోగ్రాఫు - 'కిర్లియన్ ఫోటోగ్రాఫు' తీసిన మిగతా ఫోటోలాగే అన్నివైపులా నిప్పురవ్వలవంటి కాంతి మెరపులతో తళతళలాడే స్పష్టమైన తేజస్సు అంచులచుట్టూ కనిపిస్తూ వున్నది. ఇది ఒక ఆకును

'కిర్లియన్' ఫోటోగ్రఫీ తీశారని గుర్తించగలిగారు. ప్రశ్న వేసిన వారు, అలాంటిదే అతను మరో ఫోటోగ్రాఫు తీసి చూపెట్టాడు.

## ఆకు - 'సూక్ష్మశరీరం!'

దాని మధ్యలో ఒక సరాసరి గీతవంటిది ఏర్పడి ఉంది. దానికి అటూ ఇటూ 'ఆకు ఆకారం' కాంతివంతంగా మెరుస్తూ, అందులో ఆకుల్లోని ఈనెలు, పోగమంచులాగ ఆకుయొక్క నేత (Texture) ను అనుసరించే కనపడుతోంది.

## ఆకు - 'జీవాత్మ '!

అప్పుడు, ఆ రష్యన్ సైంటిస్టు అన్నాడు - ''ఇది ఇందాకటి ఆకుయొక్క ఫోటోనే — కాని మొదటి ఫోటోగ్రాఫు తీశాక ఆకు సగం భాగం కత్తిరించాం. అయినాగాని కత్తిరించి తీసేసిన ఆకు **భాగంక్కూడా** పూర్తిగా ఈ కిర్లియన్ ఫోటోగ్రాఫులో కనబడుతోంది చూడండి'' ! అంటే అర్థం ఏమిటంటే నిజానికి రెండవ ఫోటోగ్రాఫులో వారు చూస్తున్నది ఆకుయొక్క ''ప్రేతాత్మ'' (Ghost) లేక 'జీవాత్మ' (Plasma body) అన్నమాట.

అందుకే, దాంట్లో కొంత కత్తిరించాకకూడా ఇది సరిగ్గా ఆ 'పూర్తి ఆకు' యొక్క 'స్థూల శరీరాన్ని' పోలివున్నది ! అంటే ఈ సూక్ష్మశరీరం, స్థూలశరీరం కవలల్లాగ ఉన్నాయన్న మాట.

'మరైతే ఈ ప్రేతాత్మ దేనితో తయారయి ఉంటుంది?' ఆ ఫోటోను చూస్తున్న వేరే ఓ సైంటిస్టు అడిగాడు. ఆ యువకుడైన సోవియట్ సైంటిస్టు ఈసారి, కత్తిరించివేసిన ఆకుకి తీసిన 'కిర్లియన్ ఫోటోగ్రాఫ్‌ను చూపిస్తూ ఉత్సాహంగా సమాధానమిచ్చాడు! వారి సంభాషణ ఇలా సాగింది.

## నూతన - ''శక్తి'' (New Energy)

''అది ఒక రకమైన 'చైతన్యం' తోగాని లేక 'శక్తి'యేగాని, పదార్థం కానేకాదు ! దీన్ని ఇంకా పరిశోధన చేస్తున్నాం — ఈ చైతన్యం ఎక్కడనుంచి వస్తున్నదా! అని. ఈచైతన్యశక్తి ఒక రకమైన విద్యుత్ అయస్కాంత వలయం (Electro Magnetic Field) వంటిదని చెప్పవచ్చు. కాని ఈ సూక్ష్మశరీరంలోని శక్తిమాత్రం విద్యుత్ (కరెంటు)లో ఏర్పడింది కాదు ! అయస్కాంత శక్తీకాదు ! ఇది మనకి ఇప్పటివరకు సైన్సుకు తెలిసిన ఏరకం శక్తీ కాదు.

అందుకే దీనికి సైన్సులో ఒక క్రొత్తపేరు పెట్టాము 'ప్లాస్మా' (Plasma)అని, భౌతికశాస్త్రం (Physics)లో పదార్థంయొక్క నాల్గవదశ ఈ మధ్యనే క్రొత్తగా అణుశాస్త్రజ్ఞులచేత కనిపెట్టబడింది. అంటే పదార్థం(Matter) అణువులుగా, పరమాణువుంగా, ఎలక్ట్రానులుగానే కాకుండా 'ప్లాస్మా' రూపంలోకూడా (అణువులక్రింద కాకుండా) ఉంటుందని కనుక్కున్నారు.

## ఆకులకూ ''ఆత్మ'' వుందా ?

''ఆ ఆకులో సగం కంటే ఎక్కువ కత్తిరిస్తే అప్పుడేవిధంగా వస్తుందీ 'కిర్లియన్ ఫోటోగ్రాఫు?''

అంటే, 'అప్పుడా ఆకు చచ్చిపోతుంది, దానితోపాటు దాని **'తేజోమయ శరీరం'** లేక **'జీవాత్మ'** కూడా దీంట్లోంచి, వెళ్ళిపోతుంది.

''ఒక మనిషి వేలుగాని, కాలుగాని, చేయిగాని ఆపరేషన్ చేసి గనక తీసివేస్తే ఆ అవయవం **తీసివేసిన తర్వాతకూడా** — ఆ స్థూలశరీరం లోపల వుండే సూక్ష్మశరీరం(జీవాత్మ)లోని కాలుగాని, చేయి గాని అలానే ఉంటుందా?

ఇలాంటి అనేక చర్చలు, సమావేశాలు, సెమినారుల ద్వారా రష్యా సైంటిస్టులు సూక్ష్మశరీరంమీద చేసిన పరిశోధనల సారాంశంలో, ముఖ్యవిషయాలను తెలుపడం మాత్రమే ఇక్కడ సాధ్యపడుతుంది. పరిశోధ వివరాలు కావాలంటే ఈ అధ్యాయంచివర చూపిన రీసెర్చివ్యాసాలు తెప్పించి చదువుకుంటే పూర్తి వివరాలు చూడవచ్చు. ఈ అధ్యాయం ఉద్దేశ్యం చూచాయగా అనేక రంగాల్లో రష్యన్లు కనిపెట్టిన ఆశ్చర్యకరమైన విషయాలు తెలుపడం మాత్రమే. చదువు చెప్పటం, కాదు !

## ''సూక్ష్మశరీరం ''- వొట్టి 'తేజస్సా'? లేక - అదీ ఒక ''శరీరమా?''

రష్యాలోని అంతరిక్ష పరిశోధనాకేంద్రం 'కజక్స్థాన్' (Kazakhstan)లో ఉన్నప్రభుత్వ విశ్వవిద్యాలయంలో ముఖ్యమైన జీవశాస్త్రజ్ఞులు, రసాయన శాస్త్రజ్ఞులు, ఫిజిక్సు పరిశోధకులు అంతా ఒక్కచోట కలిసి ఒక బ్రహ్మాండమైన 'ఎలక్ట్రానిక్ మైక్రోస్కోపు' చుట్టూ నిలబడివున్నారు.

ఇది 'కిర్లియన్' దంపతులు కనిపెట్టిన స్పెషల్ కెమేరా నుంచి ఎంతో పరిణామం పొందిన ఆధునిక మూవీ - యంత్రం! దాని చుట్టూ చేరిన సైంటిస్టులు ఆ సూక్ష్మదర్శినిలో కన్నులుపెట్టి, అందులో పెద్దవిగా కనపడుతున్న సూక్ష్మశరీరానికి సంబంధించిన సినిమావంటి కదిలే చిత్రాల్ని(Movie-గా) చూస్తున్నారు. వీళ్ళందరి పరిశోధనలోనూ ముఖ్యమైన గమ్యం ఒక్కటే! స్థూల శరీరానికి జంటగా వుండే ఈ సూక్ష్మశరీరం దేనితో తయారయింది? అన్న విషయం ఇలా పరిశోధనతో తేల్చుకోవాలి.

ఇది 'ప్లాస్మా' (Plasma) వంటి ప్రాథమిక పదార్థం (Elementary Matter) ఇంకొక సూక్ష్మశక్తితో కలిసి ఏర్పడిన పొగవంటి తేజస్సు. ఇది

ఆకాశంలోని నక్షత్రాల మేఘం(Star-cloud)లాగ కనబడుతోంది. ఈ సూక్ష్మశరీరం కేవలం ఎలక్ట్రానులవంటి కణాలతో లేక రేణువులతో తయారైన ఒక స్పష్టమైన (Independant-entity) శక్తిగా దీన్నిబట్టి బుజువౌతోంది.

అంతేకాదు! ఇది నిరాధారంగా పొగమంచులా ఏర్పడ్డ శక్తి -కాదు. స్పష్టంగా ఆకారంతో వున్న ఒక జీవంగానూ, అన్ని పనులూ నిర్వహించగల ఒక వ్యక్తిత్వాన్ని కలిగివున్నది.

`This energy body is not just particles. It is *not* a chaotic system! It is a Whole Unified Organism, in itself. It acts as an Unit' — అన్నారు!

కనుక మన భారతదేశంలోని **మిడిమిడి** జ్ఞానం కల్గిన నాస్తికపెద్దలు ఊహించినట్లుగా ఈ సూక్ష్మశరీరం అనేది ప్రతి నిర్జీవశరీరం చుట్టూ వ్యాపించివుండే **కరెంటు తరంగాల** వంటి నిర్జీవ -'తేజస్సు' కాదు. ఇది ఒక స్పష్టమైన జీవం కలిగిన (Living person) వ్యక్తిత్వం.

యీ విషయాన్ని స్పష్టంగా పరిశోధించిన రష్యన్ సైంటిస్టులు 1968లో వాళ్ళ సిద్ధాంతాలను ప్రచురించటం జరిగింది. వాళ్ళ 'రీసెర్చి' అంటే పరిశోధన అంతా ఒక గ్రంధంగా కూడా, ప్రచురించబడింది. **'జీవుల ప్లాస్మాశరీరం'** అన్న పేరుతో ఈ పరిశోధన వెనక దిగ్గండులవంటి రష్యన్ సైంటిస్టులు వి. ఇనై యుషీన్, వి. గ్రిశ్చెంకో, ఎన్. ఒరొవేవ్, ఎన్. సోయిస్కీ, ఎన్. ఫెడొరోవో, ఎఫ్. గిబాడులిన్ మొదలైన బ్రహ్మాండమైన అనుభవజ్ఞులూ, మేధావులూ వున్నారు. వాళ్ళ పరిశోధనల సారాంశం ఒక్క ముక్కలో చెప్పవచ్చు.

## సైన్సు - కనుగొన్న సిద్ధాంతం :

'అన్ని ప్రాణం కలిగిన **జీవులు** — అంటే చెట్లు, జంతువులు, మనుష్యులు — ఒక **పదార్థశరీరం** మాత్రమే కాకుండా ఒక **చైతన్యంలో** తయారైన **'రెండవ శరీరాన్ని'** కూడా కలిగివున్నాయి ! ఈ పదార్థమయ

- శరీర అణువులతో పరమాణువుల (Matter)తో తయారైవుంటే, దానికి జతగావున్న ఇంకొకశరీరం ప్లాస్మా శరీరం — ఒకానొక చైతన్యశక్తితో తయారయివుంది.

నిశితంగా ఆలోచిస్తే ఏ మేధావికైనా తడుతుంది-పై రష్యన్ సైంటిస్టుల పరిశోధన — ఎన్నో అద్భుత ఫలితాలతో కూడుకుని వుందని !!! ఎందుకంటే 'కజక్స్థాన్' ప్రభుత్వ యూనివర్శిటీ 1968లో ప్రచురించిన రిసెర్చి గ్రంథం. 'ఆల్మా-ఆటా' (Alma-Ata)లో 'కిర్లియన్' పరిశోధనల్లో ప్రముఖమైన నిర్ణయాలూ ఋజువులూ క్రోడీకరించబడి సైన్సులో వేరే ఒక క్రొత్త ప్రపంచంలోకి తీసుకువెడుతుంది మనల్ని.

ఈ పరిశోధనలోని 'రీసెర్చి' వివరాలతో సామాన్య వ్యక్తిని ఇంకా, బాధపెట్టకుండా అందులోని ముఖ్యంగా నిర్ధారణగా ఋజువైన విషయాలనే ఇక్కడ గమనిద్దాము.

1. కొన్ని జీవులు, మిణుగురు పురుగుల వంటివి శరీరాన్ని వెలిగేలా చేయగలవు ! ఈ వెలిగేశక్తి కూడా 'కిర్లియన్' ఫోటోగ్రాఫులో పరిశోధించబడింది. దీనిలో ఏమి తేలిందంటే, ఈ మెరిసే మిణుగురు పురుగులు,సముద్రపు చేపలు, రకరకాల వెల్తురు పురుగులు వాటి శరీరంలోంచి వచ్చే ఆ వెలుగును వాటి లోపలున్న సూక్ష్మశరీరంవల్లనే పుట్టిస్తున్నాయని !

   ఈ వెలుగు, కరెంటువల్ల కాని సైన్సుకు తెలిసిన ఏ ఇతర శక్తి (Energy) వల్లా, లేక రసాయనిక మార్పులవల్లా కాదని నిర్ధారణగా రూఢి అయింది.

2. ఈ 'సూక్ష్మశరీరా'నికి ఒక స్పష్టమైన 'ఆకారం' వుందని ! అంతేకాదు అది ఆకాశంలో(space-లో) లేక రోదసిలో కొంత పరిమాణాన్ని(Volume) ఆక్రమిస్తుందని కూడా తేలింది.

అంటే అర్థం, అది ఒక శరీరం, దానికొక ఆకారం వున్నది. యీ శరీరంలో (సూక్ష్మశరీరంలో) కాంతిపెరసులవంటి రేణువులు నిరంతరం కదలికలో వున్నాయి. ఈ కదలికలు, **అణువులతో తయారైన** పదార్థంలోని రసాయనిక మార్పులకు **సంబంధించినవి కావనీ** నిశ్చయంగా తేలింది.

3. ఈ సూక్ష్మశరీరం కూడా, మనశరీరాలలాగే, వేరు వేరు అవయావాలలో వివిధమైన అమరికలలో కనిపిస్తూ వుంటుందని!

అంటే స్థూలశరీరంలో ఎలాగైతే పదార్థం ఎముకలలోను, మాంసంలోను, రక్తంలోను, జీవకణాల (Tissues) అమరిక వేరువేరు రకాలుగా ఎలా వుంటుందో - అలాగే సూక్ష్మశరీరంలోకూడా **కాంతి రేణువుల** అమరిక వేర్వేరు శరీరభాగాల్లో వేరు వేరుగా వుంటుంది.

4. స్థూలశరీరంలోని ఏ భాగమైనా కత్తిరించివేస్తే లేదా ఖండించివేస్తే - దానివల్ల ఆ భాగంలోని సూక్ష్మశరీరానికి, ఏవిధమైన నష్టం పొందకుండా అది, తన పూర్వపు ఆకారంతోనే వుంటుందని.

5. స్థూలశరీరం చనిపోగానే అంటే ప్రాణంపోయినప్పుడు దానికాధారమైన ఈ **సూక్ష్మశరీరం** కూడా **అదృశ్యమైపోతుందని.**

6. అంటే దీని అర్థం మరణించిన జంతువులలో, చెట్లలో జీవులలో యీ సూక్ష్మశరీరం **కనబడదు !**

ఇది జీవించివున్న వాటిలోనే ఈ 'జీవాత్మ' వుంటుందని అర్థం.

## ప్రాణాయామంతో సూక్ష్మశరీరం బలం

ఇంకో ఆశ్చర్యం ఏమిటంటే వీరు భారతదేశంలోని యోగులు కనుగొన్నట్లుగా ప్రాణయామంలో గాలి పీల్చడంవల్ల శరీరంలోని ప్రాణశక్తి

వృద్ధిఅయి శరీరం అంతటా వ్యాపించివున్నట్టుగా, ఈ సూక్ష్మశరీరం 'బ్యాటరీ ఛార్జి' చేసినట్లు ఉత్తేజం కాబడి 'ఛార్జి' అవుతుందని కూడా తెలుసుకొన్నారు. రష్యన్ సైంటిస్టులు చెప్పేదేమిటంటే యీ సూక్ష్మశరీరం మీద జరిగిన పరిశోధనవల్ల ఒక గొప్ప వైద్యశాస్త్రసత్యం బయటపడింది. అదేమిటంటే:-

శ్వాస ఎక్కువ పీల్చినప్పుడు యీ సూక్ష్మశరీరం ఉత్తేజమవు తద్వారా శరీరంలోని రోగాలు తగ్గే ఫలితం కనబడుతుంది. అంతేకా 'నెగిటివ్ కణాలు' కలిగిన కరెంటుశక్తితో వ్రణాలమీద స్ప్రే చేసినపుడు ఆ వ్రణం వెనుక సూక్ష్మశరీరం భాగం ఉత్తేజం కాబడి త్వరగా మానుతుంది.

## సూర్యుడూ - సూక్ష్మ శరీరము

అన్నిటికన్నా ఆశ్చర్యకరమైనవి డా॥ ఖిజేవిస్కీ (Dr. Chijevsky) సూక్ష్మశరీరం మీద జరిపిన పరిశోధనా ఫలితాలు, దీనివల్ల **సూర్యుడిలో జరిగే మార్పులకీ** మానవశరీరంలో వున్న జీవాత్మకి లేదా సూక్ష్మశరీరానికి మధ్య — ఒక విచిత్రమైన **సంబంధం వున్నట్లు** తేలింది. ఈయన సూర్యుడిలోని మచ్చలు ప్రతి 11 - **సంవత్సరాలకి ఒక్కసారి మారుతూ వుంటాయనీ,** ఈ కాలంలో జరిగే మార్పులు మనిషి శరీరంలో **సూక్ష్మశరీరం ద్వారానే ప్రసారం అయి,** పనిచేస్తాయని చాలా **ఆశ్చర్యం కలిగించేలా** ఋజువు చేశాడు.

ఈ **కాలంలో** జరిగే మార్పుకూ సూర్యుడిద్వారా, గ్రహాలద్వారా సూక్ష్మశరీరంమీద పడే అయస్కాంత కిరణాలు ప్రోటాన్ రేణువుల ప్రసారం సూర్యునిలోని మచ్చలు చాలా ప్రభావాన్ని కలుగజేస్తాయని 'ఖిజేవిస్కీ' పరిశోధనలో ఋజువైంది ! కొన్ని శతాబ్దాలుగా మనదేశంలో యోగులు టిబెట్‌లోని సాధువులు తను స్థూలశరీరం విడిచిపెట్టి బ్రతికివుండగానే యీ

సూక్ష్మశరీరంతో ప్రయాణించి పరకాయప్రవేశం చేసి ఇంకొక శరీరంలో ప్రవేశించే విద్య ప్రచారంలో వున్నది.

## పరకాయ ప్రవేశం - సూక్ష్మ శరీరంతో :

ఆదిశంకరాచార్యుల వంటివారు తమ యోగశక్తిచేత చనిపోయిన ఒక మహారాజా శరీరంలో ప్రవేశించి మళ్ళీ తిరిగి తన **జీవాత్మను** అందులోంచి **ఉపసంహరించినట్లు** చరిత్ర చెబుతోంది !

ఈ విషయంమీద కూడా కొందరు సైంటిస్టులు పరిశోధనచేసి, కొన్ని **విచిత్రమైన అంశాల్ని** ప్రచురించారు. అమెరికాలోని కాలిఫోర్నియాలోని యూనివర్సిటీలో **''చార్లెస్ టార్ట్''** (Charles Tart) **''హెరాల్డ్ షర్క్''** అనే E.S:P రీసెర్చి సంస్థలో పనిచేసే పరిశోధకుడూ ఆధ్యాత్మిక వ్యక్తి అయిన ఈ రచయిత స్వంత అనుభవాల్లో కూడా కొన్ని క్రొత్త విషయాలు బయటపడ్డాయి.

అందులో ముఖ్యమైంది ఈ సూక్ష్మశరీరం. **కొబ్బరికాయలో కురిడీవలే మన స్థూలశరీరంలోంచి బయటికి పంపించవచ్చు. అది మళ్ళీ మన శరీరంలో ప్రవేశపెట్టుకోవచ్చుని.**

రష్యన్ పరిశోధనలో తేలిన విషయమేమిటంటే దూరదృష్టి, దూరశ్రవణంవంటి అద్భుతశక్తులూ లేక ''ఉల్ఫ్ మెస్సింగ్'' కున్నటువంటి ఇతరుల మనస్సును చదివే అద్భుతశక్తి, వాళ్ళ స్థూలశరీరంలో జరిగే పనికాదు. అదంతా, **''ప్లాస్మా''** (Plasma Body) శరీరం వల్లనే యివి సాధ్యపడుతున్నాయని 'డోబ్రోవిచ్' వ్రాసిన పరిశోధనాగ్రంధం !

''**నీ శరీరంనుంచి బయటికి వెళ్ళిపోదలచావా?**''(Do You Want to Get Away from Yourself ?) అన్న దానిలో చూడవచ్చు.

## నూతనయుగం :-

ఒక్కముక్కలో చెప్పాలంటే — సోవియట్ సైంటిస్టులు 'సూక్ష్మశరీరం' (జీవాత్మ)పై జరిపిన ఈ పరిశోధనవల్ల — మానవ చరిత్రలోనే ఒక నూతనశకం ప్రారంభమయింది!

ఎందుకంటే యువకులైన 'కిర్లియన్' దంపతులు ''సెమియాన్ డేవిడోవిచ్ కిర్లియన్' అతని భార్య 'వాలెంటేనా కిర్లియన్' కలిసి, అందరికీ **మనిషి అంతరాత్మను కొంచమైనా చూడ్డం**, యంత్రాల సహాయంతోనే — సాధ్యపడేలాగ చేశారు. దీనివల్ల మానవుడి విజ్ఞానం ఎంతో మారిపోతుంది, జరిగిన దానికంటే భవిష్యత్తులో జరగబోయే పరిశోధనం అంతరార్థమే **మానవ చరిత్రనంతా ఇది మార్చివేస్తుంది.**

## మనిషికి రెండు - శరీరాలు!

ఎందుకంటే నేటి మానవుడికి 'మనిషి' గురించి వున్న ప్రస్తుత భావమే పూర్తిగా మారిపోతోంది. అంతేగాదు ఈ మార్పు ఒక్క 'సైన్సు'నే **మార్చటంకాక,** దాని ఆలోచనా ప్రభావం అటు వైద్యశాస్త్రం, మనస్తత్వ శాస్త్రం, వేదాంతం, కళ ఇలా అనేక రంగాల్లో — మానవ స్వరూపాన్నే మార్చి వేస్తోంది. మనిషికి రెండు శరీరాలున్నాయని, మానవుడిలోవున్న 'దైవశక్తులు', లేక ఆధ్యాత్మిక శక్తులనేవి ఈ **'సూక్ష్మశరీరం'తోటే** ముడిపడి వున్నాయనీ, మనిషిమీద సూర్యుడూ గ్రహాలప్రభావం ఈ సూక్ష్మశరీరం ద్వారానే జరుగుతోందనీ, హఠయోగంలోని షట్చక్రాలూ ఈ సూక్ష్మశరీరంలోవి ప్రభావాలపై గ్రహాలలోని అయస్కాంత తరంగాలకు ప్రభావం ముడిపడి వుందనీ, ఈ పరిశోధనలవల్ల స్పష్టంగా తేలింది.

''మేరీక్యూరి'' ఆనాడు ఎలాగైతే జడంగావున్న లోహాలలోంచి వెలికి 'రేడియం'ను కనిపెట్టిందో — అలాగే 'కిర్లియన్' కూడా మనిషిలోపల

వెలిగె రంగురంగుల తేజోమయ లోకం ఒకటి వున్నదనీ ఈ సూక్ష్మశరీరం ఒక వెలుగుబాటకు ద్వారం తెరిచి చూపించాడు మానవజాతి కంతటికీ !

అంటే ''హిందూమతం'' స్థాపకులైన ఋషులు లక్షల వేల ఏండ్లనాడే ''సూక్ష్మ - శరీరాన్ని'' యోగంతో చూసి కనుగొన్న ''ప్లాస్మా శరీరం'' కూడా సైన్సుప్రకారం సత్యమని రూఢి అయింది!

దీనితో మానవుడికి ఒక ''అంతరాత్మ'' అనేదే లేదనే భౌతికవాదం యొక్క ''కమ్యూనిజం''కు పునాదిరాళ్ళే విరిగిపోయాయి రష్యాలోనే!!!

దీంతో ప్రపంచం అంతటా రానున్న శతాబ్దంలో అనేక **ఆధ్యాత్మిక సత్యాలు ఋజువై నాస్తికత్వం అనేది, శాశ్వతంగా సమాధి కావటానికిది ఆరంభం. ఇదే ఒక 'నూతన - యుగం'.**

ఇదే 1999 — ముందుగా రానున్న ''కలియుగాంతానికి'' ''సత్యయుగాని''కీ నాంది పలికింది రష్యాలో!

(వివరాలకు **అనుబంధం** చూడండి!)



8

# ‘హిందువుల-మూఢవిశ్వాసమా? - నాస్తిక రష్యాన్ సైన్సుకనుగొన్న ‘మహాసత్యమా?’

మనిషి శరీరంలో అతని వ్యక్తిత్వానికి, స్వభావానికి మానసిక లక్షణాలకూ, కారణమైనదేదో అంతర్లీనంగా ఉన్నా, పైకి మాత్రం కనిపించేది పదార్థమయశరీరం! లోపల ‘తాను’గా ఉండే వ్యక్తిత్వం పేరు ‘‘జీవాత్మ’’! ఇది ప్రాచీన మతగ్రంథాలు, యోగశాస్త్రగ్రంథాలు, తెలుపుతున్నాయి.

కాని సోవియట్ రష్యాలో 1917లో వచ్చిన కమ్యూనిష్టు ప్రభుత్వం ‘నాస్తికత్వం’(Atheism), ‘భౌతికవాదం’(Materialism) అన్నవి రెండే మూలసూత్రాలుగా పెట్టుకొన్నది. అందువల్ల మతసంబంధమైన విశ్వాసాలను, మూఢనమ్మకాలుగా ఋజువుచేసి, తద్వారా ప్రజలకు

మతంపైన, ఆధ్యాత్మిక విషయాలపైనా నమ్మకంపోగొట్టి, ఆసక్తి లేకుండాచేసే ప్రచారకార్యక్రమం పెద్ద ఎత్తున చేపట్టింది.

## 'నాస్తిక వాదం'- రాజకీయావసరం

దీనిలో మొదటి భాగంగా ప్రజల మనసుల్లో, మతం అన్నా, దేవుడన్నా సాధువులన్నా, యోగులన్నా అవిశ్వాసం ద్వేషం రగిల్చి, ఇవన్నీ బూటకాలని నమ్మించే ఉద్యమం తారస్థాయినందుకొన్న రోజులు, స్టాలిన్ పరిపాలనలో నడిచాయి. ఇప్పటికీ కమ్యూనిస్టుపార్టీ మన దేశంలోకూడా తరచూ దేవుళ్ళమీదా, సాధువులు సత్పురుషులమీదా, యోగసిద్ధులు, మానవుడి అతీంద్రియశక్తులమీదా ప్రతినిత్యం దాడిచేస్తుండటం కనబడుతోంది, మనకీనాడు సినిమాలలో, ఉపన్యాసాలలో, నవలల్లో అనేకవిధాలా, విద్యార్థుల మనసులలో పసివయస్సులలో ఉన్న పిల్లల ఆలోచనలలో నుంచి, ఈ ప్రాచీన ఆధ్యాత్మిక సంస్కారాలను, సమూలంగా తుడిచి పెట్టేయ్యాలనే ప్రచారం, కొన్ని సంవత్సరాలుగా ఈ భౌతికవాద శక్తులు చేస్తున్నాయి. కాని ఇదే ప్రచారం ప్రచ్ఛన్నంగా, పైకి తెలియకుండా అనేక రూపాల్లో మనదేశంలో కూడా నడుస్తున్నది! మన ప్రభుత్వాలు, అంతగా పట్టించుకోక పోవడంవల్ల ప్రభుత్వ యంత్రాంగంలోవున్న బాధ్యతగల వ్యక్తులుకూడా ఈ నాస్తికవాదానికీ, భౌతికవాదానికీ, డబ్బు ఆశతోనో, భయంతోనో, కట్టుబడి ఏమీ చేయకుండా ఊరుకోవడం జరుగుతోంది. ఇలాంటి ప్రచారంలో మొదటిది, ముఖ్యమైనది — ''**మనిషికి అంతరాత్మ అనేది లేదు**''. అన్న **నాస్తికవాదుల మూలసిద్ధాంతం.**

## పదార్థం- యదార్థమా ? :-

మనిషి కేవలం రసాయనిక వస్తువుల కలయిక వల్ల ఏర్పడుతున్న

సంయోగంతో నడిచే, ఒక యంత్రంవంటివాడే కాని, మనిషి శరీరం తూలిపో తరువాతకూడా, మిగిలే శాశ్వతమైన 'సత్యం, లేక 'జీవాత్మ' అనేది ఏదీ లేదనీ, అలాంటిది ఉండటం కూడా అసంభవం అన్న వాదమే, ఈనాడు మన దేశంలో 'రేషనలిష్టులు' లేక సత్యాన్వేషణపరులు లేక చైతన్యసంస్థలు, 'నాస్తిక ప్రచార సభలు' 'చర్వాక సమ్మేళనములు' అంటూ, అనేక రకరకాల పేర్లతో బోలెడంత డబ్బు పెట్టుబడి పెట్టిమరీ ఈరకమైన రహస్యసంస్థలు పరోక్షంగా - ప్రచారాన్ని చేస్తున్నాయి. ఈ పనివెనుక బైటిదేశాల మద్దతువున్నదన్నా మనం ఆశ్చర్యపడనక్కరలేదు. ఎందుకంటే మనదేశ సాంప్రదాయాలనూ ప్రాచీన **భారతీయ సంస్కృతినీ, వేళాకోళం** చేయడం, దుయ్యబట్టడం, వంటి దురభ్యాసాలు యువతకు నేర్పడం, ప్రజలలో **ఆధ్యాత్మిక విషయాలపై(కారణంలేని) అవిశ్వాసం, ద్వేషం, కలిగేలా చేయడ వారి కార్యక్రమం.** మన దేశంలో వున్న విదేశీ మానస పుత్రులకుకూడా రష్యను కమ్యూనిష్టులకు ఆనాడు ఎప్పుడో 1917లో మూలసూత్రాలుగా వుండివున్న అవిశ్వాసము, భౌతికవాదాలే ఈనాటికీ – ఆధారం అందులో ముఖ్యమైనది మనిషికి **'ఆత్మ'** అంటూ ఒకటి లేదనే **మూర్ఖవాదం!** 30సం॥రాల అవిశ్వాసం తార్వాత మనిషిలోవుండే ఈ 'జీవాత్మ' గురించి రష్యాలో జరిగిన-జరుగుతున్న పరిశోధనలు ఏం తెలుపుతున్నాయో పరిశీలిద్దాం.

కిందటి అధ్యాయంలో గమనించినట్లు **'జోసెఫ్ కిర్లియన్'** కనిపెట్టిన కొత్తరకం ఫోటోగ్రఫీతో మనిషి స్థూలశరీరం లోపలవుండే ఇంకొక చైతన్యవంతమైన ఒకానొక 'తేజస్సు' వంటి రెండవ శరీరాన్ని ఫోటోగ్రాఫ్ చేయడంలో అపూర్వమైన విజయాన్ని సాధించారు సోవియట్ శాస్త్రజ్ఞులు. ఈ లోపలవుడే రెండవశరీరాన్ని ఆధ్యాత్మిక పరిభాషలో 'జీవాత్మ' లేక 'సూక్ష్మశరీరం' లేక 'యోగమయ శరీరం' అంటారు. అదే మరణించిన

వ్యక్తికి స్థూలశరీరం తగలబడిపోయిన తర్వాత లోపల 'ప్రేతము' లేక 'ప్రేతాత్మ' (Ghost) సూక్ష్మశరీరానికి (Subtle body) **'యాతనామయ శరీరం'** లేక **'యోగమయ శరీరం'** లేక 'భూతాత్మ' అని పేరు.

'కిర్లియన్ ఫోటోగ్రఫీ' పరిశోధకులు అన్వేషించిన ప్రశ్నలలో మొదటిది **ఈ సూక్ష్మశరీరం దేనితో** తయారవుతుంది ? ఆ పదార్థం యొక్క స్వభావం ఎటువంటిది? ఈ సూక్ష్మ శరీరంమీద విద్యుత్తు (Electricity)కు కాని, అయస్కాంత తరంగాలకిగాని దీనిపై ఏమైనా ప్రభావం వుంటుందా ? దీనిని **స్థూలశరీరంనుంచి వేరుచేసి** — విడిగా చూపవచ్చా ? అన్న సమస్యలు పరిశోధించబడ్డాయి.

ఇందులో మొదటిది చాలా విచిత్రమైన పరిశోధన — మనిషి బ్రతికుండగానే అతని శరీరంలోంచి ఈ అంతరాత్మను లేక సూక్ష్మ శరీరాన్ని బైటకి పంపించవచ్చా ? అన్న ప్రశ్నపై పరిశోధన! 'డోబ్రోవిచ్' అనే రష్యన్ సైంటిస్టు అనేకవిధాల పరిశోధించాడు. ఈయన కనిపెట్టిన విచిత్రమైన విషయాలను తన పరిశోధనా గ్రంథమైన **''నీ శరీరంలోంచి బయటికి వెళ్ళిపోదలచావా?''**★(Do you want to get away from yourself) అనే గ్రంథంలో చూడవచ్చు. ఈయన పరిశోధనలు సరిగ్గా పావు శతాబ్దంక్రితం ఒక ఇంగ్లీషు పరిశోధకుడూ, దివ్యశక్తులు కలిగిన 'మీడియం' (Medium) ఐన, గెరాల్డైమ్ కమ్మిన్స్ (Garaldime Cummins) మాటలతో సరిగ్గా సరిపోతున్నాయి. 'జ్ఞానము' అనే ఆయన పుస్తకంలో ఇలా వ్రాస్తున్నాడు. ''జీవితమంతా చేసిన పరిశోధనలో ఒక్క విషయం ధృవపడింది. అదేమిటంటే ప్రతివ్యక్తికీ, కనిపించే స్థూలశరీరం కాకుండా లోపల ఇంకో **'రెండవ శరీరం'** ఉంటుందని''.

ఈ రెండవ శరీరం ప్రాచీన దేశాలలోని యోగవిద్యలోనూ, దివ్యజ్ఞానంలో చెప్పే రహస్యమైన ఉపదేశాల్లో ఒక ముఖ్యమైన అంశం.

ఇది ఒక అయస్కాంత శక్తి వంటి దివ్య — శక్తితో తయారైన శరీరం! ఇది స్థూలశరీరంతో కలిసే వుంటుంది. ఇతర బ్రహ్మాండంలో ఉన్న అనేక రకాలైన శక్తులూ, భౌతికంకాని 'అతి మానసికమైన ప్రసారము' దీన్ని ప్రభావం కల్గివుంటాయి. నిజం చెప్పాలంటే మనచుట్టూ ఉండే గ్రహాలూ, మనచుట్టూ ఉండే భూపరిధిలోని అయస్కాంతశక్తి, వీటితో మనం చివరికి 'విశ్వాసాలుగా' రూపొందే చైతన్యమయ పరిణామమంతా (Psychic Evolution) ఈ రెండవ శరీరంలోనే జరుగుతుంది అంటాడు !

'గెరాల్డైమ్ కమ్మిన్స్' చెప్పిన విషయాల్లోకల్లా అద్భుతమైన విశేషం ఏమంటే 'మనస్సు'(Mind) సరాసరి మన మెదడు(Brain)లోంచే పనిచేయదు. శరీరంలో ఒక వెలుగు-మేఘం వంటి సూక్ష్మశరీరం కంటికి కనబడని మనస్సునూ, కంటికి కనిపించే మెదడులోని జీవకణాలనూ, ఒక్కటిగా కలిపి పనిచేసేటట్లు చేస్తుంది ... ఈనాటి మన సైంటిస్టులు ఇప్పటికీ గ్రహించనంతటి సూక్ష్మమైన కణములు, ఈ సూక్ష్మశరీరంలోంచి కిరణాల్లా తీగల్లాగా మెదడులోకీ, శరీరంలోని కొన్ని కేంద్రాలలోకీ ప్రయాణం చేస్తాయి .... ఈ కంటికి కనిపించని సూక్ష్మశరీరమే మన మనస్సుకీ, మనలోని జీవ చైతన్యానికీ మధ్యన ఒక వంతెనగా(Link) ఉండి ఈ రెండింటినీ పదార్థమయమైన ఈ స్థూల శరీరంతో కలిపివుంచి పని చేయిస్తుంది.

ఆధ్యాత్మిక సాధకులు, మహాయోగులు మాత్రమే తమ యోగశక్తితో చూడగలిగిన ఈ **'జీవాత్మ'**ను సైన్సుకు సరిపోయేలా ఋజువు చేసే దెలా? ఈ కంటికి కనిపించని సూక్ష్మశరీరాన్ని లేక పదార్థంతో తయారుకాని (స్థూలశరీరానికి అతీతమైన) తేజోమయ శరీరాన్ని, భౌతికవాదులైన (Materialists) రష్యన్ సైంటిస్టులు కూడా ప్రత్యక్షంగా చూపించడంలో విజయం ఎలా సాధించారు? - అన్నదే ప్రపంచంలోని అనేక దేశాల సైంటిస్టులను కూడా కలవరపెడుతున్న ప్రశ్న !

## పరిశోధనా ? - పిడివాదమా ? ఏది మేలు ?

ఎందుకంటే డాక్టర్లు ముఖ్యంగా ఈ 'సూక్ష్మ శరీరం' మీద దృష్టిపెట్టుకుని వైద్యం చేయవచ్చు. శరీరం ఒక రసాయనశాల అయినట్లుగా ఈనాడు హాస్పిటల్సులో చాలామంది రోగులకు ఆపరేషన్లో కాలుగాని, చేయిగాని తీసివేస్తున్నారుగదా (Amputation) ? తీసేసింతర్వాత కూడా చాలాకాలం తనకి పూర్వం ఉన్న 'చేయి' లేక 'అవయవం' ఇంకా గాలిలో కదులుతూ వున్నట్లే, భావన కలగటం, చాలామంది రోగులకు అనుభవంలోని విషయం. డాక్టర్లు ఏం చెబుతారంటే - ఇది కేవలం మనసుయొక్క 'భ్రాంతి' అనీ అందులోనూ నాస్తికవాదులైన మనదేశపు వైజ్ఞానికులలో కొందరు తమకు తెలియని విషయాలేవీ లేవని (ఆ విషయంలో ప్రత్యేక పరిశోధనేమీ చేయకున్నా) రూఢిగా చెప్పగలరు ! అంతేగాక, నిజానికి విరుద్ధంగా అలాటివన్నీ 'మానసిక భ్రాంతి' లేక 'గ్రంధుల లోపం' అనో, సరిపుచ్చి సైన్సుయొక్క లోటును ఊహతో పూరిస్తారు ! వీళ్ళు సైంటిస్టులా? -కాదు! 'సైన్సు' పేరిటి ''మూఢ విశ్వాసాల్ని'' అమ్ముకుని బ్రతికే ''కుహనా-మేధావులు''. నిజాన్ని చూసి భయపడేవారు!!

కాని రష్యన్ సైంటిస్టులు మాత్రం అలా చేయలేదు. వీరు తమ సొంత అభిప్రాయాలను ఒక ప్రక్కన ఉంచి, తమ విశ్వాసాలతో సంబంధం లేకుండా ఈ పరిశోధనలను కేవలం నిజాన్ని తెలుసుకొనే దృష్టితోనే చేశారు. ఈ పరిశోధనల ఫలితంగానే - 'స్థూలశరీరంతో సంబంధంలేని (స్థూల శరీరంనుంచి విడిగా) సూక్ష్మశరీరం(Plasma body) ఒకటి వున్నట్లుగా స్పష్టంగా ఋజువైంది.

## కుశ్శంకలూ - పరిశోధనలూ :-

చాలామంది కిర్లియన్ ఫోటోగ్రఫీ గురించి ఒక సందేహాన్ని లేవదీశారు.

''కిర్లియన్'' ఫోటోలో మనిషి శరీరం చుట్టూ కనిపించే 'తేజస్సు' ఆధ్యాత్మిక తేజస్సేమీ కాదనీ, అది 'సూక్ష్మశరీరం' గాని 'అంతరాత్మ' గాని కాదనీ, అది కేవలం ప్రతి వస్తువుచుట్టు ఉండే అయస్కాంత కిరణాల (electro Magnetic Radiation) వంటి శక్తి తరంగాలే కాని మరేమీ కాదంటారు, ఋజువేదీ చూపకుండానే. దీనికి వీళ్ళుచెప్పే వస్తువుల వంటివి ఫోటోతీసినా వాటిచుట్టు ఇలాంటి తేజస్సులా కనిపించే ఆవరణం ఉంటుందనీ, నిర్జీవమైన వస్తువులకికూడా ఈ తేజస్సు ఉంటుంది కాబట్టి ఈ తేజస్సుకు 'అంతరాత్మ' లేక 'జీవాత్మ' అని పేరు పెట్టడానికి వీల్లేదని వీరి వాదం !

అంతేకాదు అసలీ తేజస్సును విడిగా పదార్థమయ శరీరంనుంచి వేరుచేసిగాని, లేక పదార్థమయ శరీరం ఆధారం లేకుండా ఈ సూక్ష్మ శరీరాన్ని చూపించడం సాధ్యంకాదనీ ఈ భౌతిక వాదులైన నాస్తికుల మూఢనమ్మకం కానివ్వండి ఈ వాదాన్నికూడా పరిశోధించడంలో తప్పులేదు గదా !

## 'యదార్థం' - ఓ 'పదార్థమా ?'

రష్యన్ సైంటిస్టుల పరిశోధనలు కేవలం వాదంమీద ఆధారపడినవికావు. ఇది యదార్థమైన సైన్సు పరిశోధనలో ప్రత్యక్ష ప్రమాణంగా ఋజువులతోసహా పరిశీలించబడినాయి. ఎందుకంటే సత్యాన్వేషణలో సైన్సులోకూడా తర్కంమీద ఆధారపడిన వాదంకంటే ప్రత్యక్షమైన రీసెర్చిలో కనబడే సాక్ష్యాలకే విలువ. ఎక్కువ తర్కం సైంటిస్టుయొక్క విశ్వాసాన్ని బలపరచవచ్చు. కానీ పరిశోధనాఫలితం అనతి సిద్ధాంతాన్ని బలపరుస్తుంది. రష్యన్ సైంటిస్టుల విషయంలో కూడా సరిగ్గా ఇదే జరిగింది.

## జంతువుల చుట్టూ తేజస్సు:-

రష్యాలో 1906లో జంతువులలో కనిపించే వెలుతుర్ని (మిణుగురు

పురుగుల కాంతివంటిది) గురించి కొన్ని పరిశోధనలు చేయబడినాయి. ఇందులో కిర్లియన్ ఫోటోగ్రఫి తీసే కెమేరాతో రకరకాల చెట్లను, ఆకులను; అనేక విధాలుగా ఫోటోగ్రాఫు తీయడం జరిగింది. అందులో సూక్ష్మశరీరం కేవలం తేజస్సు మాత్రమేగాని దీన్ని ఒక యదార్థంగా, పదార్థమైన వస్తువు (Matter) ఆధారంలేకుండా విడిగా చూపడం సాధ్యం అవుతుందా? అని కూడా ప్రశ్నవేయడం జరిగింది. దానికి సమాధానంగా యువకుడైన ఒక సోవియట్ సైంటిస్టు ''కజక్స్థాన్''లోని ప్రభుత్వ యూనివర్సిటీలో పనిచేస్తున్న ఆ సైంటిస్టు ఇచ్చిన సమాధానం - 'ఇదిగో ఇవి చూడండి' అంటూ, ఈ ప్రశ్నకు సమాధానంగా, తన సూట్‌కేసులోంచి కొన్ని ఫోటోగ్రాఫుల కట్టల్ని బయటకుతీశాడు. అందులోంచి ఒక ఫోటో తీసిచూపెట్టాడు. అది ఒక ఆకు ఫోటోగ్రాఫు - 'కిర్లియన్ ఫోటోగ్రాఫు' తీసిన ఫోటోలాగే అన్ని వైపులా నిప్పురవ్వలవంటి కాంతి మెరపులతో తళతళలాడే స్పష్టమైన 'తేజస్సు' ఆకు అంచులచుట్టు కనిపిస్తూనే వున్నది. ఇందులో ఒక ఆకును 'కిర్లియన్' ఫోటోగ్రాఫు తీసారని గుర్తించగలిగారు. ప్రశ్న వేసిన వారు, అతను అలాంటిదే మరో ఫోటోగ్రాఫు తీసి చూపెట్టాడు. దాని మధ్యలో ఒక సరాసరి గీతవంటిది ఏర్పడివుంది. దానికి అటూ ఇటూ ఆకు ఆకారం కాంతివంతంగా మెరుస్తూ, అందులో ఆకులోని ఈనెలు, పోగమంచులాగా ఆకుయొక్క నేత (Texture) కనపడుతోంది.

ఆ రష్యన్ సైంటిస్టు అన్నాడు - ''ఇది ఇందాకటి ఆకుయొక్క ఫోటోనే ! కాని మొదటి ఫోటోగ్రఫి తీశాక ఆకు సగభాగం కత్తిరించం. అయినా కాని కత్తిరించి తీసేసిన ఆకు భాగంకూడా పూర్తిగా కిర్లియన్ ఫోటోగ్రాఫులో కనబడుతోంది చూడండి'' !

అంటే ఏమిటంటే నిజానికి వారు చూస్తున్నది రెండవ ఫోటోగ్రాఫులోని ఆకుయొక్క ''ప్రేతాత్మ''(Ghost) లేక 'జీవాత్మ'

అన్నమాట ! ఇది సరిగ్గా పూర్తి ఆకు యొక్క 'స్థూల శరీరాన్ని' పోలివున్నది. అంటే ఈ సూక్ష్మశరీరం, స్థూలశరీరం కవలల్లాగ ఉన్నాయన్నమాట. 'మరి ఈ జీవాత్మ దేనితో తయారైవుంటుంది?' ఆ ఫోటోను చూస్తున్న సైంటిస్టు అడిగాడు. ఆ యువకుడైన సోవియట్ సైంటిస్టు కత్తిరించివేసిన ఆకుకి తీసిన 'కిర్లియన్ ఫోటోగ్రాఫ్'ను చూపిస్తూ, ఉత్సాహంగా సమాధానమిచ్చాడు. వారి సంభాషణ ఇలాసాగింది.

''అది ఒకరకమైన 'చైతన్యం' లేక 'శక్తి'యేగాని, పదార్థం మాత్రం కాదు. దీన్ని ఇంకా పరిశోధన చేస్తున్నాం. ఈ చైతన్యం ఎక్కడనుంచి వస్తున్నదా! అని. ఈచైతన్యశక్తి ఒక రకమైన విద్యుత్ అయస్కాంత వలయం (Electro Magnetic Field) వంటిదని చెప్పవచ్చు. కాని ఈ సూక్ష్మశరీరంలోని శక్తిమాత్రం విద్యుత్తూ (కరెంటు) కాదు అయస్కాంతమూ కాదు: లేక మనకి ఇప్పటివరకూ సైన్సుద్వారా తెలిసిన ఏ రకమైన శక్తీకాదు. దీనికి సైన్సులో ఒక క్రొత్తపేరు పెట్టాము 'ప్లాస్మా' (Plasma), భౌతికశాస్త్రం (Physics)లో పదార్థంయొక్క నాల్గవదశ ఈ మధ్యనే క్రొత్తగా అణుశాస్త్రజ్ఞులచేతకనిపెట్టబడింది అంటే పదార్థం అణువులుగా, పరమాణువులగా, ఎలక్ట్రానులుగానే కాకుండా 'ప్లాస్మా' రూపంలోకూడా (అణువులక్రింద కాకండా) ఉంటుందని కనుకొక్కన్నారు.

''ఆ ఆకు సగంకంటే ఎక్కువ కత్తిరిస్తే అప్పుడే విధంగా వస్తుంది.'కిర్లియన్ ఫోటోగ్రాఫు?'' 'అప్పుడా ఆకు చచ్చిపోతుంది. దానితోపాటు దాని 'తేజోమయ శరీరం' లేక 'జీవాత్మ' కూడా వెళ్ళిపోతుంది.

''ఒక మనిషి యొక్క వేలుగాని, కాలుగాని, చేయిగాని ఆపరేషన్ చేసి తీసివేస్తే ఆ అయవయవం తీసివేసిన తర్వాత కూడా ఆ స్థూలశరీరం లోపలవుండే సూక్ష్మశరీరంలోని కాలుగాని, చేయిగాని అలానే ఉంటుందా?

'అవును ఉంటుంది'. లాంటి అనేక చర్చలు, సమావేశాలు,

సెమినారుల ద్వారా రష్యన్ సైంటిస్టులు సూక్ష్మశరీరం మీద చేసిన పరిశోధనల సారంశంలోని ముఖ్యవిషయాలను తెలుపడం మాత్రమే ఇక్కడ సాధ్యపడుతుంది. పరిశోదన వివరాలు కావాలంటే ఈ కింద చూపిన రిసెర్చివ్యాసాలను తెప్పించి చదువుకుంటే పూర్తి వివరాలు చూడవచ్చు. ఈ అధ్యాయం ఉద్దేశ్యం చూచాయిగా అనేక రంగాల్లో రష్యన్లు కనిపెట్టిన ఆశ్చర్యకరమైన విషయాలు తెలుపడం మాత్రమే.

ఇది పరిశోధనా గ్రంధం కాదుగదా !

రష్యాలోని అంతరిక్ష పరిశోదనాకేంద్రం 'కజక్స్థాన్' (Kazakhstan)లో ఉన్నప్రభుత్వ విశ్వవిద్యాలయంలో ముఖ్యమైన జీవశాస్త్రజ్ఞులు, రసాయన శాస్త్రజ్ఞులు, ఫిజిక్సు పరిశోధకులు అంతా ఒక్కచోట కలిసి ఒక బ్రహ్మాండమైన 'ఎలక్ట్రానిక్ మైక్రోస్కోపు' చుట్టూ నిలబడివున్నారు. ఇది 'కిర్లియన్' దంపతులు కనిపెట్టిన కెమేరా నుంచి ఎంతో పరిణామం పొందిన ఆధునిక యంత్రం. ఈ చుట్టూ చేరిన సైంటిస్టులు ఆ సూక్ష్మదర్శినిలో కన్నులుపెట్టి, అందులో పెద్దదవిగా కనపడుచున్న సూక్ష్మశరీరానికి సంబంధించిన సనిమావంటి కదిలే చిత్రాల్ని చూస్తున్నారు. వీళ్ళందరి పరిశోధనలోను ముఖ్యమైన గమ్యం ఒక్కటే! స్థూల శరీరానికి జంటగావుండే ఈ సూక్ష్మశరీరం దేనితో తయారయింది? ఇది 'ప్లాస్మా' వంటి ప్రాధమిక పదార్థం. ఇంకొక సూక్ష్మశక్తితో కలిసి ఏర్పడిన పొగవంటి తేజస్సు. ఇది ఆకాశంలోని నక్షత్రాల మేఘంలాగ కనబడుతోంది. యీ సూక్ష్మశరీరం కేవలం ఎలక్ట్రానులవంటి కణాలతో లేక రేణువులతో తయారైన ఒక స్పష్టమైన శక్తిగా ఋజువవుతోంది. అంతేకాదు, ఇది నిరాధారంగా పొగమంచులా ఏర్పడ్డ శక్తికాదు. స్పష్టంగా ఆకారంతో వున్న ఒక జీవంగానూ, అన్ని పనులూ నిర్వహించగల ఒక వ్యక్తిత్వాన్ని కలిగి వున్నది.

`This energy body is not just particles. It is not a chaotic system, ***It is a whole unified orgaism in itself.*** It acts as unit'.

కనుక మన భారతదేశంలోని మిడిమిడి జ్ఞానం కల్గిన నాస్తిక వాదులు ఊహించనట్లుగా ఈ సూక్ష్మశరీరం అనేది ప్రతి నిర్జీవ శరీరం చుట్టూ వ్యాపించివుండే కరెంటు తరంగాల వంటి 'తేజస్సు' కాదు.

ఇది ఒక స్పష్టమైన జీవం కలిగిన వ్యక్తిత్వం.

ఈ విషయాన్ని స్పష్టంగా పరిశోధించిన రష్యన్ సైంటిస్టులు 1968లో వాళ్ళు సిద్ధాంతాలను ప్రచురించటం జరిగింది. వాళ్ళ 'రీసర్చ్' అంటే పరిశోధన అంతా **'జీవుల ప్లాస్మా — శరీరం'** అన్న పేరుతో ఒక గ్రంధంగా ప్రచురించబడింది. ఈ పరిశోధన వెనుక దిగ్గంతులవంటి రష్యన్ సైంటిస్టులు వి. ఇనై యుషీన్, వి. గ్రిశ్చెంకో, ఎన్. ఒరొవేవ్, ఎన్. సోయిస్కీ, ఎన్. ఫెడొరోవో, ఎఫ్. గిబాడులిన్ మొదలైన బ్రహ్మాండమైన అనుభవజ్ఞులూ, మేధావులూ ఎందరో వున్నారు.

## తేజోమయ శరీరాలు :-

వాళ్ళ పరిశోధనల సారాంశం అంతా ఒక్క ముక్కలో చెప్పవచ్చు. **అన్ని ప్రాణం కలిగిన జీవుల** — అంటే చెట్లు, జంతువులు, మనుష్యులూ —ఒక. పదార్థ శరీరం మాత్రమే కాకుండా ఒక చైతన్యంతో తయారైన ''స్పందన-శరీరాన్ని'' కూడా కలిగివున్నాయి. ఈ పదార్థ శరీరం అణువులతో పరమాణువులతో తయారైవున్నట్టే, దానికి జతగావున్న **'ప్లాస్మా-శరీరం'** ఒకానొక చైతన్య శక్తితో తయారైవుంది.

నిశితంగా ఆలోచిస్తే ఏ మేధావికైనా తడుతుంది — పై రష్యన్ సైంటిస్టుల పరిశోధన అద్భుత ఫలితాలతో కూడుకునివుందని. ఎందుకంటే 'కజక్స్తాన్' ప్రభుత్వ యూనివర్శిటీ 1968 లో ప్రచురించిన రిసెర్చి గ్రంధం

'ఆల్మా-ఆతా' (Alma-Ata)లో 'కిర్లియన్' పరిశోధనలపై ప్రముఖమైన నిర్ణయాలూ ఋజువులూ క్రోడీకరించబడి సైన్సులో వేరే ఒక క్రొత్త ప్రపంచంలోకి తీసుకువెడుతుంది మనల్ని.

## సైన్సుకందని - ఓ 'శక్తి' వల్లనే తేజస్సు! :-

ఈ పరిశోధనలోని సాంకేతికమైన 'రీసెర్చి' వివరాలతో సామాన్య వ్యక్తిని బాధపెట్టకుండా అందులోని ముఖ్యవిషయాలనే ఇక్కడ గమనిద్దాము.

1. కొన్ని జీవులు, మిణుగురు పురుగుల వంటివి నిజంగానే, శరీరాల్ని వెలిగేలా చేయగలవు! ఈ వెలిగేశక్తి 'కిర్లియన్' ఫోటోగ్రాఫులో పరిశోధించబడింది. దీనిలో ఏమి తేలిందంటే, ఈ "మెరిసే సముద్రపు చేపలు", మిణుగురు పురుగులు, రకరకాల పురుగులవంటివి, వాటి శరీరంలోంచివొచ్చే వెలుగును వాటిలోపలున్న 'సూక్ష్మశరీరం' - వల్లనే పుట్టిస్తున్నాయని ! ఈ వెలుగు, కరెంటువల్లకాని ఇతర సైన్సుకు తెలిసిన ఏ శక్తి (Energy) వల్లా, లేక రసాయనిక మార్పులవల్లా **కాదని రూఢి అయింది.**

2. ఈ సూక్ష్మశరీరానికి ఒక స్పష్టమైన (Shape) ఆకారం వుందనీ, అది ఆకాశంలో లేక రోదసిలో కొంత పరిమాణాన్ని ఆక్రమిస్తుందని (Occupies space in space) ఓ ఊహకాదు-ధ్యానంతో ఊహించుకునే హెల్యూసినేషన్ (Hellucination) కాదని తేలింది. అంటే అర్థం, అది ఒక శరీరం, దానికొక ఆకారం వున్నది. ఈ శరీరంలో (సూక్ష్మశరీరంలో) కాంతినెరసులవంటి రేణువులు నిరంతరం కదలికలో వున్నాయనీ ఈ 'కదలికలు', అణువులతో తయారైన పదార్థం లోని రసాయనిక మార్పులకు సంబంధించినవి కావనీ తేలింది. అంటే "పదార్థ-వాదం"తో అన్నీ సంజాయిషీలోకి

లాగవచ్చునన్న ''హేతువాదం'' - తప్పు !

3. ఈ సూక్ష్మశరీరం వేరు వేరు అవయావాలలో వివిధమైన అమరికలలో కనిపిస్తూ వుంటుందని అంటే స్థూలశరీరంలో ఎలాగైతే పదార్థం ఎముకలలోను, మంసంలోను, రక్తంలోను, వేరువేరు రకాలుగా జీవకణాల అమరిక (Tissue Structure) తో వుంటుందో — అలాగే సూక్ష్మశరీరంలో కూడా కాంతి రేణువుల అమరిక వివిధ శరీరభాగాల్లో వేరు వేరుగా వుంటుంది. ఇది, చాలా ముఖ్యమైన సైన్సు రహస్యం !!

4. స్థూలశరీరంలోని ఏ భాగమైనా కత్తిరించివేస్తే లేదా ఖండించివేస్తే - దానివల్ల ఆ భాగంలోని ఈ 'సూక్ష్మశరీరం' ఏవిధమైన నష్టమూ, పొందకుండా తన పూర్వపు 'ఆకారం' తోనే వుంటుందని.

5. స్థూలశరీరం చనిపోగానే అంటే ప్రాణంపోయినప్పుడు దానికాధారమైన సూక్ష్మశరీరం కూడా అదృశ్యమైపోతుందని.

6. అంటేదీని అర్థం మరణించిన జంతువులలో, చెట్లలో జీవులలో యీ సూక్ష్మశరీరం కనబడదు. ఇది జీవించిన వాటిలోనే వుంటుందని అర్థం.

చివరికి 'ఇనైయుషిన్,' 'గ్రిశ్చెంకో' కనిపెట్టిన ప్రాథమిక సూత్రం ఏమిటంటే, స్థూలశరీరం ఆకారానికీ, దాన్ని ఆధారంగా చేసుకొని వుండే యీ సూక్ష్మశరీరానికి, ఒక ప్రత్యేమైన **'కొలత'** లేక నిష్పత్తి (Ratio) కూడా వున్నదని కనుగొన్నారు. 'కజక్' యూనివర్శిటీలో కనుగొన్న ఒక పరిశోధనలో సూక్ష్మశరీరంలోని వెలిగే పదార్థం మనం **పీల్చే** గాలిలోని ప్రాణశక్తితో ఎక్కువ **ఉత్తేజమై** శక్తివంతంగా వెలగడం జరుగుతుందని! ''ప్రాణాయామం''తో 'జీవాత్మకు' చైతన్యం వస్తుంది!

## "ప్రాణాయామం"తో 'జీవాత్మ'కు చైతన్యం వస్తుంది!

ఇంకో ఆశ్చర్యం ఏమిటంటే భారతదేశంలోని యోగులు అనుభవంలో కనుగొన్నట్లుగా ప్రాణం పీల్చడంవల్ల శరీరంలోని ప్రాణశక్తి వృద్ధిఅయి శరీరం అంతటా వ్యాపించివున్న ఈ సూక్ష్మశరీరం 'బ్యాటరీ చార్జి' చేసినట్లు ఉత్తేజం కాబడి 'చార్జి' అవుతుందని కూడా తెలుసుకొన్నారు. రష్యన్ సైంటిస్టులు చెప్పేదేమిటంటే యీ సూక్ష్మశరీరం మీద జరిగిన పరిశోధనవల్ల ఒక గొప్ప వైద్యశాస్త్ర సత్యం బయటపడిందిన-అదేమిటంటే-శ్వాస ఎక్కువ పీల్చినప్పుడు యీ సూక్ష్మశరీరం ఉత్తేజమయి తదా శరీరంలోని రోగాలు తగ్గే ఫలిగం కనబడుతుందిని. అంతేకాక 'నెగిటివ్ కణాలు' కలిగవ కరెంటుశక్తితో వ్రణాలమీద స్ప్రే చేసినపుడు ఆ వ్రణం వెనుక సూక్ష్మశరీరం ఉత్తేజం కాబడి త్వరగా మానుతుందని.

## 'జీవాత్మ' - పై సూర్యాదిగ్రహాలప్రభావం సత్యమే:-

అన్నిటికన్నా ఆశ్చర్యకరమైనవి డా॥ ఖిజేవిస్కీ (Dr. Chijevsky) సూక్ష్మశరీరం మీద జరిపిన పరిశోధనా ఫలితాలవల్ల సూర్యుడిలో జరిగే మార్పుకీ మానవశరీరంలో వున్న జీవాత్మకిలే సూక్ష్మశరీరానికి ఒక విచిత్రమైన సంబంధం వున్నట్లు తేలింది. ఈయన సూర్యుడిలోని మచ్చలు ప్రతి 11½ సంవత్సరానికి ఒక్కసారి మారుతూ వుంటాయనీ, యీకాలంలో జరిగే మార్పులు మనిషి శరీరంలో సూక్ష్మశరీరం ద్వారా పనిచేస్తాయని చాలా ఆశ్చర్యం కలిగించేలా ఋజువు చేశాడు. కాలంలో జరిగే మార్పుకూ సూర్యుడి ద్వారా, గ్రహాలద్వారా సూక్ష్మశరీరంమీద పడే అయస్కాంత కిరణాలు ప్రొటాన్ రేణువల ప్రసారం, సూర్యునిలోని మచ్చలు చాలా ప్రభావాన్ని కలుగజేస్తాయని 'ఖిజేవిస్కీ' పరిశోధనలో ఋజువైంది.

కొన్ని శతాబ్దాలుగా మనదేశంలో యోగులు, టిబెట్‌లోని సాధువులు తమస్థూల శరీరం విడిచిపెట్టి బతికివుండగానే యీ సూక్ష్మశరీరంతో ప్రయాణించి పరకాయప్రవేశం చేసి ఇంకొక శరీరంలో ప్రవేశించే విద్య ప్రచారంలో వున్నది.

ఆదిశంకరాచార్యుల వంటివారు తమ యోగశక్తిచేత చనిపోయిన ఒక మహారాజు శరీరంలో ప్రవేశించి మళ్ళీ తిరిగి తన జీవాత్మను అందులోంచి ఉపసంహరించినట్లు చరిత్ర చెబుతోంది, ఈ విషయంమీద కూడా కొందరు సైంటిస్టులు పరిశోధనచేసి, విచిత్రమైన అంశాలు ప్రచురించారు. అమెరికాలోని కాలిఫోర్నియాలోని యూనివర్సిటీలో ''చార్లస్ టార్ట్'' (Charles Tart) ''హెరాల్డ్ షర్మ్'' అనే E.S.P రిసెర్చి సంస్థలో పనిచేసే పరిశోధకుడూ ఆధ్యాత్మిక వ్యక్తి అయిన రచయిత అనుభవాలు కూడా కొన్ని క్రొత్త విషయాలను బయటపెట్టాయి. అందులో ముఖ్యమైంది ఈ సూక్ష్మశరీరం కొబ్బరికాయలో కురిడీవలే మన స్థూలశరీరంలో బయటికి పంపించవచ్చు. అది మళ్ళీ మన శరీరంలో ప్రవేశపెట్టుకోవచ్చుని. రష్యా పరిశోధనలో తేలిన విషయమేమిటంటే దూరదృష్టి, దూరశ్రవణంవంటి అద్భుతశక్తులూ లేక ''ఉల్ఫ్ మెస్సింగ్'' కున్నటువంటి ఇతరుల మనస్సు చదివే అద్భుతశక్తి, వాళ్ళ స్థూలశరీరంతో జరిగే పనికాదు.

''ప్లాస్మా'' శరీరం వల్లనే యివి సాధ్య పడుతున్నాయని 'డోబ్రోవిచ్' వ్రాసిన ''నీ శరీరంనుంచి బయటికి వెళ్ళిపోదలచావా?'' (Do you want to get away From Yourself ?) అన్న పరిశోధనాగ్రంథంలో చూడవచ్చు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే - సోవియట్ సైంటిస్టులు 'సూక్ష్మశరీరం' (జీవాత్మ)పై జరిపిన ఈ పరిశోధనవల్ల మానవ చరిత్రలో ఒక నూతనశకం ప్రారంభమైంది! ఎందుకంటే యువకులైన 'కిర్లియన్' దంపతులు 'సెమియాన్ డేవిడోవిచ్ కిర్లియన్' అతని భార్య 'వాలెంటీనా'

కిర్లియన్' కలిసి, అందరికీ మనిషి అంతరాత్మను చూడ్డం-కొంచమైనా యంత్రాల సహాయంతోనైనా -సాధ్యపడేలాగ చేసారు. దీనివల్ల మానవుడి విజ్ఞానం ఎంతో మారిపోతుంది, జరిగిన దానికంటే భవిష్యత్తులో జరగబోయే పరిశోధనల అంతరార్థమే మానవ చరిత్రనంతా మార్చివేస్తుంది.

ఎందుకంటే మానవుడికి 'మనిషి' గురించి వున్న ప్రస్తుత భావమేపూర్తిగా మారిపోతోంది. అంతేగాదు ఈ మార్పు ఒక్క 'సైన్స్'నే మార్చటం కాక, దాని ఆలోచనా ప్రభావం అటు వైద్యశాస్త్రం, మనస్తత్వ శాస్త్రం, వేదాంతం, కళ — ఇలా అనేకరంగాల్లో ప్రసరించి మానవ స్వరూపాన్నే మార్చి వేస్తుంది. మనిషికి రెండు శరీరాలున్నాయని-మానవుడిలో వున్న 'దైవశక్తులు'-లేక ఆధ్యాత్మిక శక్తులనేవి ఈ 'సూక్ష్మశరీరం'తోనే ముడిపడి వున్నాయనీ నిశ్చయంగా తేలింది ! అంతేకాక, మనిషిమీద సూర్యుడూ గ్రహాలు చూపే ప్రభావం కూడా, ఈ సూక్ష్మశరీరం ద్వారానే జరుగుతోందనీ ఋజువుచేశారు రష్యన్ సైంటిస్టులు ! ఇంకా హఠ యోగంలోని షట్చక్రాలూ ఈ సూక్ష్మశరీరంలోని ప్రభావాలతో గ్రహాలలోని అయస్కాంత తరంగాలకు దగ్గరసంబంధం వుందనికూడా, స్పష్టంగా తేలింది. ఈ పరిశోధనలవల్ల.

''మేరీ క్యూరి'' ఆనాడు జడంగావున్న లోహాలలోంచి వెలిగే 'రేడియం'ను ఎలాగైతే కనిపెట్టిందో — సరిగ్గా అలాగే 'జోసెఫ్ కిర్లియన్' కూడా మనిషిలోపల వెలిగే రంగు చూపించి రంగుల తేజోమయలోకం ఒకటి వున్నదనీ దానికి ఈ సూక్ష్మశరీరం ద్వారా, ఒక వెలుగుబాటకు ద్వారం తెరిచి చూపించాడు మానవజాతి కంతటికీ !

ఇది 'కొత్తవెలుగు' — మానవజీవితానికే కారు రానున్న నూతన 'యుగానికి' — ''సత్యయుగానికి' (Age of Truth) వెలుగు-బాట కూడా!

*

9

# 'గతజన్మ'లోని 'చెడుకర్మ' చూపే ఎలక్ట్రానిక్స్ పరికరాల్ని కనిపెట్టిన జపాన్ యోగి!

# ''మోతోయామా''

అది చికాగో మహానగరంలోని **'పాల్మర్ హోటల్'** (Palmer Hotel) కాన్ఫరెన్స్ హాలు! ప్రపంచంలోని అన్నిమతాలవారూ, ఎక్కడ చూసినా క్రిక్కిరిసి తొక్కిసలాడుతున్న టిబెటన్ బౌద్ధులు, దలైలామావంటి ప్రముఖులు, విదేశాలలో **హిందూమతాన్ని** ప్రచారంచేస్తూన్న శివాయ సుబ్రహ్మణ్యస్వామి వంటివారు — జన్మతః విదేశీయులైనా గొప్ప ఆధ్యాత్మిక సాధకులూ, అలానే — కాషాయాలు, గెడ్డాలూ పెంచి పొట్టలు పెంచుకున్న యోగులరూపం ధరించిన భోగులూ; ఇలా అనేకులూ — థాయిలాండ్, బర్మా, ఇరాన్, చైనా, ఫ్రాన్స్, జర్మనీల వంటి దేశవిదేశాలనుండి విచ్చేసిన పరిశోధకులూ, ప్రచారకులూ ఒకరేమిటి?

అన్ని రకాలవారితోనూ ఆ హాలు బిలబిలలాడుతోంది. ఇది అమెరికాలో ప్రపంచ సర్వమత మహాసభ (**World Parliament of Religions**)లో పాల్గొనటానికి నేను 'చికాగో' (Chicago USA) వెళ్ళినప్పుడు (3-9-1993) జరిగిన ఒక అద్భుత విశేషం!

అలా, కాషాయాలు, తెలుపు, నలుపు, ఎఱుపు వంటి రంగురంగుల బట్టలు ధరించి, రంగురంగుల వేషధారులతో అది ఒక చిత్రమైన పూలతోటలాగా ఆ విశాలమైన కాన్ఫరెన్సుహాలంతా నిండివున్నది!

సరిగ్గా ఆ సందర్భంలో అకస్మాత్తుగా ఇద్దరు జపానీయులు నన్ను తేరి చూసి క్షణకాలం ఆశ్చర్యపడి వినయంగా నమస్కరించి తమను తాము పరిచయం చేసుకున్నారు! అందులో ఒకరు 'షింటో' మతస్థుడట! మరొకడు గొప్ప యోగశాస్త్ర పరిశోధకుడూ, కంప్యూటర్ సైంటిస్టూ ఐన డాక్టర్ హిరోషి **మోతోయామా** (Hiroshi Motoyama) వర్గానికి చెందినవారమని తమను తాము పరిచయం చేసుకున్నారు!

ఐతే - '**హిరోషి మోతోయామా**' అంటే ఎవరో తెలియనివారికి నా ఈమాటలకి అర్థం బోధపడదు!

అందుకని ఆయనగురించి ఇక్కడ మీకు కొంచెం పరిచయం చేస్తాను.

## మోతోయామా :

డా॥ **హిరోషి మోతోయామా** భారతదేశంకూడావచ్చి ఇక్కడి మన కర్మ-సిద్ధాంతాన్ని అనుభవపూర్వకంగా సాధనచేసి, దాంతో పరిశోధించి దాని అద్భుతఫలితాలను యోగంద్వారా అనుభవపూర్వకంగా ఋజువుచేసి దాదాపు 50,000 మందికిపైగా **కష్టాలు** నివారించడానికే 'కర్మసిద్ధాంతం' ఉపయోగిస్తున్న మహాయోగి!

''కర్మసిద్ధాంతం'' గురించి మన హిందువులందరికీ కూడా తెలిసిందే! కాని ఎవరికీ సరిగ్గా తెలియదు - అంటే దీని అర్థం ప్రతీవాడూ తన అసమర్థతను కప్పిపుచ్చుకోడానికో, లేక తన చేతకానితనానికి రూపుదిద్దుకున్న పరిస్థితులను తన ఓటమికి సాకుగా నెట్టడానికో, ఈ 'కర్మసిద్ధాంతా'న్ని ఉపయోగంలో పెడతాడేగాని, - అసలు నిజంగా 'కర్మ' **అంటే ఏమిటి? అదెలా ఉపయోగపడుతుంది? మనకు?** అన్నది మనవాళ్ళలో ఎవరికీ సరిగ్గా తెలియదు!

ఎందుకు? - అంటే, అసలు వీళ్ళు ''కర్మ''ను గూర్చి సైన్సులాగ అనుభవపూర్వకంగా - తెలుసుకోడానికి ప్రయత్నించరనే చెప్పవచ్చు! అసలిలాని ఎందుకు రాయవలసివచ్చిందోగనుక తెలిస్తే ఈ మాటలకు అర్థం బోధపడుతుంది.

డా॥ **మోతోయామా** ఒకగొప్ప సైన్సు పరిశోధకుడు యోగి! తూర్పుదేశాలలోని ఆయుర్వేదం, ఆక్యుపంచర్, యునానీ వంటి వైద్యవిధానాలలో దిట్ట! మనిషిలోని దివ్య శక్తులపై పరిశోధన చేసినవాడు. డా॥ 'రైన్' (Rhine) మహాశయుడి శిష్యుడు. అద్భుతమైన ఎలక్ట్రికల్ ఇంజనీరు, కంప్యూటర్ సైంటిస్టు! ఆధ్యాత్మిక ప్రబోధకుడు! వేదాంతి.

అంతేకాదు! మోతోయామా భవిష్యత్తుని స్వయంగా **చూడగలిగే** దివ్యశక్తులుకల పుణ్యపురుషుడు!

## విచిత్ర జీవితం :-

ఈయన జీవితం విచిత్రమైంది. డా॥ మోతోయామా 1925లో జపాన్‌లోని షోడషీమా (Shodoshima) అనే ద్వీపంలో జన్మించాడు -! ఇతడు ఐదేళ్ళ వయసులోనే ఆధ్యాత్మికసాధనలో ఉన్నతమైన శిక్షణ పొందాడు.

తల్లి 'శైకో యోషీమా' (Seiko Yoshima) గొప్ప భక్తురాలు! పవిత్ర

జీవనం గడిపిన ఆధ్యాత్మిక స్వభావంగల వ్యక్తి! ఆమె షింటో మతంలోని పుణ్యక్షేత్రాలన్నిటినీ పసివాడైన మోతోయామాను వెంటబెట్టుకునే దర్శించింది! జపాన్ మతగురువైన **కిన్యూ మోతోయామా** - దేశం అంతటా జపాన్‌లో ప్రసిద్ధిపొందిన దివ్యపురుషుడు! 'సద్గురువు'! ఆధ్యాత్మికశక్తితో రోగనివారణచేసి, ఇతరుల సమస్యలను తీర్చేశక్తిగల నిజమైన **'యోగశక్తి'గల పరమ గురువు'**! తీర్థయాత్రలలో కనిపించి - షింటో దేవాలయాలలోపొందిన దివ్యదృష్టితో, వారి **ఆత్మలకు** సద్గతి **కలిగించడానికి** ఒక పవిత్ర దేవాలయం **'షోడషీమా'**లో నిర్మించమనీ, ఆ గుడివల్ల అనేకులకు **ఆధ్యాత్మిక ప్రశాంతి కలుగుతుందనీ** చెప్పాడు అలా దేవుని ఆదేశం. పొందిన వ్యక్తి!

## జపాన్ తీర్థయాత్రలు :-

మాతృశ్రీ 'శైకో **యోషీమా**' తన చిన్నారికొడుకు భవిష్యత్తూ, తన భవిష్యత్తూ, గురువైన **కిన్యూ - మోతోయామా**, దైవాదేశంగా ఇచ్చిన దైవకార్యంతో — ఎన్నో ముడిపడి వున్నాయని గ్రహించి - వెంటనే ఆమె తానుచేస్తున్న తీర్థయాత్రలలో — తాను ప్రజలకు బాధలనుంచి శాంతికలగాలని భగవంతునికి ప్రార్థనచేస్తూ జపాన్‌లోని దేవాలయాలెన్నో దర్శించింది!

## 'దైవ-కృప'కై తల్లితో తపస్సు :-

ఆమె అంతటితో ఊరుకోలేదు! పసివాడైన **'మోతోయామా'**కు అప్పటికప్పుడే ఆధ్యాత్మిక సాధన ఎలాచేయాలో కూడా నియమబద్ధమైన శిక్షణనిచ్చింది! మోతోయామా అప్పటికింకా చిన్నవాడైనప్పటికీ తన శరీరాన్ని కఠోర నియమాలతో పరిశుద్ధంచేస్తూ ఎంతో తీవ్రంగా సాధన చేసేవాడు.

మంచు కరిగి పైనుంచిపడే జలపాతాల్లో తెల్లవారుఝామునే లేచి

గంటలకొలదీ నిలబడి నిశ్చలమైన దీక్షతో 'జపాన్-మంత్రాలు' జపించేవాడు. అలాగే ఆహార నియమంచేసి, కూర్చుని కొన్ని రోజులు దేవాలయాల్లో ధ్యానం చెయ్యసాగాడు.

మనస్సు నిర్మలంగా వుండే పసివయస్సు అవడంవలనో, పూర్వజన్మ పుణ్యంవల్లనో, పసివాడైన 'మోతొయామా' భగవంతునియందు మనస్సుపెట్టి కోరికలమీద మనస్సు పరిగెత్తకుండా దేవుని దయకోసం సంకల్పించి ధ్యానించేవాడు. అలా ధ్యానం చెయ్యడంవల్ల త్వరలో ఆయనలో అనేక 'దివ్య-శక్తులు' మేల్కొన్నాయి.

## దైవానుగ్రహం - దివ్యదృష్టి ! :-

'మోతోయామా'కు దివ్యదృష్టినిచ్చే 'జ్ఞాననేత్రం' - దానంతట అదే తెరుచుకుంది!!! శరీరంలోని యోగ-చక్రాలూ, నాడులూ జాగృతమై మేల్కొని లైట్లు వెలిగినట్లు ప్రకాశించసాగాయి!

దాంతో మనుష్యుల భవిష్యత్తు తెలిపే దర్శనాలు, ఎన్నో దివ్యానుభూతులు దివ్యమైన స్వప్నాలూ, మోతొయామాకు కలుగసాగినాయి! పందొమ్మిదేళ్ళైనా నిండని మోతోయామాకు అతి త్వరగా స్థిరమైన ఆధ్యాత్మిక అనుభవాలు అద్భుతంగా కలగసాగినాయి.

అప్పటికే 85 ఏళ్ళు వయస్సునిండిన తన గురువు 'కిన్యూ - మోతోయామా' మరణించడంతో 1974లో ఆలయానికి ముఖ్యపూజారిగా నియమించబడ్డాడు.

అప్పటినుండీ తల్లితోకలిసి మోతోయామా ఇప్పటికీ, అ దేవాలయంలోనే స్థిరపడి నిశ్చల నిష్ఠతో తీవ్రసాధన చేయసాగాడు.

## నూతన "ఆధ్యాత్మిక సైన్సు" :-

అలాగని ఆయన చదువునూ అలక్ష్యంచెయ్యలేదు. ఒకవైపు చురుకైన విద్యార్థిగా తన క్లాసు(Class)లో మొదటివాడుగా ప్యాసవుతూ తన

విద్యాభివృద్ధిని వృద్ధి చేసుకుంటూనే, - అటు తన దివ్యజ్ఞానాన్ని కూడా వెనకబడకుండా చూసుకుంటూ యోగాన్ని-జ్ఞానాన్ని అపారంగా పెంచాడు!

ఫలితంగా 1962లో ఆయన ఫిలాసఫీలో Ph.D. డిగ్రీని పొందాడు! అంతేకాదు, మానసిక శాస్త్రంలో (Psychology) కూడా ఉన్నతమైన డిగ్రీని పొందాడు. అంతేకాదు కంప్యూటర్‌సైన్సులో దిట్ట! బ్రతుకుతెరువు కోసం -కాదు!

ఆధ్యాత్మిక విషయాల్లో ఈనాటి సైన్సు ఎంతో వెనుకబడ్డ మాధ్యంతో సైన్సు ముసుగుతగిలించుకున్న ''మూఢవిశ్వాసాల'' (Medial superstitions) తో కూడుకొనివున్నదని గ్రహించి మనలాగా పిరికివాడులా అధైర్యపడకుండా - ఇప్పటి సైన్సుతో ఆధ్యాత్మికజ్ఞానాన్ని జోడించి మోతోయామా ఒక ''నూతన విజ్ఞానాన్ని'' (Wisdom Science) కనిపెట్టాడు! దాంతో 'సర్టిఫికెట్' పొంది ఊరూరా ఈనాటి సైంటిస్టుల ఉద్యోగం కోసం 'భిక్షాపాత్ర' పుచ్చుకుని తిరగకుండా - ధైర్యంతో, ఒక విశ్వవిద్యాలయ స్థాయిలో ''సైన్సు-పరిశోధనా కేంద్రం'' స్థాపించే సంకల్పం కూడా తీసుకున్నాడు. సంకల్పాలతోనే గింజుకుచావకుండా - స్థాపించేశాడు అదే జపాన్‌లో 'మోతొయామా' ఆధ్యాత్మిక ఎలక్ట్రానిక్ యూనివర్సిటీ!!

## ఆలోచనలకూ చేతలకూ 'లింకు' ''కర్మ'' :

ఆయన జీవితంలో ఇదే సమయంలో, మనుష్యుల మనస్సులలోకలిగే తలంపులకూ వారికి కలిగే కష్టసుఖాలకూ ఏదో వర్ణించరాని ఒక **'లింకు'** ఉన్నదని సైన్సుశిక్షణ పొందిన యోగిగా, శ్రీ మోతోయామాకు విశదంగా తెలిసింది!

అంతే కాదు అనేకమందికి కలిగే కష్టసుఖాలకు వారు చేసేటప్పుడు ఆలోచనలే కారణమని కూడా మోతోయామా దివ్యదృష్టికి ఎంతో

స్పష్టంగా గోచరించసాగింది. మనుష్యుల చేతలు తప్పక ఆధ్యాత్మిక ఫలితాన్నిస్తాయంటాడు మోతోయామా! మంచిపనులకు మంచి ఫలితాలూ, చెడుసంకల్పాలకు రోగాలు, కష్టాలూ, దురదృష్టము, చివరకు మరణమూ, నరకమూ కూడా ఎలా కలుగుతాయో ప్రత్యక్షానుభవంగా తెలుసుకోసాగాడు. అంతేకాదు - తన ధ్యానంలో దివ్యదృష్టితో విశ్లేషించి, భారతీయుల కర్మసిద్ధాంతం మీద మోతోయామాకు ప్రత్యక్షమైన యోగానుభవంతో లభించిన అవగాహన అనుభవపూర్వకంగా కలగసాగింది.

ఫలితంగా 1960 లో ఒక ఆధ్యాత్మిక నిస్వార్థసేవా సంస్థనూ ఒక దేవాలయాన్నీ జపాన్‌లో నిర్మాణం చేశాడు మోతోయామా! అక్కడే అనేకమంది. జీవితాలకు అర్థం తెలుసుకునే ప్రయోగశాల లేక లేబరేటరీ వంటిది ఏర్పాటుచేసి కంప్యూటర్‌వంటి పరికారాలు ఆధునిక సైన్సు విశ్లేషణం జోడించినాడు; మోతోయామా మతంలో ఎంత మూఢాచారవంతులున్నారో, సైన్సు ముసుగు ధరించిన కొందరు మూర్ఖులలోకూడా - అంతకంటే మూఢాచారులున్నారంటారు మోతోయామా!

## సైన్సు మూఢత్వం :-

కనీసం పరిశోధనైనా చెయ్యకుండా తమకు తెలియని దివ్యదృష్టికిగాని గోచరించని ఆధ్యాత్మికవిషయాలపైన - "మాకు నమ్మకంలేదని" ఏప్రయోగం చెయ్యక గుడ్డిగా సైన్సుముసుగు వేసుకుని మూఢ విశ్వాసాలను ప్రచారంచేసే మూర్ఖులున్నారంటాడు శ్రీమోతోయామా!

ఎందుకంటే ఏ సంగతైనాసరే, ప్రత్యక్షంగా పరిశోధనచేసి నిజం ఏదైనా తెలుసుకునే స్వభావం మోతోయామాది! దాని ఫలితంగా మనిషి మెదడులోని ఆలోచనలను కూడా కొలవగల విద్యుత్ అయస్కాంత (Magnetic) ప్రాణవాహక మార్పులను (Electro Physiological changes) కొలిచే

ఎలక్ట్రానిక్ పరికారాలను స్వయంగా కనిపెట్టాడు మోతోయామా! ఇలా అపూర్వమైన రీతిలో వైద్యశాస్త్రాన్ని యోగంతో కలిపి దాన్ని కంప్యూటర్ సైన్సుతో మేళవించిన అద్భుతమేధావి మోతోయామా!!!

## ''యోగచక్రాలు'' - చూపే కంప్యూటర్లు :-

మనిషి శరీరంలో సైన్సుకు కనపడని యోగచక్రాలను ప్రత్యక్షంగా T.V. తెరమీద చూసినట్లు కంప్యూటర్ తెరమీద చూపించే 'డిస్ప్లే' (Display) విధానాన్ని కనుగొన్నాడు.

ఫలితంగా ఏమనిషికైనా శారీరక, మానసిక పరీక్షలుచేసి, ఆ ఎలక్ట్రానిక్ పరికరాల సాయంతో, శరీరంలో ఏ యోగచక్రం ఎంతవరకూ అభివృద్ధి చెందిందో, శరీరంలో ఏభాగం లోపభూయిష్టంగా వుందో, ఎక్కడ రోగలక్షణాలు చోటుచేసుకుంటున్నాయో, అవన్నీ ప్రత్యక్షంగా చూపగల సైన్సు పరికరాలు (Scientific Instruments) ''మోతోయామా పరిశోధనా కేంద్రం''-లో రూపుదిద్దుకున్నాయి!!!

## ''చెడు - కర్మ'' - పై పరిశోధన :-

ఇలాగ మోతోయామా అహర్నిశలూ శ్రమించి దైవానుగ్రహంగా తన తల్లిచేసిన తపస్సుకు దైవ-వరంగా పొందిన 'దివ్య-దృష్టి'తో సైన్సునూ, ఎలక్ట్రానిక్స్‌నూ మేళవించి సృష్టించిన నూతన ''భగవత్ -శాస్త్రం'' (Science of God)పై ఆయన దాదాపు అరవైకి (60) పైగా ప్రపంచ సైంటిస్టులు సైతం దిగ్భ్రాంతి పొందే అద్భుత సైన్సుపరిశోధనా-వ్యాసాలు ప్రకటించాడు.

ఇందులో చాలామటుకు - మనిషికి కలిగే 'చెడుకర్మ', అనే 'దుష్ట-స్పందన' మనిషి చేతలవల్ల, తప్పుడు ఆలోచనలవల్ల శరీరంలో ఎలాటి మార్పులు కలిగిస్తుందో దానివల్ల అతని జీవితం పెడదారి పట్టి,

కష్టాలకూ, దురదృష్టానికీ కూడా ఎలా దారితీస్తుందో, స్పష్టంగా కనుగొన్నాడు మోతోయామా!

దాదాపు యాభైవేల మంది రోగాలు, సమస్యలు కలవారెందరో తమ కష్టాల నివారణను పొందగలిగారు. అవి ఎలాంటివో మచ్చుకు ఒకటి, రెండు అనుభవాలు చూస్తేచాలు - చిత్రంగావుంటాయి!!!

## ఒక యదార్థ-కేసు :-

ఒకనాడు 'కామకూరా' అనే ప్రదేశంనుంచి ఒక తల్లీకొడుకూ మోతోయామావద్దకు వైద్య 'పరీక్షలకై' (Diagnosis) వచ్చారు!

ఆ పిల్లవానికి అర్థంలేని భయాలతో స్కూలులో మనస్సు పరిపరివిధాల కంగారుకు లోనై, అతనికి సమస్యలనూ, బాధల్నీ సృష్టించడంతో, ఆ తల్లికి కారణం అర్థంకాక డాక్టర్ల మందులవల్ల అతనికి **ఎట్టి ఉపయోగమూ లేకపోగా సమస్య మరింత జటిలం అయిన** కారణంగా, ఆ పిల్లవాడిని వెంటబెట్టుకుని మోతోయామా వద్దకు వచ్చిందాతని తల్లి!!

అప్పుడు మోతోయామా ధ్యాన సమాధిలోకి వెళ్ళి, పిల్లవాడి పుట్టుకకు 'కారణం' చూపే ''కారణాత్మ''ను దర్శించి, అతని సూక్ష్మశరీరంలోని చక్రాలనూ నిశితంగా పరిశీలించాడు. దాంతో ఒక టివిలోని చిత్రంలాగా **పిల్లవాడి 'గతజన్మ'లోని కర్మ అంతా** ఇలా కనిపించింది.

## గత జన్మలో సైనికుడు :-

క్రితం జన్మలో ఆ పిల్లవాడు స్కాట్లాండ్‌లో జన్మించాడు. అక్కడ అతడు పెరిగి పెద్దవాడై సైన్యంలో చేరి ఒకగొప్ప సైనికుడిగాకూడ పైకివచ్చాడు! ఫలితంగా అతడు తన ఇరవయ్యో ఏట **ప్రపంచ యుద్ధంలో**

(World war) సైన్యంలో ట్రైనింగ్ ''పటాలం''(Battalion)తో సహా యుద్ధానికి పంపబడ్డాడు!

ఆ యుద్ధంలో జపాన్‌లో శత్రువులకు ఖైదిగా చిక్కి బందీగా దొరికిపోయాడు! అతడిని జపాన్ సైనికులు తుపాకీని అతని కంఠం మీదకు నేరుగా గురిపెట్టి పేల్చివేశారు. దాంతో అతడు ఆ బుల్లెట్ కుడిపైపునుంచి ఎడమవైపుకు దూసుకుపోయి వెంటనే బాధతో మరణించాడు.

## జపాన్‌తో - 'కర్మలింకు' :-

అలా జపాన్‌లో వ్యధతో ''కక్ష''తో తన్నుకుంటూ జపాన్‌పై పగ ద్వేషంతోనే మరణించటంతో, ఆ దేశంతో అతడికి, గట్టి కర్మ-సంబంధం (Karmic Link) కలిగినందువల్ల అక్కడే తిరిగి జన్మించాడు!

ఇది అతడి, గత-''కర్మ''చరిత్ర! గత జన్మలో అతడి కంఠంపై బుల్లెట్ దూసుకుపోయిన చోటనే ఎఱ్ఱని పుట్టుమచ్చతో తిరిగి మళ్లీ జపాన్‌లో పుట్టాడు.

ఐస్‌క్రీం వంటి చల్లని వస్తువులేవన్నా తింటే కంఠం చిల్లుపడ్డట్టు నెప్పిపెట్టి బాధపడేవాడు!

దీనికి 'మెడిసిన్'లో కారణం తెలియక (లేక), అతనికి డాక్టర్లు చేసిన అల్లోపతి-వైద్యాలన్నీ నిష్ఫలమయ్యాయి - రోగం ఏమీ చచ్చేలా లేదుకనుక డాక్టర్లూ వదిలేశారు ఆ కేసుని!

## గతజన్మ చరిత్ర :-

ఇలా మోతోయామా పూర్వజన్మలో స్కాట్లాండ్‌లో అతను పుట్టిన ఊరి పేరు, ఆ ప్రదేశాన్ని కళ్ళకు కట్టినట్లు వర్ణించి చెప్పగా ఆ పిల్లవాడు ఆశ్చర్యపడి, తనకు తరచూ సరిగ్గా, అవే కలలు వస్తుంటాయనీ,

అందులోతాను ఎక్కడో దూరంగా స్కాట్లాండ్‌లాంటి దేశంలో జన్మించినట్టూ, తానెవరో ఒక జపానీయుడు కానివాడినైనట్టూ, 'విదేశీయుడి'నైనట్టూ అనిపించేదని తరుచు తనను ఎవరో సైనికులు తరుచు పట్టుకొని కాల్చి చంపుతున్నట్టూ భయంకర పీడకలలు నిత్యం వస్తూవుంటాయని దాంతో పుండులా ఈ''మచ్చ''లో నెప్పికలిగేదనీ చెప్పి, ఆ పుట్టుమచ్చ వున్న స్థలాన్నికూడా మోతోయామాకు స్వయంగా చూపించి చెప్పాడు!

అతని బాధకు గల గతజన్మ కర్మకారణాన్ని తెలిపి ఊరుకోలేదు! నీ''కర్మ'' అని మోతోయామా - ఇంకా ఇలా అన్నాడు:

''**మనిషి కేవలం ఈ శరీరమే సర్వస్వమూ అనుకోరాదు! మనిషికి చొక్కావంటిదే ఈ శరీరం!**

నిజానికి అసలు 'వ్యక్తి' శరీరంలో **జీవాత్మగా వేరే** వుంటుంది! మనిషి చేసిన **ఆలోచనలూ**, పనులూ, వాటి **కర్మ ఫలితాలుగా ఈ జీవుడిలోనే** రికార్డు **చేయబడి వుంటాయి!** అందుకని నీ, ఈ శరీరం మరణించినా సరిగ్గా తిరిగి మళ్లీ అనే గుర్తులతో **మళ్ళీ ఈ జన్మలోని శరీరంకూడా ఏర్పడుతుంది**''

అంటూ పిల్లవాని గతజన్మ గురించి, తెలిపి అతని ఆలోచనలోని కంగారునూ, గజిబిజినీ చిక్కుముడిలా విడమరిచి చెప్పాడు!

అంతేకాదు అతడికి, తనలోని సూక్ష్మశరీరాన్ని - 'పావనం చేయడం' ఎలాగో కూడా నేర్పి, ఇప్పటి ఈ గతజన్మలోని చెడుకర్మ **ఏంచేస్తే ఆ 'మచ్చ' - కరిగిపోతుందో** ఆ'విధానం'కూడా చూపి, ఆ పిల్లవానికంతా వివరించాడు.

దానితోపాటు అతను చెయ్యవలసిన **'మంచికర్మ'** ఏమిటి? అతడికి మనసులో రావలసిన మార్పులూ, దీనికి చేయాల్సిన దైవప్రార్థనా వంటివి

ఇప్పటి ఈ శరీరంలో ఏ చక్రంలో ఏ విధంగా సాధనతో కలిపి ఎలా చెయ్యాలో కూడా వివరించి, వారి సమస్యలను శాశ్వతంగా నివారణ చేసాడు!

ఇప్పటికీ నిత్యం ఇలాంటి కేసులు వందలూ, వేలూ మోతోయామా వద్దకు వస్తూనేవుంటాయి! అలాంటివారి యదార్థ అనుభవాల్ని విడమరిచి విశ్లేషించి అనేక నిగూఢ-సత్యాలను కర్మ సిద్ధాంతం ద్వారా మనకి యదార్థమని వివరించి, తెలిపే అనేక ఎన్నో ఆశ్చర్యకర విషయాలను ప్రకటించాడు మోతోయామా!

అవన్నీ తెలిస్తే - మన **హిందువులు** తేలికగా మాట్లాడే మాట

"ఆ! అది నా కర్మ!"

అని గానీ

**'అది వాడి కర్మ'** — అనిగానీ అ'శ్రద్ధ'గా అనే బాధ్యతలేని **మాటల వెనుక ఎంతటి అజ్ఞానం మనలో గూడుకట్టి వున్నదో** బోధపడుతుంది!

**అనుభవంలేని మాట** — అజ్ఞానమేగా ?

ఎందుకంటే - 'కర్మసిద్ధాంతం!' ఏర్పడింది కష్టాలు నివారించడానికిగాని, **సమస్యలను** **కొ**ప్పొట్టడానికి కాదు!

దీనికి 'కర్మ'ను గురించిన సైన్సుపరిశోధన మన **హిందువులు**కూడా చేస్తే మన **హిందూమతంలో**ని లోతైన **విజ్ఞానసూత్రాలు** యింకా ఇలాటివి, ఎన్నో బయటపడవచ్చు !!!

హిందువుల్ని — "హిందూ-మతం"లోకి — **'మతం-మార్పిడి'**
**(Conver Hindus to — Hinduism)** ఎప్పుడో!!!



10

# హిందూమతంలో జననమరణాల్లో - పునర్జన్మ సిద్ధాంతం

## మన - ఐదు - శరీరాలూ ఏవిటి?

మనిషి తల్లిగర్భంనుంచి బైటపడి జన్మ నెత్తుతున్నాడు. ఇది అందరికీ కనిపించే యదార్థసత్యమే! అలా కనిపించని యదార్థం ఇంకొకటున్నదా! మనిషి పుట్టటానికి ముందే అంటే 270 రోజులకు పూర్వమే తల్లిగర్భంలో ప్రవేశిస్తున్నాడు. కాబట్టి జన్మించటం జీవితానికి మొదలు కాదు. తల్లిగర్భంలో ప్రవేశించడమే ప్రారంభము. ఎలాగైతే జన్మనెత్తడానికి పూర్వదశ పిండరూపంగా మనిషికి వున్నట్టే శరీరంలో ప్రవేశించకముందు కూడా ఈ జననానికి పూర్వదశ ఒకటున్నది తెలుస్తోంది. (Pre-natal)

అలానే మనిషి మరణించిన వెంటనే శరీరాన్ని విడిచిపెట్టి బైటికి పోతున్నాడు! అంటే మనిషి శరీరం లేకుండాకూడా బైటికివెళ్ళేక కంటికి కనిపించని, అపర-దశ ఒకటి వున్నది అన్నమాట! జీవాత్మస్థితిలో శరీరం లేకుండా గాలిలో సంచరిస్తుంది. ఈ స్థితిని గురించి సైన్సుకు ఏమీ తెలియదు. ఇప్పుడిప్పుడే మరణించిన జీవాత్మలను ఫొటోగ్రఫీతో (Kirlian Photography) తీసిన కొందరు విదేశీ సైంటిస్టుల పరిశోధనలవల్ల ఈ ఫొటోలపై శరీరంలేని జీవాత్మలు ఎలా వుంటాయో కనుగొనడానికి ప్రయత్నిస్తున్నారు.

ప్రాచీన వేదఋషులు యోగాభ్యాసంద్వారా శరీరం విడిచిపెట్టి 'పరకాయప్రవేశం' అనగా ఒక శరీరంలోంచి బయటకువచ్చి ఇంకొక శరీరంలో ప్రవేశించటం అన్న యోగప్రక్రియని సిద్ధిపొందారు. ఈ పరకాయ ప్రవేశవిద్యవల్ల సామాన్య మానవుడు నిద్రావస్థలో మరణించి, అపస్మారకస్థితి (Coma)లో తల్లిగర్భంలో ప్రవేశిస్తున్నాడు గనుక అట్టివాడు తెలుసుకోలేని పునర్జన్మ విజ్ఞానమే వేదాలూ ఉపనిషత్తులూ తెలిపే పునర్జన్మరహస్యము. అదేమిటో సంగ్రహంగా వివరిస్తాను.

మనిషి బ్రతికి వున్నప్పుడు మనకు బైటికి కనిపించే 'ఆకారం' స్థూలశరీరం అంటారు. అదేమిటో వివరంగా తెలుసుకుందాం.

## 1. స్థూల శరీరం (Material Body)

అనగా పదార్థంతో శరీరంగా తయారైన శరీరం (Material Body) అన్నమాట! అది మనం తినే అన్నంవల్ల ఏర్పడుతున్నది గనుక దీన్ని అన్నశరీరం (అన్నమయకోశం) అంటారు. మనిషి మరణించేముందు ఈఅన్నమయ శరీరాన్ని వదిలేస్తాడు. అంటే ఆఫీసునుంచి యింటికి రాగానే కోటువిప్పి మేకుకు తగిలించినట్లు జీవుడు భూలోకయాత్ర నుంచి తిరిగిరాగానే శరీరాన్ని విప్పి అక్కడే వదిలివేసి లోపలి జీవుడు

బైటికి వస్తున్నాడు. ఇలా మరణించాక బైటకువచ్చే జీవాత్మను ప్రాణమయశరీరం అంటారు. అంటే ఇది మనలోని ప్రాణశక్తితో తయారైన శరీరము.

## 2. ప్రాణమయ శరీరం:

ఈప్రాణమయ శరీరాన్ని జోసెఫ్ కిర్లియన్ (Joseph Jirlian)అనే రష్యన్ సైంటిస్టు తానుకనిపెట్టిన ప్రత్యేక కమేరాద్వారా ఫొటోతీసి (Kirlian Photography) ఈ జీవాత్మలను, వాటి చుట్టూ ప్రకాశించే ప్రాణశక్తిని వివరించాడు. ఈ ప్రాణమయ శరీరమయే మనం అనుభవించే నొప్పికి శరీరసౌష్టవానికీ కారణం అయిన జీవాత్మ. అంటే మనకు ఆకలిదప్పులూ నీరసమూ పుష్టీ ఆరోగ్యమూ అనారోగ్యమూ శారీరక సుఖదుఃఖాలు మొదలైన అనుభవాలన్నీ అనుభవంగా తెలిసేది ఈ ప్రాణమయ శరీరంవల్లనే! డాక్టర్లు ఆపరేషన్ చేసేముందు మ త్తుమందు ఇచ్చి ఈ ప్రాణమయశరీరాన్ని వేరుచేస్తారు(తెలియకుండానే) అందుకని ఈ ప్రాణమయశరీరం తెలిపే నొప్పి, బాధ లేక ఏంజరుగుతున్నదో తెలిసే స్పృహ నశించిపోతున్నాయి. అపస్మారకస్థితి కలుగుతున్నది. ఇది మనస్థూలశరీరం నశించగానే, లేక మరణించగానే బైటపడే జీవము (Ghost) లేక దెయ్యము లేక ప్రేతము. మరణించిన తరువాత రెండవదశలో మనిషి ఈ ప్రాణమయశరారాన్ని కూడా వదిలేసి తన ఆలోచనలు జ్ఞాపకాలు అనుభూతులు నెమరువేసుకునే మనోమయశరీరంతో బైటకు వస్తాడు. ఇది మన చొక్కా (Shirt)కు లోపలవున్న బనీనువలే స్థూలశరీరంలోపలవున్న ప్రాణమయశరీరంకంటే లోపల నిగూఢంగా వుంటుంది. ఉల్లిపాయలో పొరలవలే మరణం తరువాత ఈ శరీరాలొక్కొక్కటే వేరుపడతాయి. మనోమయశరీరం వదలి జీవుడు బైటకురాగానే ఇంతవరకూ తాను అనుభవించిన

జీవితంయొక్క సంఘటనలూ సుఖదుఃఖాలూ వాటికి సంబంధించిన జ్ఞాపకాలు (మనోమయమైన రికార్డు) అంతా మరచిపోతాడు.

## 3. మనోమయ శరీరం:

ఈ మనోమయశరీరం మీద జ్ఞాపకాలు, సుఖదుఃఖాలస్మృతి మనం, జీవించిన వ్యక్తులూ మిత్రులూ సంఘటనలూ తాలూకు జీవిత చరిత్ర ఒక వీడియో సినిమాలాగా తనలో రికార్డు చేయబడిన క్యాసెట్టు వంటిది యోగులు ఈ మనోమయశరీరాన్ని దివ్యదృష్టితో వీక్షించి మరణించిన జీవుడి పూర్వజన్మ చరిత్రంతా చదువగలరు. నాడీగ్రంధములోని పూర్వజన్మ చరిత్రల్లాగ! అయితే ఈ మనోమయశరీరాన్ని విడిచి బైటకు వచ్చిన జీవుడు గతాన్ని అంతా మరిచిపోతాడు. దీనినే విరజానది దాటటంతో గతం గుర్తు నశిస్తుందని హిందూమతంలో తెల్పిన సత్యం అని చెప్పవచ్చు!

ఈ మనోమయశరీరం లోపలవుండేది మన నిగూఢమైన 'జీవాత్మ' (విజ్ఞానమయశరీరం).

## 4. విజ్ఞానమయ శరీరం:

ఇది ప్రతి జన్మలోని అనుభవాలనీ సేకరించి ఆ జన్మలో మనం అనుభవించిన సుఖదుఃఖాల సంఘటనలూ వ్యక్తులూ శత్రుత్వ మిత్రత్వాదులవంటి జ్ఞాపకాలు విడిచిపెట్టి అనుభవాలసారం అయిన జీవితగుణపాఠాన్ని మాత్రం తనలో రికార్డు చేసుకుంటుంది. ఈ అనుభవం దృష్ట్యా తనుపుట్టే మరుజన్మలో ఏ రూపాన్ని పొందాలో ఈ జీవాత్మయే నిర్ధారించుకుంటాడు.

అంటే అర్ధం పైమూడు శరీరాలూ గతజన్మలో సంబంధించిన అనుభవాలకు రికార్డువంటివి. ఈ విజ్ఞానమయశరీరం మాత్రం ఆ

అనుభవాలసారాన్ని తీసుకుని తిరిగి జన్మించే మనలోని సిసలైన జీవాత్మ (Individual Soul)! ఐతే వేదాలూ ఉపనిషత్తులూ ఏమి ఉపదేశిస్తున్నాయంటే ఈ జీవాత్మకూడా అనేక జన్మల పరిణామంలో సక్రమంగా గనుక ముందుకి సాగితే అప్పుడు కోడిగ్రుడ్డు పగిలి అందులోంచి చైతన్యమయమైన కోడిపిల్లవచ్చినట్టే అజ్ఞానమనే జీవస్థితిపగిలి అందులోనుంచి దైవస్వరూపుడైన భగవదంశ(అంతర్యామి-ఈశ్వరుడు)అయిన దివ్యస్వరూపం వెలికివస్తుంది.

అప్పుడిక మరిజన్మలు ఎత్తవలసిన అవసరంలేదు. ఈ స్థితిని చేరుకొనేలోగా జీవాత్మ ఎత్తవలసిన అనేకజన్మలు, పొందవలసిన అనుభవాలు, సుఖదుఃఖాలు అన్నిటినీ అనుభవించాల్సింది ఈ విజ్ఞానమయ శరీరమే లేక జీవాత్మయే!

## జీవాత్మ అనంత యాత్ర :

ఈ జీవాత్మయే మరణించిన చాలాకాలానికి తిరిగి బైట ఆకాశంలోకి ప్రవేశిస్తుంది. ఆకాశంలోని విద్యుత్తులో లీనమై పైకి ప్రయాణించి చంద్రుడిలోనూ, సూర్యుడిలోనూ ప్రవేశించి కొంతకాలానికి తిరిగి క్రిందకు ప్రయాణం చేస్తుంది.

మళ్ళీ సూర్యునినుండి చంద్రునికీ, చంద్రుడిలోనుంచి మెరుపు (విద్యుత్తు)లోనికీ, వర్షపు బిందువులలోనికీ తరువాత ప్రాణచైతన్యంగా మొక్కలకు, వాటిని తినే పశుపక్ష్యాదులకూ, ఆ పశువుల పాలను త్రాగే మానవశరీరంలోకి ఇలా ప్రాణస్వరూపంగా ప్రవేశిస్తున్నది. ఈ 'ప్రాణకళ' ముందుగా తండ్రి శరీరంలో ఏర్పడి మూడు మాసములుండి అతని సహస్రారం నుండి ఆజ్ఞాచక్రంలోకి దిగుతున్నది. సంకల్పాలకు స్థానమైన ఆజ్ఞాచక్రంలోంచి అభిమాన స్థానమైన హృదయంలోకి ప్రవేశించి,

భార్యాభర్తల ప్రేమశక్తిద్వారా భార్య హృదయంలోకి, అక్కడ నుండి నాభివద్ద మణిపూరక చక్రంలోకి ప్రయాణించి తల్లియొక్క కుండలినీ శక్తిద్వారా గర్భంలో ఒక శరీరాన్ని నిర్మాణం చేసుకుంటున్నది.

అందుకే ఈ పునర్జన్మల చక్రానికి చంద్రుడూ, సూర్యుడూ ముఖ్యమైన కనెక్షన్ లేక లింకు (Link). ఎందుకంటే సూర్యుడికీ, చంద్రుడికీ మధ్య ఏర్పడే నక్షత్రాలూ తిధులవల్లనే మనజన్మకాలంలోని తిధులూ రాశిచక్రమూ మన జీవితంలో, రాగల ఫలితాలు సూచించే దశలూ, మన జన్మనక్షత్రం నుంచే ఏర్పడుతున్నాయి. అందుకే హిందూమతంలో మనిషి పుట్టినరోజు పండుగ ఐన నక్షత్రానికీ, మరణించిన తిథి నక్షత్రానికి సంబంధించిన సంవత్సరీక, శ్రాద్ధకర్మకు, జీవునికి సంబంధం చెప్పబడింది. ఎందుకంటే ఈ జన్మనక్షత్రం, రాశి ద్వారానే మహర్షులు ఈ జీవుని గతజన్మను, రానున్న జన్మలనూ నాడీగ్రంధాలలో ముందుగానే వ్రాసిపెట్టారు యోగదృష్టితో చూసి ! దీనివల్ల జాతకంలోని గ్రహస్థితులకూ, ఆకాశంలో అవి ఏర్పడ్డ సమయానికి జీవుడు తల్లి గర్భం నుండి జన్మించే గ్రహస్థితికీ (జాతకం) ఎందుకు అంత ప్రాముఖ్యత వున్నదో బోధపడుతుంది.

తండ్రి శరీరంలో మూడు నెలలుపోగా మిగిలిన 9 నెలలూ తల్లిశరీరంలో గడపి మొత్తం 12 రాశుల చక్రాన్ని జీవుడు ప్రయాణిస్తున్నాడు .ఇది, సంగ్రహంగా జనన-మరణచక్రం లేక పునర్జన్మ చరిత్ర సంగ్రహం. దీనిని జాగ్రత్తగా చదివి అర్థం చేసుకుంటే అనేక రహస్యాలు బోధపడతాయి.



11

# శాంతిదేవి పునర్జన్మ

ఈనాడు నాస్తికులమని, హేతువాదులమని విర్రవీగే అనేక మంది, హిందూమతంలోని అనేక ఆధ్యాత్మిక సత్యాలను మూఢ విశ్వాసాలుగా ప్రచారం చేయటము - ఆ చెత్త సాహిత్యం యీనాడు బజార్లలో ఎక్కడ పడితే అక్కడ మనకి కనిపించడం పరిపాటే. అలాంటి దేశద్రోహులకు భారతీయ సంస్కృతిని నాశనం చేయాలనే నాస్తికులకూ చెప్పుదెబ్బలాంటి సంఘటనలు చరిత్రలో కొన్ని జరిగినప్పుడు, అలాంటి వారికి కనువిప్పు కలిగించే సంఘటనలు హిందూమతంలోని ఆధ్యాత్మిక సత్యాలను ప్రత్యక్షంగా నిరూపిస్తూ మనకి తటస్థపడతాయి ! అలాంటిదే శాంతిదేవి యొక్క పునర్జన్మ గురించిన అనుభవము.

మానవుడికి అంతరాత్మ లేదని, మనిషి చనిపోయేక శరీరం తొలగి కంటికి కనిపించని ఆత్మ లేదని, దానికి జన్మ ఎక్కడిదని వాదించే మూర్ఖులకు ఇదొక చెంపపెట్టు వంటి చరిత్ర చెప్పిన సమాధానం.

'కేదార్‌నాథ్' అనే ఆయన భార్యపేరు లుడ్గి. వారిద్దరూ పెళ్ళయి 'మధుర'లో సుఖంగా సంసారయాత్ర జరుపుతున్నారు. వాళ్ళకు సంతానం కూడా కలిగింది. ఇలా ఉండగా లుడ్గి 1925 సం॥లో ఒక బిడ్డని ప్రసవించి ప్రసూతిలోనే మరణించింది. పిల్ల మాత్రం బ్రతికింది. 'కేదార్‌నాధ్' దుఃఖసముద్రంలో మునిగి సంసారభారము మోయవలసి వచ్చింది.

ఇలా ఉండగా ఢిల్లీలో 1928వ సం॥లో ఒక బిడ్డ జన్మించింది. ఆ పిల్లకు తల్లిదండ్రులు 'శాంతిదేవి' అని పేరు పెట్టారు. తల్లి తండ్రులు ఆ పిల్లను పిలిచినపుడల్లా ఆమె తన పేరు 'శాంతిదేవి' కాదనీ, తను లుడ్గీని అని చెప్పేది. మూడేళ్ళయినా నిండని ఆ పసిపిల్ల మాటలు అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఏదో చిన్నతనం అని మొదట సరిపెట్టుకున్నారు. రాను రాను ఆ బిడ్డ ధోరణి తల్లి తండ్రులకే ఆందోళన కలిగించింది.

పిల్లకు మతి చలించిందని భయపడి తల్లితండ్రులు డాక్టరుకు చూపించారు. డాక్టరు పిల్లను పరీక్షచేసి.

''నీ పేరేమిటమ్మా! పాపా'' అని అడిగారు.

'' ఇపుడు మా అమ్మనాన్న నన్ను శాంతిదేవి అని పిలుస్తారు. నా అసలు పేరు 'లుడ్గి'. నాకు పెళ్ళయింది! మా వారు కేధారనాథ్! అంది. అప్పటికే శాంతిదేవికి మూడేళ్లు.

మూడేళ్ళ పసిబిడ్డ మాటలు చూచి డాక్టరు నివ్వెర పోయాడు. పిల్లకు మతి చలించిందో, మరేదైనా గాలి సంబంధమైన రోగమోనని భయపడ్డారు. డాక్టరు మరి కొన్ని ప్రశ్నలు వేశాడు పాపని. దానికి ఆ చిన్నబిడ్డ.

''ఆ రోజుల్లో మేము 'మధుర'లో ఉండే వాళ్ళము. అపుడే నాకు 'కేదార్‌నాథ్'తో పెళ్ళయింది. నేను 1925వ సం॥లో బిడ్డను

ప్రసవిస్తూ చనిపోయాను''. అంటూ ఆరిందాలాగ అన్ని వివరాలతో సమాధానం చెప్పింది ఆ పసిపాప !

''ఓహో! అలాగా! - అంటూ డాక్టరు ఇంకా వివరంగా ప్రశ్నించాడు. శాంతిదేవి కళ్లు పెద్దవిచేసి దూరంగా గతంలోకి చూస్తూ తన గతించిన వివరాలు చెప్పసాగింది !

''అవును! అపుడు నాకు కానుపు చాలా కష్టమైంది. ఆ బాధ భరించలేకపోయాను. ప్రాణం పోతే నమయనిపించింది. చివరికి అంతే జరిగింది. నేను ఆ బిడ్డను ప్రసవించి మరణించాను.''

పసిబిడ్డ మాటలు విన్న డాక్టరు పాపకు మతిభ్రమించలేదని, ఆమెనను మానసిక వైద్యులకు చూపించమని తల్లి తండ్రులకు సూచించాడు.

ఢిల్లీలో శాంతిదేవి అనే పేరుతో పుట్టిన ఈ పాపకి బాల్యం మామూలుగానే గడిచిపోయింది. మూడవయేడు రాగానే ఆ పాపకు మాటలు వచ్చీరాగానే, ఆమె ప్రవర్తనలో తేడా క్రమంగా బయటికి కనిపించసాగింది. ఆమె పసిబిడ్డలాగాకాకా, వయసు మళ్ళిన స్త్రీలాగ, సంతానవతి అయిన తల్లిలాగా, ఇల్లాలుగా ప్రవర్తించసాగింది. మొదట్లో తల్లితండ్రులు ఈ చేష్టలు చిన్నపిల్ల ఆటలుగా భావించి అంత పట్టించుకోలేదు. కాని ప్రతి నిత్యం అవే మాటలు, అదే ప్రవర్తన చూచి చివరకు శాంతిని డాక్టరు దగ్గరకు తీసికొని వెళ్ళారు. అలా తల్లి తండ్రులు శాంతికి ఏడవయేడు వచ్చే వరకు కనిపించిన వైద్యుల కళ్లో చూపించసాగారు. కాని ఏ డాక్టరు ఆమె ప్రవర్తనకు సరైన నిర్ధారణ చేయలేకపోయారు. అయితే ఆమెకు ఏ రోగం లేదని మానసికంగా మామూలు స్థితిలోనే ఉందని చెప్పారు. దాంతో వైద్యం అవసరం లేకపోయింది. తల్లి తండ్రులు చేసేది లేక ఆ ప్రయత్నాలు విరమించారు. ఇంతలో శాంతి ఎనిమిదో సం॥లో అడుగుపెట్టింది. కాని ఆమె

పరిస్థితిలో ఎటువంటి మార్పు కలుగలేదు.

ఇలా ఉండగా ఒకనాడు శాంతి మేనమామ చుట్టపు చూపుగా యింటికి వచ్చాడు. ఆయన శాంతి విచిత్ర ప్రవర్తనను గమనించాడు. ఆయన పేరు ''ప్రొఫెసర్ కిషణ్‌చంద్''. ఆయన సైన్సు దృష్ట్యా నిజాన్ని పరిశోధన చేసి, అసలు శాంతి చెప్పే మాటల వెనుక ఏదైనా అర్థం కాని నిజం ఉందేమో పరిశోధించి చూడాలని సంకల్పించాడు. మామూలుగానే శాంతిని మాట్లాడించి ఆమె చెప్పిన వివరాలన్ని వ్రాసుకున్నాడు. ఆమె చెప్పిన పేరును బట్టి ముత్రాలో నున్న కేదార్‌నాథ్‌కు స్వయంగా ఉత్తరం వ్రాశాడు. అక్కడ స్నేహితుల ద్వారా తను కూడా కొంత వాకబు చేశాడు. దీని వల్ల ఒక మహాశ్చర్యకరమైన విషయం బయట పడింది.

ముత్రాలో నిజంగానే 'కేదార్‌నాథ్' అనే పేరుగల వ్యక్తి ఉన్నాడు. ఆయనకి 'లుడ్గి' అనే పేరుగల భార్య కూడా ఉండేది ! వారికి కొంత సంతానం కూడా ఉన్నారు. కేదార్‌నాథ్ భార్య 'లుడ్గి 1925 సం॥లో పసిబిడ్డను ప్రసవిస్తూ చనిపోయింది.''

ఇది జరిగింది శాంతిదేవి పుట్టడానికి మూడు సంవత్సరాల ముందు! 'ప్రొఫెసర్ కిషణ్‌చంద్' వ్రాసిన ఉత్తరం చూచి కేదార్‌నాథ్ అదిరిపడ్డాడు. కాని ఆ సత్యాన్ని నమ్మలేకపోయాడు. బహుశా ఎవరో తన ఆస్తికోసం పన్నాగం పన్నుతున్నారని అనుమానించాడు. వెంటనే ఆయన ఢిల్లీలోని తన తమ్ముడికి ఈ విషయాలను వివరిస్తూ ఉత్తరం వ్రాశాడు. అందులో స్వయంగా తమ్ముడిని శాంతిదేవి యింటికి వెళ్ళి అసలు పరిస్థితిని కనుక్కొని పూర్తిగా వివరాలు తెలియజేయమన్నాడు. అతడు అలానే శాంతిదేవి యింటికి వెళ్ళి తలుపుకొట్టాడు.

శాంతిదేవి స్వయంగా తలుపు తీసింది. అతన్ని చూసి చటుక్కున లోపలికి వెడుతూ ''మా మరిది వచ్చాడు'' అని చెప్పింది.

'జరిగిందానికి విస్తుపోతూ బయటికి వచ్చిన శాంతిదేవి తల్లితో తన్ను తాను పరిచయం చేసుకున్నాడు, కేదార్‌నాథ్ తమ్ముడిగా! వీరిద్దరి సంభాషణవల్ల శాంతి తల్లితండ్రులకు అన్ని విషయాలు క్రమంగా అవగతం అయినాయి. మహాశ్చర్యం! మాటలు వచ్చినప్పటినుంచి యింట్లో శాంతి చెపుతున్న విషయం అక్షరాలా నిజమని తెలిసి అందులోనూ ఆ విషయం 'కేదార్‌నాథ్' తమ్ముడే స్వయంగా నిర్ధారించడంతో వారికి మరింత ఆశ్చర్యం అనిపించింది !

ఎందుకైనా మంచిదని ఒకసారి తమ యింటికి కేదార్‌నాథ్‌ను రావలసినదిగా శాంతి తల్లితండ్రులు ఆహ్వానించారు. జరిగిన విషయాలు అన్నీ కేదార్‌నాథ్ తమ్ముడివల్ల తెలుసుకొని నమ్మలేని ఆశ్చర్యంతో ముత్రానుంచి ఊడిపడ్డాడు. కేదార్‌నాథ్ తనతోకూడా పదకొండు ఏళ్ళ పిల్లవాణ్ణి వెంటబెట్టుకొని వెళ్ళాడు శాంతిదేవి యింటికి.

గడపలోనే శాంతిదేవి ఎదురెళ్ళి ఆ పిల్లవాణ్ణి ప్రేమతో ఎత్తుకోబోయింది. కాని అతడు తనకన్న పెద్దవాడు, ఎత్తుకోలేక పోయింది. అయినా అతనిపై తల్లిప్రేమను ఒలకబోసి గతంలోని అతని ముద్దుపేర్లతో అతడిని పలకరించి బుజ్జగించింది. కేదార్‌నాథ్ ఉలిక్కిపడ్డాడు ! ఆ మాటలన్నీ అచ్చం తన భార్య 'లుడ్గి' ఒకప్పుడు తన బిడ్డను లాలిస్తూ ఉపయోగించినవే! అందులో అనేక ముద్దుపేర్లు తనభార్య ఉపయోగించినవే! కేదార్‌నాథ్ ఆశ్చర్యపడ్డాడు.

శాంతిదేవి కేదార్‌నాథ్‌ను చూచి భక్తిగౌరవాలతో లేచి నిలబడింది. భర్త ఎదుట భార్యలాగ వినయంగా ప్రవర్తించడం యింకా ఆశ్చర్యం కలిగించింది. ఆమాట, ప్రవర్తన, ఆ తీరు, అతనికి తన భార్య 'లుడ్గి'ని గుర్తుకు తెచ్చింది. ఆ మర్నాడే కేదార్‌నాథ్ తన కొడుకును తీసుకొని ముత్రాకి వెళ్ళిపోయాడు.

ఇంతలో ఈ విషయం పత్రికలవారికి తెలిసింది. ప్రఖ్యాత నాయకుడైన దేశబంధుగుప్త ఆధ్వర్యంలో ఈ విషయం నిజమా? అబద్ధమా? అని పరిశోధన జరిగింది. ఈ వ్యవహారం గవర్నమెంటు ఒక పరీక్షపెట్టి నిజం తెలుసుకోవాలని నిశ్చయించుకున్నారు. శాంతిని ముత్రా తీసుకొనివెళ్ళి ఆమె ప్రవర్తనను గమనించాలని నిర్ణయించారు.

దానికి శాంతి తల్లితండ్రులు కూడా పూర్తి సహకారాన్ని అందించారు. శాంతిని వెంటబెట్టుకుని తల్లితండ్రులు వెంటరాగా - జరిగిన సాక్ష్యాలను రికార్డుచేస్తూ ప్రముఖవ్యక్తి, హోదాగల ప్లీడరు 'తారామాథుర్' 'దేశబంధు' మరి కొందరు ప్రముఖులు కలసి రైలులో ముత్రాకు ప్రయాణమయ్యారు. స్టేషన్ రాగానే శాంతిదేవి అదిగో మన ఊరు వచ్చింది అంటూ స్టేషన్‌కు వచ్చిన కేదార్‌నాథ్‌ను ఆయన తమ్ముడి (మరిది)ని గత జన్మలో తన అత్తని చాలా పరిచయం ఉన్నట్లు పలకరించింది. అందరూ చాలా ఆశ్చర్యపడ్డారు.

ఒక గుర్రపు బండిలోకి కేదార్‌నాథ్ యింటికి బయలుదేరారు. ఎవరూ దారిచూపటంకాని, సూచనలు ఇవ్వడంగాని చేయరాదని ముందే నిర్ణయించుకున్నారు. శాంతిదేవి దారిచూపించింది. ఒకటి రెండు పార్లు ఆగి కొంచెం తడబడి తిరిగి గుర్తుకు తెచ్చుకోవలసి వచ్చినా - చివరికి ఆమె సరిగ్గానే కేదార్‌నాథ్ యింటికి చేర్చింది.

''అదే మాయిల్లు, అరె! యిప్పుడు దానికి తెల్లరంగువేశారు. ఇదివరకు పసుపురంగు ఉండేది'' అంది.

కేదార్‌నాథ్ ఆ యింటిలోనుంచి భార్యపోయిన తరువాత మారిపోయాడు. పూర్వం ఆ యింటికి పచ్చరంగు వేసి ఉండేదని అతడు అంగీకరించాడు. ఆ తర్వాత కేదార్‌నాథ్ ప్రస్తుతం ఉండే యింటికి శాంతిని తీసుకొని వెళ్ళారు.

కేదార్‌నాధ్ పిల్లలందరిని శాంతి గుర్తుపట్టి పేరుపేరునా పిలిచి దగ్గరకు తీసుకొని ముద్దాడింది ! ఆశ్చర్యం! 8 ఏళ్ళు నిండని శాంతి తనకంటే పెద్దవాళ్ళయిన వారిపై మాతృప్రేమను వర్షించి, కడసారి పిల్లవాణ్ణి మాత్రం గుర్తుపట్టలేకపోయింది. దానికి కారణం ఆ బిడ్డను ప్రసవిస్తూనే 'లుడ్గి' చనిపోయింది. ఆ తరువాత శాంతిని పూర్వజన్మలో ఉండిన 'లుడ్గి' పుట్టింటికి తీసుకొని వెళ్ళారు. ఇంట్లో తల్లిని చూడగానే శాంతి బావురుమని ఏడ్చింది. తల్లి ఎంతో చిక్కిపోయిందని పరామర్శించింది. లుడ్గి తల్లికూడా శరీరరూపురేఖలు మార్పున్నా శాంతి చేష్టలు, మాటలు పూర్తిగా మరణించిన తన కుమార్తె 'లుడ్గి'గానే ఆమె కూడా గుర్తించింది. అందరూ ఇంట్లో వెనక భాగానికి నడుస్తూ ఉన్నారు. అపుడు శాంతి అకస్మాత్తుగా ''ఇక్కడ ఒక నుయ్యి ఉండాలికదా, పూడ్చేశారా?'' అంటూ అడిగింది. తల్లి ఆశ్చర్యపోయి అక్కడ ఉన్న బావిని పూడ్చేశారు అని అంగీకరించింది.

ఆ తరువాత లుడ్గి చనిపోయేముందు తన చెవిరింగులు తీసి దాచిపెట్టింది. కాని అవి ఎక్కడ పాతిపెట్టిందో ఎవరికీ చెప్పకుండానే మరణించింది. కేదార్‌నాధ్ ముందుకు వచ్చి నీ చెవిరింగులు ఎక్కడ ఉన్నాయో గుర్తున్నాయా అని అడిగాడు. శాంతి యింతకు ముందు ఉన్న యింటిలో ఒక మట్టిపిడతలో రింగులు, కొన్ని రూపాయలు పెట్టి పాతిపెట్టినట్లు చెప్పింది. వెంటనే అందరూ అక్కడికి వెళ్ళారు. ఆ చోట తవ్వి ఆ మట్టిపిడతను తీశారు. దానిలో కొన్ని రూపాయలు, చెవిరింగులు దొరికాయి. దాంతో శాంతిదేవి పూర్వజన్మ 'లుడ్గి' అని ధృవపడింది !

కాని కేదార్‌నాధ్, అతని బంధువు, పసివయస్సులో వున్న శాంతి ప్రస్తుత జన్మశరీరాన్ని చూసి సమాధానపడలేకపోయారు. ఆ పసిబిడ్డ వయసు మళ్ళిన ఈ కేదార్‌నాధ్‌కు భార్యగా ఉండటం ఎలాగ! కాని

శాంతి మాత్రం తన గతజన్మ సంబంధాలను తేలికగా తెంచుకోలేక పోయింది. తరువాత ఆమె 1957లో ఢిల్లీలోని ప్రభుత్వ కార్యాలయంలో పనిచేసింది.

రావుబహద్దూర్ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు శాంతిదేవి చరిత్రను, భారతి పత్రికలో ప్రచురించారు ! పై వివరాలు తెలియజేస్తూ జ్యోతిష శాస్త్రరీత్యా 'లుడ్గి' మరణించిననాటి గ్రహపరిస్థితులు జాతకం వేసి ఆ జాతక కుండలిని 3 ఏళ్ళు తర్వాత శాంతిగా జన్మను పొందిన 'లుడ్గి' జాతకం కొట్టవచ్చినట్లు కనిపించాయి.

శాంతిదేవి పునర్జన్మ జ్యోతిష శాస్త్రరీత్యా కూడా నిజమని ఋజువయింది ! జాతకంలో దశాశేషము, జననకాల భుక్తి, ప్రతివానికి కొంత శేషించి ఉంటుందన్నది పరాశరమహర్షి జ్యోతిష శాస్త్రంలో తెలిపిన రహస్యం ! గత జన్మలో అనుభవించిన కర్మ దశాశేషంగామిగిలి, ఈ జన్మలో ఆ కర్మానుభవాన్ని అనుభవిస్తారు. ఇది యదార్థసత్యమనీ కేవలం మూఢనమ్మకము కాదనీ శాంతిదేవి చరిత్ర ఋజువుచేసింది.

తరువాత పాండిచ్చేరి అరవిందాశ్రమంలో ప్రా॥ ఇంద్రశర్మ శాంతిదేవి అపూర్వ అనుభవాలు రికార్డు చేశారు. ఆ తర్వాత 1958 సం॥లో అమెరికన్ పత్రిక వాషింగ్‌టన్ పోస్టు, శాంతిదేవి అపూర్వ అనుభవాన్ని ప్రచురించింది.

పునర్జన్మలేదంటూ స్వర్గ, నరకాలు, లేవని, శ్రాద్ధము, తద్దినాలు, మొదలగు హిందూ కర్మకాండలు వట్టి మూఢనమ్మకాలని వాదించేవారికి శాంతిదేవి పూర్వజన్మ జ్ఞాపకాలు ఒక గొడ్డలిపెట్టు వంటివి. ఇప్పుడైనా వారి మూఢనమ్మకం నాస్తికత్వమేనని గుర్తిస్తారా!



# 12

# టిబెట్ యోగి 'లామా' పునర్జన్మ!

తుమ్మెదనాదంలా 'ఝుంమ్మ'ంటూ ప్రణవ నాదం మంద్రస్థాయిలో లేస్తూపడుతూ, శ్రుతిగా లయబద్ధంగా ప్రతిధ్వనిస్తోంది, ఆ గుహలో!

చుట్టూరా గుండ్రంగా కూర్చున్న టిబెటన్ లామాలు మరణిస్తున్న ఒక జీవికి ఆఖరిక్షణాల్లో జరిపే యోగప్రక్రియ అది! మధ్యగా అగరువత్తుల పొగ గుండ్రంగా రింగులు రింగులుగా పైకిలేస్తూ ఆ పవిత్ర వాతావరణాన్ని మరింత తన్మయత్వంలోకి తీసుకెళ్తూ స్ఫూర్తినిస్తోంది! ఆ మధ్యనే ఒక వృద్ధ టిబెటన్ లామా (అంటే బౌద్ధబిక్షువు) తల ఒక వంకగా వెనక్కివాల్చి, నిశ్శబ్దంగా లేస్తూపడుతూవున్న తన శ్వాసను తన మనస్సుతో లయంచేస్తూ చుట్టూ జపిస్తున్న లయబద్ధమైన మంత్రపురశ్చరణతో మనస్సుకలిపి గాలిలోకి తేలిపోతున్నట్టు ఒక తేలికైన అనుభూతినిపొందసాగాడు!

క్రమంగా మనస్సు తేలికవుతోంది. దానితోపాటే టెంకాయ పగలకుండానే చిప్పనుంచి విడిపోయే 'కురిడీ'వలె మరణిస్తూన్న అతడి ఆత్మ క్రమక్రమంగా శరీరంనుంచి విడుదల కాసాగింది!

అది మంచుకొండలపైన నెలకొనివున్న టిబెట్ పీఠభూమిలోని ఒకానొక యోగుల ఆశ్రమంలోని దృశ్యం! శతాబ్దాలుగా యోగప్రక్రియలలో సిద్ధహస్తులైన 'పరమ గురువులు' రూపొందించిన కార్యక్రమం ప్రకారం నిర్వహించబడుతున్నది - ఆ 'బ్రహ్మయజ్ఞం' లేక ఉత్తరకర్మ!

మరణించేవారి ఆత్మకు భయమూ దిగులూ బాధా లేకుండా అతి సహజంగా మిగులపండిన మామిడిపండులోని టెంక తేలికగా జారివచ్చినట్టు శరీరంలోంచి జీవాత్మ వెలువడే విధానం అది! అది తెలియక మరణించే వారి చుట్టూచేరి దుఃఖించేవారూ, శోకాలు పెట్టేవారూ రోగిస్థితి వైద్యానికి చేయిదాటిపోయిందని తెలిసికూడా ఆక్సిజన్ గొట్టాలు, సెలైన్ ఎక్కించే గొట్టాలు వంటివి లోనికి దూర్చితే యమబాధతో విలవిలా తన్నుకుంటూ చివరిక్షణాల్లో తాళ్ళతో బంధించబడిన పంది గీపెట్టినట్లు అయిష్టంగా హింసపడుతూ మరణించే జీవుడు మన ఈనాటి హాస్పిటల్స్ పుణ్యమా అని వైద్యుల సహకారంతో యమయాతనలనుభవిస్తూ మరణిస్తాడు. మరణించే సమయంలో పడే యమయాతనే యమలోకం దారి చూపిస్తుంది. మరణించేవారికి ప్రశాంతి అవసరం. జీవించేవారికి ఎంత అవసరమో అంతకంటే కూడా!

## 'మరణం' - అంటే, ఇదా? :-

క్రమంగా పాదాల దగ్గరనుంచీ మొదలయింది. బొటనవ్రేలుకి ప్రక్కనే ఉన్న పొడుగాటి రెండవవేలు నుంచి క్రమంగా మేజోడు (Socks) విప్పేసినట్టు - శరీరంలోంచి సూక్ష్మశరీరం (Astral Body) క్రమంగా

ఊడివచ్చి చీలమండలూ, మోకాళ్ళూ, తొడలూ, నాభివరకూ బైటికిరాగానే పొగమంచులా గాలిలో శరీరానికి పైగా రెండుఅడుగుల ఎత్తున గాలిలో తేలుతూ వున్నది 'జీవుడు'! ఒక సెకండు బొడ్డుదగ్గర పొడుగాటి టెలిఫోను తీగవంటి ఒక గొట్టము మరణిస్తున్న జీవాత్మకూ మధ్యన పడివున్న కళేబరానికీ కనెక్షన్‌గా, లేతనీలపు ఊదారంగు కాంతితో ట్యూబ్‌లైటులోని కరెంటువలే వెలుగుతూ ఆరుతూ శరీరంలోంచి విడివడుతున్న జీవుణ్ణే బైటకు లాగసాగింది! నాభిదాకా జ్ఞాపకశక్తి పనిచేస్తూవుంటుంది. అంతే! క్రమంగా శిరస్సులోంచి క్రింది భాగం వైపుకు వెచ్చగా సముద్రం ఆటుపోటు తీసినట్టు గుండె హృదయం వైపుకి ప్రవహిస్తూంటే, మిగతా శరీరం చల్లబడి మట్టిముద్దలా బరువెక్కడం, క్రమంగా నడుందగ్గర దబ్బుమని విడివడి శరీరం క్రిందపడటం జరిగింది. ఆక్షణంలోనే ఏదో గాలిపటం దారం తెగినట్లు స్పందన, గొంతులో అస్పష్టమైన గురక మగతనిద్రలో పిల్లలు చేసే మూలుగువంటి ఎలుగు (Moan) తో శరీరంనుంచి పూర్తిగా జీవుడు బైటికివచ్చేశాడు!

లోపల మరణిస్తున్న వ్యక్తికి క్రమంగా తుమ్మెద నాదం వంటి ప్రణవం దూరంగా యింకా దూరంగా అస్పష్టంగా వినిపించసాగింది. మగతనిద్రలోకి జారుకుంటున్న పసిబిడ్డను నిద్ర పుచ్చుతున్న తల్లి జోలపాటలా!

## శరీరంలోంచి - బైటికి! :-

ఎదురుగా నల్లటి చీకటి! అదికేవలం వెలుతురులేనిచోట ఏర్పడే అంధకారం వంటిది కాదు - చిక్కగా దట్టంగా కాఫీ ఫిల్టర్‌లో అడుగున దిగిన మడ్డివలే స్పర్శకి తగిలే చిక్కదనం గల చీకటి! ఇది ప్రేతలోకాల మార్గములోకి ప్రవేశిస్తున్నజాడ! సుడిగుండంలా గుండ్రంగా ఒక (Turbine Pumps) గొట్టంలో నీళ్ళు వేగంగా ప్రవహిస్తున్నట్టు లోపల

జీవుణ్ణి గిరగిరాతిప్పుతూ ముందుకు తోసుకుపోతోంది ఒక తుఫాను వంటి నిశ్శబ్దమైన వేగం! మరణించేవ్యక్తి ప్రయత్నమేమీ లేకుండానే ఏటవాలుగా కాళ్ళు ఎత్తుగా తలదిగువకు వంగి గాలిలోకి వల్లటి సొరంగంలోంచి వెళ్తున్న అనుభూతి! వందలాదిమంది పేషంట్లు గుండె ఆగి మరణించి (Clinical Death) తిరిగి బ్రతికినవారికి కలిగిన అనుభూతి! అలా కొండగుహలో సొరంగంలో ప్రయాణిస్తూన్న ఎక్స్‌ప్రెస్ ట్రైన్‌వలే కాళ్ళు ముందుకువుంచి క్రమక్రమంగా నక్షత్రంలాగా, మరుక్షణంలో గుండ్రటి సిమెంట్ పైప్‌లోని కిటికీ ద్వారం వంటి రంధ్రం ద్వారా ఏటవాలుగా ప్రయాణించి కొంతసేపటికి ఒక సన్నటి వెలుగుకిరణంలాగ, బైట విశాలప్రపంచంలోకి బైటపడ్డ అనుభూతి!

మరుక్షణమే కాళ్ళు దిగువకీ తల ఏటవాలుగా శరీరంలోంచి పైకిలేచి నిటారుగా నిలబడి చుట్టూ పరిసరాల్ని ఆశ్చర్యంగా గమనిస్తున్నాడు. ఆ మరణించే వ్యక్తి!

## 'ప్రేతాత్మ'ల - లోకంలోకి! :-

మరుక్షణమే వెనుదిరిగిచూస్తే తనది - ప్రక్కమీదవున్నది - తనరూపమే ... మరణించివచ్చిన తన శరీరమే!!! స్పష్టంగా చూశాడు! తనను తానెప్పుడూ ఇంత వివరంగా పరిశీలించుకోలేదు తాను జీవించివుండగా! చాలామందికి జీవితకాలంలోకంటే మరణం తరువాతే, ఇలా వాళ్ళనువారు స్పష్టంగా మొదటిసారిగా చూసుకోవడం ఆశ్చర్యం కలిగిస్తుంది! చాలామంది ఆ చూస్తున్నది తమ జీవాత్మనే అనికూడా గుర్తించరు!! ఎవరినో బైటవ్యక్తిని చూస్తున్నట్టుగా ఆశ్చర్యంగా చూస్తుంటారు. సముద్రం అడుగున ఈదే జలచరాలు, చేపలు కనిపించినట్లే ఆమరణించిన జీవాత్మ తేలిపోయే ప్రవాహంకూడా నీటిలో మునిగి ఈదేవారి శరీరాన్ని తేల్చివేసినట్లుగానే, పైకి ఎగదన్ని ఇలా

తేల్చివేస్తుంది!

మరుక్షణమే వెలుగు! లేతవెన్నెలలా సంధ్యవెలుగులా మెరుస్తూ వింతగా కనిపిస్తున్నది! తాను మరణించానన్నమాట!! ఇక తాను ఒంటరివాడు!!! 'ఇక్కడ తనకి 'నా' అన్నవారెవరూ వుండరు! పిలిచే దిక్కు కూడా ఉండదు! అన్న ఆలోచన మనస్సులో అన్న, దిగులు తోచి అతడు స్తంభించగానే కాంతిని మించిన వేగంతో పక్కనే ముగ్గురు ప్రత్యక్షమయ్యారు !!!

వారు మరణించేజీవులకు సహాయం చేసే 'కర్మదేవతలు'. మరణించేవారి మతవిశ్వాసాలను బట్టి కొందరికి క్రైస్తవఫాదరీలవలే కనిపిస్తే పొడుగాటి బురఖాతో నడుముకు బెల్టువంటి పటకాతో మరికొందరికి చేతిలో జపమాలను వేగంగా తిప్పుతున్న బౌద్ధ బిక్షువుల్లా కనిపించినట్లే, 'లామా' ముందర ఆజానుబాహులైన ఋషీశ్వరులవలే పొడుగాటి గడ్డాలతోనూ కనిపించారు.

ఇక్కడ చుట్టూవున్న లామాలు ఝుంమన్న ఓంకారంతో మంత్రాలు వల్లిస్తూనే ఉన్నారు; మరణిస్తున్న వ్యక్తి మనస్సుకు లింకుని పెట్టి అతనితో ఆలోచనల ద్వారానే టెలిఫోన్‌లో మాట్లాడినట్లు మాటలులేని ప్రజ్ఞద్వారా భోగట్టా రవాణా జరుగుతోంది ఆశ్చర్యంగా!

ఇవి నూటికి తొంభైమంది డాక్టర్‌టేబుల్‌పై గుండెఆగి మరణించి తిరిగి వింతగా బ్రతికిన అనేకమందికి జరిగే అనుభవాలే!

## 'పరకాయ - ప్రవేశం' :-

ఇప్పుడు మరణిస్తున్న వ్యక్తి ఒక యోగి! టిబెటన్ లామా! అతడిని ఒక అత్యవసర పనిమీద ఈ భూమ్మీంచి పంపిస్తున్నారు ఒక అసాధారణ పరిశోధనగా!

మరణించి తిరిగి జన్మించటం అంటే చాలా టైము పడుతుంది.

వెంటనే తగు తల్లితండ్రులు దొరకటం కష్టం. ఒకవేళ మంచిజన్మ లభించినా బాల్యంనుంచి పెరిగి పెద్దవాడవటంలో అతడు భూమ్మీద చేయవలసిన ప్రణాళిక వెనుకపడిపోతుంది. అందుకని శరీరంలో మరణించబోతున్న వేరేవ్యక్తి శరీరంలోకి మొదట మరణిస్తున్నయోగి అంతరాత్మను 'పరకాయ ప్రవేశ విద్య' ద్వారా పంపించి ఇలా, అతడిని ఒక బ్రిటీషువాడి శరీరంలో నివసించే టిబెటన్ లామాగా వుంచేఏర్పాట్లు చేయవలసివచ్చింది!!

.... ముసలియోగి కాళ్ళలోంచి చల్లని మంచుగడ్డవంటి స్పర్శ మెల్లమెల్లగా మోకాళ్ళవైపుకూ, తొడలపైకీ నడ్డిపూసలోంచి చల్లటి ఐస్ నీరు ప్రవహించినట్లుగా వ్యాపించడంతో, క్రమక్రమంగా చైతన్యం కోల్పోసాగింది.

క్రింది శరీరభాగంలో స్పర్శజ్ఞానం నశించగా - ఉన్నట్టుండి కాళ్ళు నీటిలో తేలుతున్నట్టుగా పైకితేలి తనశరీరంపై తానే ఒక గాజుబొమ్మలా తేలియాడటం తోచింది. ఇంతలోకే తలలోంచి ఒకవింత హోరు వినిపించసాగింది.

తుమ్మెదల నాదంలాగా సముద్రపుహోరులాగా దూరాన జన ఘోషలాగా వాటిమధ్యనుంచి సన్నని కీచురాయిలా ఒక శబ్దం వినబడటంతోటే కళ్ళునల్లగా చీకట్లుకమ్మి; శ్వాస గొంతులో గుర గుర లాడింది. ఉన్నట్టుండి ప్రాణాలు చప్పబడ్డట్టు నీరసం ముంచుకొచ్చింది. ఇంతలోకే బొడ్డు దగ్గర్నుంచి విపరీతమైన కరెంటులాంటి శక్తి సోడాగ్యాస్‌లాగా ఎగదన్నినట్లు ఛాతీమధ్యన గట్టిగా గుంజినట్టు శరీరంలోంచి అదాట్టుగా ఊడిపడ్డాడు!

## 'సూత్రాత్మ' - (తాడు) :-

కాని ఒక లేతనీలపురంగు గాజుగొట్టంవంటి ట్యూబ్‌వంటిది క్రిందనున్న శరీరంలో బొడ్డువద్దనుంచి అంటిపెట్టుకొనివున్నది. అది లేతనీలంరంగూ ఊదారంగు, గులాబీరంగు కలిసిన తేజస్సుతో వెలుగుతూ, ఆరుతూ వుండటం గమనించాడు! నిజానికి అదే క్రిందనున్న తనశరీరాన్ని బ్రతికి వుండేలాగా చేసే తన సూక్ష్మశరీరంతో వున్న ఏకైక లింకు(link)! ఇదే యముడు విసిరే త్రాడు! చూస్తుండగానే పొడుగ్గా సాగి - శరీరంలోంచి బయటపడ్డ 'తాను' గుహపైన తేలియాడడం స్పష్టంగా గోచరించింది! క్రమక్రమంగా క్రిందనుంచి ఝూంమనే ప్రణవం యోగుల జపంలోంచి దూరమైపోతూ, అస్పష్టంగా వినిపించసాగింది. మరుక్షణంలో కాంతికన్నా ఎన్నోరెట్లు వేగంతో పైకి దూసుకుపోవటం కనిపించింది.

## పై - లోకాలలోకి :-

రాత్రి స్పీడుగా పరిగెత్తే రైలింజన్‌లోని నిప్పురవ్వలవలే 'తనకు' ఇటూ అటూ నక్షత్రాలు, ఆకాశంలోకి గ్రహమండలాలూ దూసుకుపోతున్నాయి! దూరాన నక్షత్రంలా మిణుకుమని క్షణంలో అది గుమ్మడి కాయలంత సైజులో దగ్గరకావడం తనకి తగులుతుందేమోనన్న జంకు తెలియగానే అది తన పక్కనుంచే దూసుకుపోయి దూరంగా నక్షత్రాలలాగా పరుగిడిపోవటం కనిపించింది.

మరుక్షణంలో అంతా మటుమాయం! తానెక్కడున్నాడో తెలియదు! అంతా ఏమీతెలీని ఒక ప్రశాంతత!

ఒక పచ్చని నీరెండలాగ బంగారువన్నె కాంతి అంతటా వెలుగుతున్నది. ఆ కాంతి ఎక్కడనుంచి వస్తున్నదో దాని కేంద్రంవంటిదేమీ కనిపించలేదు. చెరువులాగా ఆ కాంతి సర్వత్రా నిండి వున్నది. ఆకాశంలో అంతాఅయి, ఒకే సూర్యబింబంలా గుండ్రంగా అన్ని

దిక్కులా అంటేలాగ వ్యాపించేంత దగ్గరగా (close up) కనిపిస్తే వున్నట్లుగా సూర్యబింబంవంటి ఆకాశం!

''ఇదే తపోలోకం! శాశ్వతమైన కాంతిలోకం! ఇక్కడికి బహుకొద్దిమందిమాత్రమే చేరుకోగలరు. అనేక జన్మలుగా గురువువద్ద యోగసాధనలు చేసి, తమ కర్మబంధాలన్నింటినీ భస్మంచేసుకుని పవిత్రంగా జీవించినవారే ఈ లోకానికి చేరుకోగలరు!''

ఆశ్చర్యం!!! తన గురుదేవుని కంఠస్వరం!!!

ఏనాడో తనకి మంచుకొండలమీద గుహలో యోగరహస్యాలు తనకి ఉపదేశించిన తండ్రివంటి పెద్దదిక్కు గురుదేవులు! ఆహా! పైలోకాల్లో కూడా తనకి వెలుగిచ్చే ఆయన కంఠమే ఇక్కడా తనకు మార్గదర్శకం!

పైనుంచి చూస్తే ఒక న్యూయార్క్ నగరంలోని వేలాది లైట్లు విమానంలోంచి చూస్తే క్రిందికి దిగుతూండగా కనిపించినట్లుగా!!! అంతలోనే అందమైన కాంతి మతాబాలవ్వలవలే, కాకరపువ్వొత్తులవంటి నెరసులతో వెలుగులుగా చీకటి మధ్యగా దగ్గరవుతోంది. అది ఈ భూలోకమేనని - పైనున్న కాంతిలోకంలోనుంచి దిగివచ్చేదాకా తనకి తెలియదు! అందులో నిప్పు రవ్వల్లా మెరిసే కాంతి నెరసులు ... అది భూలోకంలోవున్న వేలాదిమంది ఆర్తితో చేసే ప్రార్థనలా!

అందులోనూ ఎక్కువ వెలుతురుగా కనిపించే కిరణాలు - తనకోసం కాకుండా స్వార్థంలేని ఆర్తితోకూడిన ప్రార్థనల కిరణాలే! ఆహా అవే ఇంత పైకి చేరతాయి! దాంతో క్రమంగా భూమికి ముసలియోగి ఆత్మ దగ్గరవుతున్నట్లుగా దానివల్ల తెలుస్తోంది!

## ఇంకొకడి 'శరీరంలోకి'! :-

పెద్దపెద్ద వీధులు జనసమ్మర్దమా! - అది ఇంగ్లండు! లండన్ సమీపంలోని ఒక పల్లెవంటి కాలనీ! అక్కడ ఒక... హాస్పిటల్! టేబుల్‌మీద... ఒక వ్యక్తి శరీరం! చుట్టూచేరి డాక్టర్లు తీవ్రంగా పరిశీలిస్తున్నారు. ఒకరు గుండెపై చెవిపెట్టి వింటున్నారు. మరిద్దరు రొమ్మును నొక్కి శ్వాసపీల్చే క్రియను పునరుద్ధరించటం (Revive) కోసం తంటాలుపడుతున్నట్టు కనిపించారు.

''ఇదుగో ! నెమ్మదిగా ఊపిరిపీలుస్తున్నాడు'' అనటం కూడా వినిపించింది. మరుక్షణంలో టిబెట్ యోగి ఆత్మ వెల్లకిలా తేలిపోతున్నదల్లా నిటారుగా తిరిగి - ఒక పల్టీకొట్టి రివ్వుమని పైకీ కిందకీ గిరికీలు కొట్టసాగింది. అలా కళ్ళుతిరిగినట్లై క్షణకాలం వికారం అంతా చీకటి - చెవిలో రింగుమనే శబ్దం!

కళ్ళుతెరిచి చూస్తే తనొక యింగ్లీషువాడి శరీరంలో చేరుకున్నట్లు తెలిసింది! దానితో టిబెట్‌లోని యోగి మరణించినట్టూ, లండన్‌లోని బ్రిటీషువాడి శరీరంలో ప్రవేశించి మళ్ళీ జీవితం ప్రారంభించినట్టైంది.

ఇది కథకాదు! లోబ్‌సాంగ్ రాంపా (T.Lobsong Rampa)అన్నపేరుగల వ్యక్తి తన **పరకాయప్రవేశం** అనుభవాన్ని యధాతధంగా అనుభవించి ఒక బ్రిటీషువాడి శరీరంలో ప్రవేశించిన అనుభూతి!

అతడు తన కధను **'డాక్టర్ ఫ్రం - లాసా'** (Doctor From Lhasa)అనీ **'ది రాంపా స్టోరీ'** (The Rampa Story)అనీ రెండు గ్రంధాల్లో ప్రచురించాడు. ఇవేకాక ఇంకా పదమూడు ఉన్నత ఆధ్యాత్మిక రహస్యాలను తెలిపే పుస్తకాలను ప్రచురించాడు కూడా! ఇంకా ''రానున్న ప్రపంచయుద్ధం'', 'ప్రళయాలు', 'హిమాలయాలలో అవతరించబోయే (అప్పటికి) శంబల ప్రభువు' (Lord of Shambala)

అవతరణ గురించీ ఎన్నో వ్రాశాడు! (The Chapters of Life) ది చాప్టర్స్ ఆఫ్ లైఫ్ అన్న గ్రంథంలో! ఇతడు ప్రతీవారూ బాధలేకుండా తమ శరీరంలోంచి జీవాత్మను విడగొట్టడం, బైటికి రావడం ఎలాగో తెలిపే యోగసాధన కూడా వ్రాశాడు. దీనివల్ల ప్రతీమనిషి మరణం అంటే భయపడి చావనక్కరలేదు అది చొక్కా తొడుక్కోవడం విప్పేయడం అంత సహజం - అని అనుభవంతో నిరూపించడానికే!

కాని, ఇంగ్లండులోని ఆ డాక్టర్లు మాత్రం తమ పేషంటు గుండె ఆగిపోయి కొన్ని నిమిషాలు 'మెడికల్' గా మరణించి, తిరిగి తాము గుండెలను నొక్కి మాలీషు చేయడంవల్ల శ్వాసక్రియ అందుకొనే బ్రతికాడని తమ వైద్యరిపోర్టులో వ్రాసుకున్నారు.

దీనిలో నిజంగా బ్రతికింది హిమాలయాలలోని యోగి ఆత్మకాదు! - **మరణించిన వారికి 'పునర్జన్మ' వున్నదనే సత్యమే ఈనాడు తిరిగి జీవించింది!**



13

# టిబెట్ యోగి 'లామా' పునర్జన్మ! – II

మామూలు మనిషికైతే హాస్పిటల్‌లో తన శరీరం మరణించడం కానీ ఒక చీకటి సొరంగంలోంచి పక్షిలు కొట్టుకుంటూ తేలిపోయినట్లు అనుభూతి కలిగి- మరణించిన ప్రేతాత్మలలోకం (Meta Consciousness)లో తమ గత జన్మలు T.V.లోని దృశ్యాల్లాగా చూడగల్గుతాడు. దానివల్ల రానున్న జన్మల్లో తాను చేసిన పాపాలకు నిష్కృతి ఏర్పాటు చేసుకోగల్గుతాడు.

కాని, తన కర్మలన్నీ యోగసాధనతో భస్మంచేసుకున్న టిబెటన్ యోగికి మామూలు మనుష్యుల ఆత్మలవలే చిల్లర స్వర్గాలకో, క్రిందిబాటు నరకాలకో వెళ్ళవలసిన పనిలేదు! వారు తేజోలోకాలను చేరుకొని దానికి పైగా వుండే ఈ బ్రహ్మాండమనే చోటికే ఒక ఆత్మగా నివసిస్తూండే విశ్వాత్మతో ముఖాముఖీ అనుభూతి పొందగల్గుతారు.

దానివల్ల వారికి జీవులజననం, భూమ్మీతదకి ఎందుకు పంపబడ్డారో కారణం తెలియడమేకాక - - అసలు మనిషిని భగవంతుడు పైలోకాలలో ఏ అనుభూతి కోసం పంపిస్తాడో ప్రత్యక్షంగా చూడగలరు! నిజానికి జరిగింది కూడా అదే! ముసలి టిబెట్ యోగి బ్రిటీషువాడి శరీరంలోకి ప్రవేశించేముందు - తాను టిబెట్‌లో మరణించగానే పైపైకి చేరుకొని తేజోలోకాలలో ఇంద్రధనుస్సుల రంగులీనే పుణ్యలోకాలలో ఆనందపు వెల్లువలు ఊటలుగా పుట్టే ప్రేమమయ లోకాలకు తేలిపోయింది అతని ఆత్మ! అక్కడ ఎన్నో విషయాలు అతనికి బోధించబడ్డాయి. బైట స్వామీజీలు, బాబాలు బోధించినట్లు ఉపన్యాసంలా కాదు! విచిత్రంగా ఒక టెలిఫోన్‌లో బైటవారి కంఠం వినిపించినట్లు - ఆమాటలు తన తలకాయలోంచి వినబడసాగాయి.

తనలో చేరిన సందేహం అలోచనగా, ప్రశ్నగా తలయెత్తకముందే మరుక్షణంలోనే, దానికి సమాధానం చెరువులో నీటి ఊటలాగా తనలోంచే ఉబికి పైకి తేలేది! నిజానికి అది విశ్వాత్మ అయిన భగవానుని సంభాషణ అని అప్పుడు తెలియలేదు. తరువాత తన గురుదేవుడి విశ్లేషణవల్లగానీ, పుణ్యలోకాలలో వున్నవారి అత్మలకు భగవంతునితో ముఖాముఖీ అని తేలింది.

## విశ్వాత్మతో ముఖాముఖీ

నిజానికి పైలోకాల్లో వింతగా గడిచిపోతుంది. కొన్ని గంటలు, కొన్ని రోజులు లేక నెలలు సంభాషణగా నడిచిన 'పరిప్రశ్నా - సమాధానం 'వంటి 'ఆలోచనల రవాణా' (Transfer of Thoughts)నిజానికి బైటచూస్తే కొద్దినిమిషాలే టైము గడిచింది. అప్పుడుగాని తెలియలేదు 'కాలం' లోకాలను బట్టి మారుతుందని! సృష్టికర్తకు 'ధామం' అయిన 'సత్యలోకం'లో ఒక్క క్షణం క్రింద మనం భూలోకంలో కొన్ని జన్మలలో సంపాదించిన జ్ఞానంతో సరిరాదు! ఆస్థితిలో మరణించినవారి ఆత్మలకు

ఎంత విస్తృతమైన విశదమైన సందేహనివృత్తి కలుగుతుందంటే మన ఆలోచనల విశ్లేషణ మబ్బుతెరలు వీడినట్లు వీడిపోతాయి! మనల్లోని సూర్యుడు నిర్మలాకాశంలో ప్రకాశించినట్లు అనుమానం లేనివిధంగా జీవితలక్ష్యమేమిటో భాసిస్తుంది. భూమ్మీద యిలా ఎందుకు తట్టదా? అని ఆశ్చర్యం కూడా వేస్తుంది! ఆ స్థితిలో మరణించిన వారి ఆత్మలకు భూమ్మీద వారు చేసినచర్యలు, జీవితంలో ఆలోచించిన స్వార్థయోచనలు ఆ లోకంలో యిక వర్తించవు! ఎందుకంటే శరీరమే లేదు కదా! ఇంక ఏమి స్వార్థము! ఆహారచింత జీవనోపాధి గురించి దిగులు, తిండీ బట్టా యిల్లూ, యిటువంటివి మనకాలాన్ని తీసుకోవు. బోలెడంత జీవితం మిగిలిపోతుంది. జీవితంతో ఏం చేసుకోవాలో బోధపడదు! అంటే ఏం చేసుకోవాలో తెలియకపోవటమే - భూమ్మీద ఒక లక్ష్యం లేకుండా జీవించిన దానికి ప్రతిఫలం అని తెలుస్తుంది.

''ఒక్కొక్కటే నా మనస్సులో ఆలోచనలు రాగానే మరుక్షణమే దానివెనుక చదివేసినట్లు అనిపించేది. అంతే! మరుక్షణమే T.V.తెర మీద మెరిసినట్లు దానికి సమాధానం కూడా తోచింది. అంటూ తమ శరీరాన్ని వదలి పైలోకాలకు వెళ్ళివచ్చిన అనేకమంది అనుభవాలసారం పైమాటలలో యిమిడివుంది.

మరణించగానే ముందుకలిగే ఆశ్చర్యం యింతా అంతా కాదు! ఎందుకంటే మృత్యువు వల్ల మనకి గొప్ప 'విశ్రాంతి' గా ఏదో ఒక అనిర్వచనీయమైన శెలవు లేక పండుగ అన్నట్లు గొప్ప విరామం ఫీల్ అవుతాం. ఇది మొదటి ఆశ్చర్యం! మరణంవల్ల మన శరీరం తేలికగా దూదిపింజలా ఉలిపిరి మేఘంలా అయిపోతుంది! ఎంతహాయి!! ఒక పెద్దబరువు దించేసుకున్నట్లు తలమీంచి ఒక లగేజి (భారము) దిగిపోయినట్లు ఫీలవుతాము. మనం ఎక్కడికి పోవాలనిపిస్తే అక్కడికి మనం చేరుకునే వుంటాము. ప్రయాణం చేయటానికి నడవటంగాని కాళ్ళు

కదలించడంకాని లేక మరే యితర వాహనాలు గాని అవసరంతో నిమిత్తం లేకుండానే - ఆలోచన రాగానే ఒక జెట్ విమానంలా మన మనస్సే మన శరీరంగా అయి అక్కడికి ప్రయాణిస్తుంది.

భూమీమ్మద జీవితమంతా సినిమాలాగా కళ్ళకు కట్టినట్టు సినిమాతెరమీద లేక T.V. చిత్రంలాగా స్పష్టంగా కనిపిస్తుంది. కేవలం మన జీవితంవైపే తప్ప భూమి మీద మనకు యితరుల ఆలోచనలు వినిపించవు! కనిపించవు! మన చర్యలు యితరులను ఎలాగ ప్రతిస్పందింప చేస్తున్నాయో కూడా తెలుసుకోకుండా జీవిస్తాం. అందువల్ల బ్రతుకంతా వ్యర్థం మనం అనుకోకుండానే చేయటం జరుగుతుంది. శరీంలో బంధింపబడి వుండటం వల్ల ఆజైలు నుంచి విడుదలైనట్లు శరీరం మరణించగానే యితరుల ఆలోచనలు, వారి కష్టసుఖాలూ మనకి వినిపిస్తాయి కనిపిస్తాయి. ఏకకాలంలోనే మన మనసులోలాగే అందరి మనసుల్లో నడుస్తున్నదీ తెలిసిపోతుంది. ఇది గొప్ప ఆధ్యాత్మిక శిక్షణ! బాధలు, రోగాలు, బీదరికం, నిరుద్యోగం యివన్నీ అనుభవించిన వారికి మనస్సు తేలికై ఒక గొప్ప బరువు దించేసుకున్నట్లు అనుభూతి.

కాబట్టి మనిషి శరీరంలో వుండగా సంపాదించే జ్ఞానం వేరు, ఎంత తెలివైన వాడైనా సరే - అతని ధృక్పధం వేరు! అదే వ్యక్తి శరీరంలోంచి బైటపడగానే జరిగే మొట్టమొదటి గొప్పమార్పు ఇది అతను ఒక వ్యక్తిగా తనలోంచి ఆలోచించటం మానేసి, బైటవాడిగా గతంలోని తనవ్యక్తిత్వాన్ని కూడా చూడగల్గుతాడు ప్రత్యక్షంగా! గాలిలో ఎగిరే పక్షిలాగ! భూమిమీద గ్రామాలను మనుష్యులను చూసినట్టే!! ఆ ధృక్పధం వేరు. అందులో కనపడేవి కొండలు లోయలు, నదులు, మిట్టపల్లాలు కాదు!! తన గత జన్మలలోని మిట్టపల్లాలు 'తాను' ఎటు పోతున్నారో, అనేక జన్మలలో ప్రయాణిస్తూన్నా దిక్కూదారీ తెన్నూ ( ఏదైనా వుంటే అది ) గోచరిస్తుంది! చాలామందికి ముందుగాగోచరించే మహత్తర సత్యం -

భయంకర సత్యం - ఒకటే అతడు అనేకజన్మలుగా ఎటూ ప్రయాణించడం లేదని! దీనితో అతని దృక్పధమే ఆలోచించే విధానమే మారిపోతుంది. ఈ కోణంనుంచి మరణం గొప్ప తెరదీసినట్లు కనువిప్పు గలిగించే పాఠశాల!

అందులో కనిపించేవి వేరువేరు సబ్జక్టులలో తనకు వచ్చిన (రావి) మార్కులు కాదు! తానేమౌతున్నాడో — తనకేమౌతున్నదో అర్థంకాని స్థితిలో బ్రతుకుతున్న తాను యితరులకేమి చేస్తున్నాడో దాని ఫలితాల్ని నెత్తికి ఎలా ఎత్తుకుంటున్నాడో!!! ఇదే భయంకరమైన సత్యం!! చావు కాదు!

యోగులకు సుస్పష్టంగా గోచరించేది — సరిగ్గా యిదే! తాను ఒక నిర్దుష్టమైన మార్గం వెంబడి ప్రయాణిస్తున్నానని! ఇప్పుడా ముసలియోగి శరీరం నుంచి విముక్తి పొంది ఆకాశంలోకి నిటారుగా లేచి ఒకసారి గట్టిగా ఊపిరి పీల్చుకున్నాడు. బ్రహ్మాండమైన విశ్రాంతి! ఆహా! జీవితంనుంచే విశ్రాంతి! కాళ్ళు చేతులూ గట్టిగా ఈతకొట్టేవానిలాగా ఝాడించి, బారచాపి తన పాత ముసలిశరీరపు రోగము, నిస్సత్తువా తాలూకు జాడ్యం దులిపేసుకుని సూక్ష్మప్రేతలోకం (Higher Astral World) లో విహరించసాగాడు. అతడికి మైకేల్ గెలాండర్‌వంటి భయంకరమైన పీడ కలలుగాని లేక శాంతిదేవి వంటి కుటుంబసభ్యుల బాంధవ్య మమకారాల సంకెళ్ళు గాని మళ్ళీ భూలోకం మురికికూపంలోకి లాగే పనిలేదు!! మళ్ళీ ఒకసారి గట్టిగా ఊపిరిపీల్చుకుని తానెందుకు పిలిపించబడిందీ తెలుపమని 'విశ్వాత్మ' (Universal Mind) ను ఉద్దేశించి గట్టిగా ప్రశ్నించుకున్నాడు మనసులోనే !! ( ఎందుకంటే అతని మనస్సులో అలాంటివి ఏర్పడకముందే ఆలోచనలకే సమాధానాలు అతనిప్రజ్ఞలో తళుక్కున మెరుస్తాయి T.V.లోని చిత్రాలలాగా! అక్షరాలవలే !) మరుక్షణమే రివ్వున రాకెట్‌వలే కాంతికన్న వెయ్యిరెట్లు వేగంతో దూసుకుని పోసాగింది అతని 'జీవాత్మ'! ఇదేమీ అసాధ్యం కాదు. కాంతికి వేగం భౌతికప్రపంచంలోనే

అన్నిటికన్న ఎక్కువైనది. ఇప్పుడో! తాను భౌతికప్రపంచాన్ని దాటి, అణువులు, పరమాణువులు, ఎలక్ట్రానులు మైక్రోవేవులో ప్రయాణించగల పరిధి కంటే సుసూక్ష్మమైన (Subtle) లోకాలలోకి దూసుకొనిపోతున్నాడు కొన్ని కాంతిసంవత్సరాలు!! వేలలక్షలు కావచ్చు. క్షణంలో అతడివేగం ఆగిపోయింది.

ఎదురుగా ఒక వెలుగుమబ్బు! వానాకాలంలో సూర్యాస్తమానాన్ని కప్పిన వెలిమబ్బులా మండిపోతున్నట్టు సంధ్యాకాంతులీనే బంగారురంగు కాషాయ కిరణాలతో నారింజపండువంటి పట్టుపీతాంబరపు కిరణాలు ఒక గ్యాస్‌మంట వంటి నీలకాంతినికట్టి ప్రకాశిస్తున్నాయి — ఎట్ట ఎదురుగా.

''మనిషి జీవిత గమ్యం ఏమిటి? ఏమి నేర్చుకొనవలెనని ఈజీవితం నన్నీ మృత్యులోకం లోకి తీసకువచ్చింది? నేనెందుకు జన్మిస్తున్నానం? కష్టాలకీ సఖాలకీ అర్థం ఏమిటీ? ఈకర్మఫలితాలు ఎందుకు?''

అనుకుంటూ తనలోతానే ఆశ్చర్యపడుతున్న ఆలోచనలే ప్రశ్నలై ఆ యోగి హృదయంలో నీటిబుడగల్లా పైకి ఉబికిరాసాగాయి, అప్రయత్నంగానే! ప్రతి మానవుడికి హృదయంలో అణగారివుండే ఆలోచనలే యివి! అడగటంచేతకాదు. చాలామందికి అంతే! ఏవేవో అడుగుదామని ఇంకేవేవో కోరుకుంటారు. అసలు సమస్యయిది! జీవన్మరణ సమస్య! దీనికి సమాధానం ఎవ్వరూ చెప్పలేరు — ఒక్క ఆ 'విశ్వాత్మ' తప్ప! ఇంకెవరినడగాలి?

తెల్లటినక్షత్రం లాంటి కాంతి ఎదురుగా గోచరించి మూడు కిరణాలుగా విస్తరించి దగ్గరవుతూ నక్షత్రం అంచులనుంచి ఐదుకిరణాలు లేత వన్నెలతో ప్రకాశిస్తూ, పద్మం రేకులువిచ్చినట్లు వికసిస్తూ, తన ముఖం వైపు దగ్గర కాసాగాయి — ఆరుకోణాలు అంచులనుండి ఆరురంగుల కిరణాలు విరజిమ్ముతూ ఉన్నట్లుండి యోగి హృదయంలో ఒక

బ్రహ్మాండమైన ప్రేలుడు సంభవించింది! కాని నిశ్శబ్దమైన ప్రేలుడు. దాని అదురుకు ఒక వెలగపండు పగలకొట్టిన ప్రేలుడువంటిదేదో తన గుండెచుట్టూ తాబేలులా వున్నడిప్పను నూరు శకటాలుగా బద్దలు కొట్టింది!! క్షణకాలం భయం గందరగోళం అయోమయం! మరుక్షణం అవధులు లేని ప్రేమ ఒక చెరువులో గండిపడి జలపాతంలా దూకినట్లు తనలోకి అన్నివైపులనుండి జలపాతంలా ప్రేమా, ఆనందం – ఎగసి పొంగుతోంది. ఆప్రేమ తనలోని వ్యక్తిత్వాన్నంతా క్షణంలో ఛేదించివేసింది. ఇప్పుడు తానొక వ్యక్తికాదు! వ్యక్తిత్వంలేని ఆకాశంవంటి విశ్వాత్మకుడు. ఆహా! ఇదేనా ముక్తి అంటే?

''కాదు!!'' ఇది తాత్కాలికంగానేను నీకు అనుగ్రహించిన అనుభూతి మాత్రమే! నీప్రశ్నలకి సమాధానం నువ్వే చూడు! కళ్ళతో కాదు!అనుభవించిచూడు! అనుభవించేదే నీవై చూడు! అలా ప్రతీదీ నీవు అయి చూడటం పేరే నువ్వు జన్మెత్తడంలో నా సంకల్పం! అందులో అంటుకోకుండా చూసి మరుక్షణంలో బైటపడాలి! సర్వమూ నీవై చూడు!'' – అన్న అస్పష్టపు ఉరుములాంటి కంఠములేని సంకల్పం వంటి ఆజ్ఞ ఏదో తన ఎదుట వెలుగుతున్న వెలిమబ్బులోంచి ఉరుములాగ ప్రత్యక్షమైంది!

ఇది మాటలకంటే తీవ్రంగా తన శరీరంలోని అణువణువులోంచి ప్రజ్వరిల్లసాగింది. మరుక్షణంలో తాను తట్టుకోలేనట్టి తీవ్రమైన వణుకువంటి స్పందన తన ప్రాణం అంతటా వ్యాపిస్తున్నది. తీవ్రమైన భక్తిలాగా దుఃఖంలాగా ఆనందంలాగా ఒక ఆకారం లేకుండా ఉక్కిరిబిక్కిరి చేశాయి – ఒక దివ్యానుభూతిలాగా!!

''నాకు వెంటనే తెలిసింది కారణం లేకుండా నన్ను ప్రేమించేదైవానికి ఎదురుగా నిలబడ్డానని!! అనంతమైన అనుగ్రహం తట్టుకోలేనంతగా నాగుండెపై దాడిచేసింది! మరుక్షణంలో ఎదుటనీలాకాశం, నక్షత్రాలు

ఎదురుగా సపిపిల్లలు పాకుతూ ఆడుకుంటున్నారు! అదినాలోని భక్తికాదు! నా ప్రేమకాదు! నా ప్రేమకానేకాదు! అన్నీ తెలిసిన సర్వజ్ఞతతో నిండివున్న మిక్కిలి దయతో కరుణతో కలిసిన నా తప్పులన్నీ తెలిసిన నా పాపాలన్నీ ఎరిగివున్న నామీద జాలితో నన్ను రక్షించే ఆపేక్షతో నన్ను పిలుస్తున్న దైవానిది! అంతటి విశాలత్వం ముందు నేను సిగ్గుతో తలదించుకున్నాను. నాజపం, నాయోగం, సాధన ఎంతో దైవత్వంగా గర్వించిన ముసలియోగికి విశ్వాత్మ యొక్క విశాలత్వం ముందు నిప్పురవ్వలా, కాదు మిణుగురు పురుగులా .... ఒక చిమ్మెట అల్పత్వంలా ఒక క్రిమిలాగా క్షుద్రత్వం తనలోని క్షుద్రత్వం గూడుకట్టుకొని పైకిలేచింది! తనకే అసహ్యం కలిగేలా! ఇన్నాళ్ళూ తన మోక్షం, తనజ్ఞానం, తన తపస్సు అంటూ ప్రయాణించింది ఎటు? తన వ్యక్తిత్వాన్ని దాటి అట్టేదూరం పోలేదు! నిజానికి వ్యక్తిత్వం దాటనేలేదు — తన గొడుగు నీడనే నడిచే బాటసారిలా తన వ్యక్తిత్వం నీడగాపడే స్వార్థం తనకి వదలనే లేదు! — అసలు తనకేదీ కోరని విశాలత్వానికి వెళ్ళలేదని,తన ఆత్మ పరిమితత్వాన్ని వదిలి అఖండ విశ్వానుభూతిలోకి వ్యాపించనేలేదని, తన స్వార్థానికి యిదివరకు క్రిందిస్థాయిలో కోరుకున్న కోరికలే ఇల్లూ, భార్యా, డబ్బూ, అంతస్థూ, గౌరవం, కీర్తి (వీటివెనుక లోనే). యిప్పుడు కాస్త పై అంతస్తులో కోరుకున్న 'ఆధ్యాత్మిక కోరికల' వెనుకగూడా దాగివున్నది 'తానే'! రూపాలుమార్చుకున్నాయి తన కోరికలు అంతే!

ఇప్పుడర్థమైంది తన తప్పేమిటో! ఎంత మంచి ఆలోచనలైనా సరే అవి వ్యక్తిత్వాన్ని దాటిపోలేని, ఏదో కోరిక చూట్టూరా అల్లుకొని పరిధిని పెంచుకున్నాయని తనమీద తనకున్న మమకారం ఏమాత్రం తొలగలేదని! జపధ్యానాల వల్ల కూడా అదే మమకారం! మంత్రం సిద్ధించినా, తన ఇష్టదేవత ప్రత్యక్షంకావడం లేక తన పూజలు ఫలించినా ఆ పూజల

చరమస్థానం చేరుకున్నందుకు సంతోషించినా, 'యోగి' గా తాను మిగిలి పోయి వున్నాడు యింకా!

అప్పుడు అర్థం అవసాగింది. మంత్రసిద్ధిగాని తనకి దేవతాదర్శనంకాని, స్వర్గంకాని దివ్యసుఖాలుగాని పై అంతస్థులోని స్వార్థాలే ఉన్నతమైన కోరికలే ! నిజానికి యిష్టదేవత రూపంలో తాను పూజించింది తన కోరికలనే అని!

సిగ్గుపడిపోయాడు, ముడుచుకుపోయాడు అవమానంతో! ఇన్నాళ్ళూ యోగిగా సాధువుగా, ఋషిగా, లామాగా జన్మలెత్తి తాను సాధించిందంతా శూన్యంగా భూలోకంలోని కోరికలన్నీ అనుభవించినా ఈ త్యాగం చేసిన 'నేను' యింకానిలిచే వున్నావు. ఈ జన్మలన్నిటిలోనూ ఆరాధించింది నిజానికి నువ్వు కోరికలనే!

పెద్దపెట్టున పగలబడి నవ్వినట్టు, ఉరుములా ఆక్షేపణగా గంభీరమైన హాస్యం ప్రతిధ్వనించిది. ఏమిటి? పరిహాసమా - నాఅల్పత్వానికి? విశ్వాత్ముడి ముందు తాను తేలికపడిపోయినాడే?

మళ్ళీ ఉదయసంధ్యవంటి బంగారు తేజస్సు దగ్గరకాసాగింది! హాయిగా వెచ్చగా తాకింది స్పర్శకు!

జన్మలను ఎత్తడంలో ప్రయోజనం - తనలోని జీవుడు పుష్పించి 'తను' మొగ్గతొడగడానికి! అలా తన హృదయం విప్పారకపోవడానికి కారణమే తన భయం! తనకేదో కావాలని, అది రాదేమోనన్న భయం. తన స్వప్రయత్నం అనే భ్రాంతితో కొట్టుమిట్టాడిన జన్మలో చిక్కుబడేసిన అహంకారం! దానివెనుక దాగివున్న అసలు కారణం తనలోని భయమే! అన్నీ వదిలేసిన తాను - ఈ భయాన్నికూడా వదిలివుంటే బాగుండేది! నిర్భయంగా జీవించేవాడు! హృదయాన్ని స్వార్థచింతతో మూసుకుపోకుండ విశ్వాత్మని నమ్మి నీటిమీద తామరపువ్వులా తేలియాడుతూ

వుండవల్సిందిపోయి అనవసర స్వార్థంతో భయంతో దోబూచులాడుతూ బ్రతికాడు.

...భయం! భయం!! నిత్యం ఏదో భయం... అదే తనకి అడ్డంకి. ఈ భయంతోనే డబ్బూ యిల్లూ తన రక్షణ అంటూ జాగ్రత్తపడ్డతాను యోగిగా మారినాక కూడా వాటిని విడిచిపెట్టలేదు! 'ఇష్టదైవం' 'మంత్రసిద్ధి' అనే నిచ్చెనలతో పాతకోరికలనే, పాతభయాలనే, పై అంతస్థు మీద పందిరిగా ఊహించుకున్నాడు. అదే తన యింటి కప్పులా పైలోగది వైపున ఎదగకుండా అడ్డుపడ్డా పైనుంచి తలుపులు తెరచినట్లైయింది వేరే దృక్పధంలోకి! ప్రతి ఒక్క జీవితానుభవమూ కొత్తకోణం నుంచి గోచరించసాగింది! తనలోనే ఒకదీపం వెలిగించినట్లు వెలుతురు లోపలినుంచే వెలుగై వ్యాపించసాగింది బైటికి! ఇది బైట ఎక్కడినుంచో వచ్చిన అనుగ్రహం, లేక వరం లేక ఉపదేశం వంటి 'కిరణం' కాదు! ఇది 'తన' యొక్క వెలుగు!

ఆశ్చర్యంగా ఆ మానసికసంవాదం (exchange of thoughts)రూపంలో టిబెట్‌యోగికి విశ్వాత్మతో (Universal Mind) కలిగిన అనుభూతిలో నేర్చుకున్న పాఠాలు ఆశ్చర్యకరమైనవి. అవి: 1) సృష్టిలో ప్రతిజీవీ చెట్లూ,పువ్వులూ, జంతువులూ, మనుష్యులూ ఒకే అనుభూతి కోసం సృష్టించబడ్డారు. అది తనలోని ఆనందాన్ని పూర్తిగా అనుభవం ద్వారా ఆనందించడానికి

2) ప్రతి ఒక్కజీవిలో వుండే 'తాను',తనలో వుండే 'తాను'అనబడే వస్తువు ఒక్కటే! దానిచుట్టూ కప్పిన పొరలు మాత్రం వేరువేరు 'వ్యక్తిత్వాలు'గా ఒకే గిన్నెలోనిపాలు అనేక గ్లాసులలో పోసినట్లు బైటగ్లాసు పరిధి వ్యక్తిత్వం: లోపలి పాలు అందరిలోనూ ఉండే 'తాను'. అదే విశ్వాత్మకు ఎట్టి తేడాలేని వస్తువు!

'ఇతరుడు' వేరు అంటూ విడదీసి ఆలోచించడం వల్లనే 'తాను'

అంటూ విడిగా తనలోని బీజం ఏర్పడుతున్నది. అదే కోరికలకు ఆధారం. తాను వేరు అన్న ధృఢవిశ్వాసమే అన్ని భేదాలకూ ఆది! స్వార్థమూ, అహంకారమూ, తీవ్రమైనకోరికలూ, మమకారమూ అవి తీరకపోతే ద్వేషమూ అన్నీ ఒకే కారణం ఆనందం అనుభవంలో అందకపోతే వచ్చే అసంతృప్తి!

4) దీన్ని తీర్చుకోడానికి చేసే ప్రయత్నాలే ' ఇల్లు' 'భార్య' 'డబ్బు' 'సుఖము' అనే లక్ష్యాలు (Aims)కు దారి తీస్తున్నాయి. వీటిమీద ఆశతో చేసేపనులే 'కర్మ'ను పెంచుతున్నాయి. ఈకర్మవల్లనే సుఖదుఃఖాలూ జన్మలూ కలుగుతాయి.

5) మానవ జన్మానికి లక్ష్యం అంతులేని ఆనందం అనుభవంలో నిత్యం అనుభవించడమే!

దీనికి మార్గం ఏ ఆనందాన్ని తనకు లభిస్తున్నదో (కోరుకుంటాడో) దానినే యితరులకు పంచియివ్వటం! తనలోని ఆనందమూ తృప్తీ యిలా పంచి యివ్వడాన్ని 'ప్రేమ'అని పిలుస్తాము. జీవులు! ఈ ప్రేమ ఊటబావిలోని నీళ్ళవంటిది! బైటకి ఎంత తోడిపోస్తే లోపల మరింతగా ఊటగా ఊరుతుంది! అంటే ఎంత ఎక్కువగా బైటవారికి ఆనందం పంచి యిస్తామో అంత ఎక్కువగా మనలోకి ఈప్రేమ ప్రవహిస్తుంది. అలానే ఎప్పుడైతే ఇలా యితరులపై ప్రేమను ఆపివేస్తామో అప్పుడే మనలోని ఆనందం ప్రవహించడం కూడా ఆగిపోతుంది. ఈకారణంతోనే స్వార్థంవల్ల దుఃఖమే కలుగుతుంది. ఒక సిరాను పీల్చే ఇంక్ ఫిల్లర్ (Ink Filler) రబ్బరుపీకను నొక్కితే అందులోకి సిరా ప్రవహించే విధానం లోనే మనలోని ఆనందాన్ని యితరులకు పంచి అందిస్తే మళ్ళీ అందులోకి భగవంతుడి నుంచే ప్రేమ ప్రవహిస్తుంది. 'మనం యితరులను ప్రేమిస్తున్నాం' అన్న భావానికి నిజమైన అర్థం మనలోకి ప్రేమ ప్రవహిస్తున్నది అని! అలా ప్రవహించడం విశ్వాత్మ వల్లనే!

మరణంవల్ల చెడు జ్ఞాపకాలు తుడిచి వేయబడతాయి. పాతకక్షలు మరచిపోయి తిరిగి జీవితపాఠాలను కొత్తపేజీ మీద వ్రాసినట్లు ! పుస్తకంలో పేజీలు త్రిప్పడము వ్రాతలు చదవటానికి ఎలాంటిదో జన్మలు మన వ్యక్తిత్వం ఎదగటానికి కూడా అంతే అవసరం!

భూమిమీద నేర్చుకోవలసిన పాఠాలు ముఖ్యంగా ఆచరణలో పై యదార్థాన్ని అనుభవంద్వారా ప్రాక్టీస్ అయ్యేదాకా చేసే శిక్షణయే!

మరణించిన వ్యక్తి తిరిగి జన్మించటం అతడి 'అవసరాల'ను బట్టి ఏర్పాటు చేయబడుతుంది. ఇందులో అతడిగతకర్మ, యితరులకు చేసిన కీడు, మేలు, తన యొక్క సంకుచిత ధృక్పధంతో తనకు ఆనందం లభిస్తుందన్న అజ్ఞానంతో చేసినవీ, ఇవి మళ్ళీ జన్మించి అవే అనుభవాలను తిరగేసి అనుభవించాలి. (ఇతరులు యిచ్చినవే తనకు యివ్వబడతాయి!)

భూమ్మీద మనిషి ఎన్నోనేర్చుకోవాలి! దానికి మనం ఎందుకు భూమ్మీదకు పంపించబడ్డామో కాస్త దృష్టిలో పెట్టుకొని జీవించాలి.

భూమిమీద జీవితకాలంలో చాలాభాగం వృధాగా దుర్వినియోగం అవుతుంది. తిండికోసం, శరీరావసరాలకోసం, బట్ట, నివాసము, భార్య, జీవితావసరాలకు అవసరమయ్యే జీవనోపాధి! మరణించగానే శరీరంపోతుంది కాబట్టి ఆహారం అవసరం లేదు! దాని సంపాదనకై రోజులో 12గంటలు శ్రమించవలసిన పనిపోతుంది! దీనివల్ల మరణించిన ఆత్మలకు బోలెడు తీరిక! అకస్మాత్తుగా లభించిన ఈ తీరికతో రోజల్లా ఖాళీగా వుండే తీరుబడి ఒక గొప్పశూన్యంగా వీరిని బాధిస్తుంది. నిజానికి ఈ శూన్యం భూమ్మీద వుండగా తాను ఉద్యోగం అనీ, వ్యాపారం అనీ, ఆఫీసు అనీ తనకి తానే కల్పించుకునే కృత్రిమకార్యక్రమాలు (False Priorities) వల్లనే తన నిజమైన జీవితలక్ష్యం ఒకటున్నదని గుర్తుకురాదు! మరణించేదాక!

అకస్మాత్తుగా ఏర్పడే భయం, ఈ శూన్యత వల్ల అగాధంలా కనిపిస్తుంది. దానికితోడు తాను చేసిన మోసాలు, అన్యాయాలు వంటి చెడుపనులు టెలిస్కోపులోలాగా దగ్గరగా పెద్దవిగా కనిపిస్తాయి. దేనికోసం అవన్నీ చేశామో ఆ కోరికలకు ఆధారమైన శరీరమే పోయింది!కాబట్టి వాటికోసం జీవితమంతా ఖర్చుచేసుకున్న వ్యర్థత్వమే ఇప్పుడు తన శూన్యతకు ఆధారం.

ఎవరైతే భూమ్మీదవుండగా తన మనస్సుతో తన జీవితలక్ష్యం గురించి ధ్యానిస్తారో వారికి ఈ శూన్యత క్రమంగా పూడిపోతుంది. దీనిని 'ధ్యానం' అని 'జపం' అనీ పిలిచేకన్నా మనస్సును ఖాళీ చేసి విశాలంగా అట్టిపెట్టిన వారికి విశ్వాత్మ నుండి శాంతి ప్రవహించి ఆ శూన్యతను నింపుతుంది. దీనివల్ల జీవితం గురించిన భయం పోతుంది.

ఆ భయంతో చేసే అనేక చెడుకర్మల అవసరం, ప్రోద్బలం నశిస్తుంది. దీనివలన తన వ్యక్తిత్వమే, తన జీవిత ధృక్పథమే తిరగబడి (Reversal)పోతుంది. అంటే ఇంతకు పూర్వం అతి ముఖ్యంగా వున్న 'తన' ధృక్పథం యిప్పుడు పూర్తిగా అసంబద్ధమని తెలిసిపోతుంది. ఇతరులకు ఆనందాన్ని పంచియివ్వడంలోనే ఆత్మతృప్తి, జీవితలక్ష్యమూ చేరివున్నాయని తెలుస్తుంది.

జీవించడమే ఒక గొప్ప ట్రైనింగు! సుఖమూ దుఃఖమూ యిందులోని పాఠాలు. సుఖం వల్ల ప్రేమించడం తెలుస్తుంది, దుఃఖంవల్ల సాటిజీవుల బాధలు అర్థమవుతాయి. తన పని భూమిమీద ముగిసిపోగానే ఆ జీవితం యొక్క అవసరం దానంతట అదే పూర్తి అవుతుంది. అలాగ పూర్తి చేసుకున్న జన్మమే కడపటి జన్మము. విశ్వాత్మవలే సర్వత్రా వ్యాపించే ప్రేమను, శాంతినీ మనస్సులో పీల్చగలిగినప్పుడే ఈ ఆకాశం వంటి ఆత్మే తనలో ఏర్పడుతుంది! అదే నిత్యనిర్మలత, పరమశాంతికీ శాశ్వతమైన సంతోషానికీ ఆఖరుమెట్టు.

ఇంకా ఎన్నో విషయాలు తన మనస్సులో పొంగివచ్చిన సందేహాలకు విశ్వాత్మనుంచి తరంగాలుగా ఎదురువచ్చి తనకుతానై అన్నీతెలిసేలా చేశాయి!

ఇది ఒక 'ఆత్మబోధ' వంటిది. కానీ పండితులు ఊహించుకునే అద్వైతం వంటిది కాదు! అది శుష్కతర్కానికి అందనిది! అనుభవంద్వారా, స్వార్థాన్ని విడిచిన వారికే త్యాగం, భయం లేకుండా ఆత్మలో అంగీకరించిన వాడికే ఈ బెదురూ, జీవితం అంటే భయం, స్వార్థం నశిస్తాయి! దానిలోపలే విశ్వాత్మ అనేకమందిని మళ్ళీమళ్ళీ భూమ్మీదకి 'జన్మలు' యిచ్చి జీవితపాఠశాలకు పంపటం!

ఇంకా ఎన్నో విషయాలు ...... ఒక్కో క్షణకాలం పదిసంవత్సరాలు గడిచిపోయిన 'కాలఅనుభూతి'గా నడిచింది! అందులో చాలా విషయాలు తాను జన్మెత్తబోయే జీవితం గురించీ, అప్పుడు తన కార్యక్రమం గురించీ, తనలో సాధనగా రావల్సిన మార్పులగురించీ తెలుపబడ్డాయి.

''ఇవన్నీ నీవువెళ్ళబోయేే జన్మకు, చేపట్టే జీవితలక్ష్యానికీ సంబంధించినవి! ఇప్పుడవన్నీ నీ మనసులోంచి తుడిచివేస్తున్నాను! అవి మరచిపోతావు! నీకా మరుపు అవసరం! లేకుంటే నీవు సామాన్యుడిగా నిన్ను భావించుకోకపోతే సాటిమనుషులలో మనిషిగా యిమడలేవు! అందరిలో ఒకడిగా మసలుతూనే అందరిలో 'ఒకడిని' దర్శించు!

మెలకువ వచ్చేసరికి హాస్పిటల్ టేబుల్ మీద కెవ్వున కేకపెట్టింది మనస్సు

''బ్రతికాడు! బ్రతికే వున్నాడు సార్! గుండెకొట్టుకుంటోంది!'' ఈ కేకతో శరీరంలో ఉలిక్కిపడి మేలుకొన్నది ముసలి యోగి ఆత్మ! ఆ గందరగోళంలో అన్నీ మరచిపోయింది.

'నీ మనస్సులోంచి తుడిచేస్తున్నాను!' అన్న విశ్వాత్మ ఆజ్ఞ తలదాల్చి

కొత్తవ్యక్తిగా జీవితం ప్రారంభించాడు. కొత్త 'వ్యక్తిగా'!! అక్షరాలా రెండోజన్మ అది! శరీరానికి కాదు! తన వ్యక్తిత్వానికే పునర్జన్మ!! బహుశా వేదంలో ''ద్విజన్మ'' అని ఋషులు అనుభవించి వాడిన మాటలకు అర్థమిదా? ఇది శేష ప్రశ్న!! ఆ ప్రశ్నకు సమాధానమే తన జీవితశేషం!!

శరీరంలో దూరగానే ఒక చిన్న నేలమాళిగ (Underground Cellar) లేక చీకటి కోణంలో ప్రవేశిస్తున్నట్టుగా ఉక్కిరిబిక్కిరి అయినట్టు యిబ్బంది కలిగింది! కారణం 'ఆత్మ' పొగమంచులా చాలాదూరం వ్యాపించి వున్నది. విశాలంగా తన మానసిక పరిధి అంతా కూడా ఆక్రమించి వున్నది. కానీ శరీరంలోకి వెళ్ళేందుకు ప్రవేశిస్తూంటే, ఇరుకుగా వున్న చెప్పులో కాలు పెట్టినట్టు లేక సైజు చిన్నదిగావున్న బూటు తొడుక్కుంటే కరచినట్టు విపరీతంగా వేధించసాగింది.

దీనికి తోడు తలపైన ఎవరో పెద్దబండ పెట్టినట్టు బరువుగా తల దిమ్ముగా నాదుగా తోచసాగింది! చెవులు గింగురుమని కీచురాయిలాగా శబ్దం వినపడసాగింది! ఏమిటా అని పరికించిచూస్తే గతంలో ఆ శరీరంలో ఉండి వెళ్ళిన వ్యక్తి తాలూకు ఆలోచనలు, పట్టింపులూ, మూఢవిశ్వాసాలూ యింకా ఎన్నో పేర్చుకొని ఇరుకుగా మెదడును కూరిపెట్టినవీ అడ్డదిడ్డమైన ఆలోచనలతో విండిపోయివున్నది! పాయిఖానా క్రింద వుండే సెప్టిక్‌టాంక్ (septic tank) లాగా ఒక భయంకరమైన దుర్గంధం లేక అశుభ్రత, పాకుడులాంటి జిడ్డుగా, జిడ్డుగా నిద్రమత్తులాంటి చీకటితో నిండివున్నది. క్షణకాలం కూడా ఆ చీకటికూపంలో నిలిచివుండలేక ముసలి యోగి ఆత్మ బైటికి గింజుకుని రాసాగింది.



14

# టిబెట్ యోగి 'లామా' పునర్జన్మ ! – III

'.....మళ్ళీ ఊపిరి ఆగిపోతున్నదిసార్!' అంటూ టేబుల్‌మీద రోగిచుట్టూ చేరిన వైద్యులలో మత్తుమందు యిచ్చే అనస్థటిస్టు కంఠమది! మళ్ళీవేగంగా వైద్యబృందం చావుబ్రతుకులమధ్య కొట్టుమిట్టాడుతున్న బ్రిటీషువాడి స్థూలకాయాన్ని పట్టుకుని, మాలీసు చేసినట్లు మర్దన చేయసాగారు. క్రమంగా శ్వాస పుంజుకోసాగింది.

ఇంతలో ఆకాశం నుంచి

''వత్సా!'' తన గురుదేవుల కంఠం! తన యిబ్బంది చూసి వినోదంగా నవ్వుతూ తన గురుదేవుని కంఠం! జన్మ జన్మలుగా తనకు పరిచితమ్మైన సద్గురువు నవ్వుతున్నారు. తన యిబ్బంది చూసి!తనకి

ప్రాణసంకటం ఆయనకి వినోదం! ముసలియోగి మనసులోనే సణుక్కున్నాడు

మళ్ళీ గురుదేవుల కంఠం

''నా దగ్గర శిష్యుడిగా చేరిన కొత్తలో నీ మెదడునిండా చేరివున్న చెడుతలంపులే, వ్యర్థమైన సంస్కారాలే ఇలాంటివీను! అప్పుడు నాకెలా వుండేదో నీ ఆలోచనల పరిమళం తాలూకు దుర్గంధం గుర్తుకువచ్చి నవ్వు పుట్టింది. ఇప్పుడు నీవు శరీరం మార్చుకోకతప్పదు! లేకపోతే మరి ముప్ఫై సంవత్సరాలు ఇంకో నూతన శరీరంలో బాల్యమూ, కౌమార్యమూ యింకా అడ్డదిడ్డపు యౌవ్వనమూ అవి వదలించుకోడానికి మరో పది సంవత్సరాలైనా సాధనచేయాలి అప్పటిదాకా నీకు ఈ క్రింది భూలోకంలో యిలా కుళ్ళిచావాల్సిన హింస తప్పుతుంది!''

ఇప్పుడర్థమైంది ముసలియోగికి!...... ఎంత యిబ్బందిగా వున్నా 'తనకి' పరకాయ ప్రవేశం హింస తప్పదు. కళ్ళుమూసుకుని శరీరంలోకి ఇరుకుగా దూరి అటూయిటూ సర్దుకోసాగింది అతని ఆత్మ!......

అబ్బా! కడుపులో మంట! (ఆ మరణించిన వాడు ఉదరంలో అల్సర్‌తో చనిపోయాడట, వెధవగోల!)

ఊపిరి పీలుస్తుంటే శ్వాసక్లోశమంతా కఫ్ఫతో నిండిపోయివున్నది. 'వీడికి ఉబ్బసంరోగం కూడా కాబోలు దేవుడా!' అనుకుంటూ మరికొంచెం లోపలికి దిగగానే జీర్ణకోశం అంతా నానారకాల తిండి,వెల్లుల్లి మసాలా వంటి నీచుపదార్థాలతో నిండి వున్నది. మరికొంచెంక్రిందకు దిగగానే బాబోయ్! బాధ! వీడసలు బ్రహ్మచర్యమంటేనే ఏమిటో ఎరుగని దుష్టజీవితం ! శరీరం మండిపోతోంది !!

అలాగ కొత్తశరీరంలో దూరిన ముసలియోగికి కొన్నినెలలు కాదు కొన్ని సంవత్సరాలు పట్టింది! పాత ఇంటిలో ప్రవేశించిన కొత్తయజమానిలా ప్రతీలెట్రిన్, ప్రతీ మురుగుకాలువా శుభ్రం చేసుకోక తప్పలేదు! ఆ తరువాత కొన్నినెలలు ఆహారనియమం, కఠినమైన ఉపవాసంతో గత శరీరంలోని మకిలి పదార్థమంతా భస్మం చేసి మళ్ళీ ప్రాణాయామంతో కొలిమితిత్తిలా ప్రాణవాయువుతో నింపి పలుమార్లు సైకిలు పంపుకొట్టినట్టు శ్వాసతో శుభ్రం చేస్తేకాని ఆ మెదడు శుభ్రపడి తనకు నివాసయోగ్యంకాలేదు! అంత యిబ్బందీపడక తప్పలేదు! ముసలియోగి ఆ బ్రిటీషువాడి శరీరంలో ప్రవేశించాక ఆ పాతసంస్కారాలను వీలైనంత వరకూ మార్చుకుని తనదిగా మెరుగులు దిద్దుకునేదాకా!

దీనికితోడు యింకొక బెడద వచ్చి పడింది!

''మిత్రమా! నాదొక విన్నపం!''

'వీడెవడు?' విసుక్కుంటూ తనలోకి చూసుకున్న ముసలియోగికి తలపైన పాతవ్యక్తి, ఈ శరీరం తాలూకు ఆసామి నిలబడివున్నాడు ఆకాశంలో!

''మళ్ళీ వీడెందుకు దాపరించాడు? ఎన్నో లంచాలు, వరాలూ, తాను కష్టించి తపస్సు చేసుకున్న పుణ్యమూ వీడికి కట్టబెడితేగాని వాడి శరీరం అదీ యింత నికృష్టమైన శరీరం విడచిపెట్టడానికి అంగీకరించాడు కాదు!

అమ్మయ్య! అని ఊపిరిపీల్చుకునేలోగా వీడు మళ్ళీ దాపరించాడు. లేని ఉల్లాసం తెచ్చుకుని

'ఏమి కావాలి? పైలోకాల్లో సౌకర్యంగా లేదా?'

అంటూ తాను తపస్సుతో ఆర్జించుకున్న భువర్లోకంలో ఉండేలాగ

తాను వాడి శరీరంలో వున్నంత కాలం 'అద్దె' యివ్వకొడానికి అంగీకరించిన ముసలియోగి ప్రశ్నించాడు!

''ఏమీ లేదు! నీవు నా భార్యతో కొంచెం ఎడంగా ఉండాలి! నేను చెప్పడం మరచిపోయాను. ఎట్టి పరిస్థితులలోను నీవామెతో సంసారం చేయరాదు! నాకీ మాట యివ్వాలి నువ్వు!'' ఇబ్బందిగా ముఖంపెట్టినిలబడి వున్నాడు బ్రిటీషువాడు.

తాను బ్రహ్మచారిననీ, సన్యాసిననీ, హిమాలయాలలో తపస్సుచేసే సర్వసంగపరిత్యాగిననీ, తెలియదావీడికి? కానీ ఇంగ్లండులో బ్రతికే నికృష్ట జీవితంగల ఈజీవుడికి నామాటలపై విశ్వాసం లేదు - అసలు బ్రహ్మచర్యమంటేనే అర్థంలేని- 16వ ఏటనుంచీ వ్యభిచారంతో జీవించిన త్రాగుబోతుకెలా తెలుస్తుంది? సంతోషంగా ముసలి యోగి ఆనాటినుంచి అతడి భార్య తనకు సోదరి కాదు! తల్లితో సమానమని ప్రమాణంచేసాడు. మరుక్షణంలో చూస్తే అక్కడ లేడు!

కాని భూమ్మీద జీవితంలో సమస్యలు అప్పటి నుంచే ప్రారంభం కాసాగాయి! అతని భార్యా ఈ ముసలియోగిని తన పూర్వ భర్తగానే భావిస్తున్నది. హాస్పిటల్‌లో గుండె ఆగిపోయిన తన భర్త, వైద్యుల సహాయం వల్ల తన భర్త ఎలాగో బ్రతికినందుకు ఎంతో సంతోషిస్తున్నది! ఆ సమయంలో ఈ వింత పోకడలేమిటి? ఆమెకే మాత్రం అర్థంకాలేదు భర్త ప్రవృత్తి.

''నేను నీ భర్తను కాను! నేనొక టిబెట్ యోగిని ! హిమాలయాల్లో తపస్సు చేసే సన్యాసిని!'' అంటూ నెత్తీనోరూ మొత్తుకున్నా ఆమె వినిపించుకోలా!

''మీకు ఏదో మతి స్థిమితం చెడింది! లేకుంటే శుభ్రంగా తిని తిరిగే మనిషి సంసారం చేయకుండా ఏ ఒక్కరోజూ నిద్రపోనీ నీకు

విచిత్రమైన ఈ రోగమేమిటి? ఆమె తలకొట్టుకుంది 'కర్మ' అనుకుని వెంటనే వైద్యుడివద్దకు కాదు సైక్రియాట్రిస్టు వద్దకు పోదాం పదమని వేధించుకు తినసాగింది.

ఫలితంగా కొన్నినెలలు కనిపించిన డాక్టర్ దగ్గరకల్లా చూపించి తన భర్తను బాగుచేయమనికోరేది! ఫలితం శూన్యం! కాని ముసలియోగి జీవితంలో ఎంతోకాలం వ్యర్థం అయింది. మొత్తుకున్నా వీలుకాలేదు! చివరకు కోర్టుద్వారా విడాకులు తీసుకోవాలని నిర్ణయించుకున్నాడు. కాని తన శరీరం తాలూకు పాత యజమాని వచ్చి సంప్రాప్తించి పీడించసాగాడు. విడాకులు తీసుకోక తప్పదు. అంతకాడికి తానే ఈ శరీరంలో ఉండిపోతే సరిపోయేది! ఫలితంగా ముసలియోగి తనకేదో విచిత్రమైన వ్యాధి (Mental disorder) వచ్చిందనీ, సంసారం చేస్తే గుండెజబ్బుతో మరణించడం ఖాయమనీ, ఆమెకు ఒక భయం సృష్టించాడు! ఆమె ఎలా స్వేచ్ఛగా జీవించినా తనకే యిబ్బందీ లేదని యిలాగ అనేక చిక్కులనుండి బయటపడక తప్పలేదు. అయినప్పటికీ ముసలియోగికి సైకిలు తొక్కటం రాదు. ఆఫీస్‌లో టైపు చేయలేడు. సిగరెట్, టీ వంటి మత్తుపానీయాల వాసనే పడదు. ఫలితంగా ఉద్యోగానికి రాజీనామా యివ్వక తప్పలేదు. చివరకు తన ఆత్మకథను వ్రాసి ఒక పబ్లిషర్‌కు అమ్మచూపాడు! ఫలితంగా లక్ష కాపీలు అమ్ముడు పోయింది ఆ గ్రంథం!! దరిద్రం పోయింది. విడాకులు కోరిన భార్య కూడా తనతోనే స్థిరపడిపోయింది.

ఇలాగ శరీరాలు మార్చినా ప్రత్యేక యిబ్బందులు తప్పవు! దాదాపు పదిహేను సంవత్సరాలు బ్రిటీషువాడి శరీరంలో వున్న టిబెట్ యోగి తన ఆత్మకథను యథాతథంగా ప్రచురించాడు. దానితో విదేశాలలో కూడా గొప్ప సంచలనం చెలరేగింది! జన్మలూ కర్మలూ అన్న విషయం చర్చనీయాంశమైంది. పత్రికలవాళ్ళు, రేడియో వారు, T.V.. వార్తాపత్రికలు

వేటకుక్కల్లా వెంబడించసాగారు ముసలియోగిని ప్రశ్నలతో అడ్డదిడ్డపు ప్రశ్నలను, తప్పుడు వార్తలు ప్రచురించసాగారు. దాంతో యూరపు అంతా సంచలనం, అమెరికాకు కూడా వ్యాపించింది. చీమలగుంపులాగ తనను పీక్కుతింటూంటే పైన తన గురుదేవులు తృప్తిగా నవ్వుకున్నారు పొడుగాటిగడ్డాన్ని దర్జాగా నిమురుకుని!

''గురుదేవా! నాకు ప్రాణసంకటం, మీకు వినోదం! యిది మామూలే గదా!'' అంటూ మొత్తుకున్న శిష్యుడితో

''వత్సా ! నీవు పరకాయ ప్రవేశం చేసిన ప్రయోజనం పూర్తికావచ్చింది! ప్రపంచమంతటికీ పునర్జన్మ యదార్థమని బుజువు చేయటానకే నిన్ను ఈక్రింది లోకంలోకి మామూలు జన్మమెత్తకుండా పరకాయప్రవేశంద్వారా పంపించిన కారణం నెరవేరింది! త్వరలోనే ప్రపంచంలో గొప్పమార్పులు రాబోతున్నాయి! టిబెట్‌ను చైనావారు దండయాత్ర చేసి ఆక్రమిస్తారు! వేలాదిమంది యోగులు, సాధువులూ మరణిస్తారు. లక్షలాది నాడీగ్రంధాలు తాళపత్రాలు నాస్తికులైన భూతాలవంటి చైనావారు తగులబెడతారు! శాశ్వతంగా ఈ ఆధ్యాత్మిక విద్య భూమ్మీద నశింపచేయాలని ఆఖరిప్రయత్నం జరుగబోతున్నది! ఎందుకంటే త్వరలోనే కలియుగం అంతంకాబోతున్నది. అందుకే నీకీ యిబ్బంది పెట్టక తప్పలేదు పరమగురుమండలిలోని మా పెద్దలందరూ! ''

ముసలియోగి హృదయం ప్రేమతో భక్తితో ఆర్ద్రం కాసాగింది.

''తన జన్మకీ చరితార్థమా? చాలుస్వామీ, చాలు! ఇంత కథ వున్నదన్నమాట తన పునర్జన్మ కాదు పరకాయ ప్రవేశప్రక్రియ వెనకాల! ఆశ్చర్యపోతున్న ముసలియోగి ఎదుట పున్నమివెన్నెల వెలుగులా గుండ్రంగా బింబం వెలుగుతోంది! దాని మధ్యనిలిచివున్న గురుదేవులు! అభయహస్తంతో చిరునవ్వు ప్రసరిస్తూ ఆశీర్వదిస్తున్నారు.

''వత్సా! నేనిక పైలోకాలకు వెళ్ళక తప్పదు! మరి నీకు ఈ శరీరంలో కనిపించడం వీలు కాదు! అందుకే నీకు శెలవు చెప్పి పోదామని వచ్చాను.''

''గురుదేవా!'' దాదాపు ఏడ్చినంత బాధగా అరిచాడు ముసలియోగి. కాదు, బ్రిటీషువాడి శరీరంలో వున్న యోగి!

ఓదార్పుగా అనేక విషయాలను గురుదేవులు దృశ్యంగా చూపించారు. అన్నీ గుర్తు లేవు! లీలగా గుర్తున్నాయి. అవన్నీ రానున్న అనేక సంవత్సరాలలోని మార్పులు, భూమిమీద రానున్న మార్పులు!

ఆకాశం ఎఱ్ఱని సంధ్యాకాంతితో వెలిగిపోతోంది! క్రిందుగా దట్టమైన పొగ! న్యూయార్కు, చికాగో నగరాల పైనుంచి అణాబాంబుల ధూళి రాత్రినే పగలుగా మార్చివేసి మండిపోతున్నది. నాగరిక ప్రపంచం, క్రిందనుంచి సముద్రహోరులా వేలాది కంఠాల ఆర్తనాదం! ఇదేమిటి? సర్వనాశనమా?

''కాదు! ఇది రానున్న యుగాంతం! ఈ సభ్య నాగరిక ప్రపంచమనుకునే కలియుగ సమాజం అంతరించబోతున్నది. కాని యిది సర్వనాశనంకాదు! కాబోదు! మళ్ళీ ఎఱ్ఱని మంటలపైనుండి దౌడు తీస్తున్న గుఱ్ఱాలు. దానిపైగా ఒక తెల్ల గుఱ్ఱంపై ఖడ్గంతో ఒక దివ్యపురుషుడు లీలగా ''శంబలప్రభువు!'' ఈ పాశ్చాత్యసంస్కృతి (Western Culture) అంతరించబోతున్నది. సత్యయుగం ప్రారంభించే ముందు ఈ గతాన్ని తగులబెట్టి నూతన చరిత్ర వ్రాయాలి! దీనికి ముందు అధ్యాయమే చైనా దండయాత్ర! టిబెట్ వినాశనం!!! ఇవన్నీ త్వరలో జరుగబోతున్నాయి. నీ స్వదేశమైన టిబెట్ నాశనం కాబోతున్నది. అది చూచి ఖంగారు పడవద్దు! మంచివాళ్ళు బాధపడితేనే కాని ధర్మప్రభువు పైనుండి క్రిందకు దిగిరాడు! యుగయుగాలుగా యిదే చరిత్ర!

ఇందులో మొట్టమొదటగా నాస్తికులైన పదార్థవాదంతో (బతికే పాశ్చాత్యులు మనస్సులో కాగడా వంటి జ్ఞానం నిప్పులా ముట్టించారు. దానితో పాశ్చాత్యసంస్కృతి తగులబడాలి (అంతరించాలి)! త్వరలో చైనా రష్యాలలోని కమ్యూనిజం అంతరించబోతున్నది. 'అంటూ యింకా చాలా చాలా భవిష్యత్తు శరవేగంతో T.V. దృశ్యాల్లాగ కళ్ళముందునుంచి దూసుకుపోయాయి.

అయితే తనకి గుర్తున్నదల్లా ఒక్కటే! తాను పరకాయ ప్రవేశం చేయడం ఒక మైలురాయి! పాశ్చాత్యదేశాలలో ఆధ్యాత్మికవిజ్ఞానం ఉదయించే యుగసంధి. తూర్పుసూర్యుడు పడమరదేశాలలో తన కిరణాలను ప్రసరింపచేస్తున్నాడు - రానున్న సత్యయుగ సూర్యుడు! ముసలియోగి ఉపశమనంగా కన్నీళ్ళతో నమస్కరిస్తూ నిలబడ్డాడు తన గురుదేవులు నీలాకాశంలోకి శరవేగంతో తోకచుక్కలా రివ్వున ఎగిరి మాయంకావటాన్ని చూసి తన కష్టాలను సహించటానికి తయారు కాసాగాడు!

(ఇది కథ కాదు! ముసలి యోగి 'ఆత్మకథ'లోని అనుభవాల సంగ్రహం).



# 15

# ''లెనిన్ ఆత్మతో మాట్లాడిన స్త్రీ''

అది 1961-వ సంవత్సరం! మాస్కోలో కమ్యూనిస్టు పార్టీ 20-వ కాంగ్రెస్ మహాసభలు జరుగుతున్న రోజులవి.

సభలో సోవియట్ కమ్యూనిష్టుపార్టీ కార్యదర్శి ''నికితాకృశ్చేవ్ '(Nikita Kruchev) లేచి ''స్టాలిన్ గురించీ, స్టాలిన్ పరిపాలనలో జరిగిన రాజకీయం తప్పిదాలగురించీ, ఆయన నియంతృత్వధోరణి, తిరోగమనవైఖరిని గురించీ ఎంతో బహిరంగంగా విమర్శించాడు. ఆ ఉపన్యాసం ప్రపంచ వార్తాపత్రిక లన్నిటిలోనూ పెద్ద పెద్ద హెడ్డింగుల (Head Lines)తో ప్రచురించబడింది. 'స్టాలిన్'కు వ్యతిరేకంగా ఒక పెద్ద గాలి దుమారం లేవదీశాడు 'కృశ్చేవ్'. ఆ సభలోనే జరిగిన ఇంకో అద్భుతం ప్రపంచచరిత్రనే మార్చగలిగినంత ప్రభావము కలది. అది చాలామందికి తెలియదు. ఎందుకంటే దాన్ని గురించిన వార్తలు రష్యా దాటిబైట ఎక్కడా ప్రచురణకానియ్యలేదు.

వయసు మళ్ళినా, నాజూకుగా కనబడే ఒక స్త్రీ 'డెలిగేట్' (Delegete) ఆ జనరల్ అసెంబ్లీని ఉద్దేశించి ప్రసంగించడానికి సభలో లేచి నిలబడి వేదికపైకి వెళ్ళింది. ఆమె పేరు ''దార్యా-లాజుర్కినా'', ఆమె రష్యన్ విప్లవంలో పనిచేసి చిన్నతనంలోనే గొప్పపేరు సంపాదించుకొన్నది, కమ్యూనిష్టుపార్టీ వర్గాలలోనే.

ఆమె చిన్నతనంలో అంటే ఆమె తొలియవ్వనంలో వుండగానే 'లెనిన్' (Lenin)ను కలుసుకోవటం తటస్థించింది. మొదటి సమావేశంలోనే ఆయన ప్రభావానికి ఆకర్షితురాలై, కమ్యూనిష్టుపార్టీ సభ్యురాలైంది. ఆ తర్వాత 1917 విప్లవంలో ప్రాణాలకుకకూడా లెఖ్ఖచెయ్యకుండా పనిచేసింది త్వరలోనే. కమ్యూనిష్టుపార్టీలో గొప్ప నిస్వార్థవ్యక్తిగా పార్టీ సిద్ధాంతాలను మనస్ఫూర్తిగా అనుసరించే ఆదర్శవాదినిగా మంచి పేరుపొందింది. కాలక్రమేణా రష్యాలో కూడా మార్పులు రాసాగాయి. 1937 ప్రాంతంలో 'లెనిన్' ప్రభాంవంతో పనిచేసిన కమ్యూనిష్టుపార్టీలోని మొదటి వర్కర్లందరూ 'క్రమశిక్షణ చర్య'లపేరిట అరెస్టు చేయబడటం జరిగింది. వేలాదిమంది కమ్యూనిష్టు కార్యకర్తలు లెనిన్‌తో కలిసి దేశంకోసం ప్రాణాలకు తెగించి పోరాడిన వాళ్ళెందరో సైబీరియా(Siberia)లోని భయంకర మంచు ఎడారికో లేక గుర్తు తెలియని మరో పోలీసు స్థావరానికో తరలించబడ్డారు. అందరు ప్రథమ కమ్యూనిష్టు కార్యకర్తల్లాగే ఆదర్శవాదినీ లెనిన్ శిష్యురాలూ అయిన 'దార్యా -లాజుర్కినా'కూడా కఠిన కారాగారశక్షతో 'లేబార్ క్యాంపు'లో నిర్బంధానికి గురై దీర్ఘకాలం శిక్షలనుభవించింది.

ఆమెలాగే బంధించబడ్డ వేలాది యూాత రాజకీయఖైదీలతో పాటూ'దార్యా'కుకూడా 19 సంవత్సరాల కఠినశిక్ష విధించ బడింది. మరొక రెవరైనా అయితే ఆ శిక్షల్తో అంతకాలం (1961వరకూ)

ఓర్చుకుని చెక్కుచెదరకుండా బయట పడగలిగే వారు కాదు. ఇది ఆమెకెలా సాధ్యమైందో ఆమెను ధైర్యంగా నిలబెట్టిన విచిత్ర ఆధ్యాత్మికానుభూతులేమిటో ఆ సభలో అందరిముందూ మొదటిసారిగా వెల్లడించిందామె. ఆకఠోరమైన ''నేరస్థుల - క్యాంపు'' (Concentration Camp)లో ఆమె ఆ కష్టాలు అనుభవించే రోజుల్లో 'అదృశ్య సహాయము', మానసిక బలం', ఆమెకు నిత్యం 'లెనిన్ ఆత్మ' వద్దనుంచి ఎలా లభించామో ఆమె మాటలతోనేవిందాము. ఆమె శిక్షలను అనుభవించే నాటికి 'లెనిన్' మరణించి చాలాకాలం అయింది. ఆ కారాగారవాసంలో ఆమెకు కలిగిన వింత అనుభవాలను యిలా వివరించిందామె -

ఆ దారుణ శిక్ష ఎలా భరించగలిగానంటే 'లెనిన్' ఎప్పుడు నాకు కనిపిస్తుండేవాడు. నాకు ఎన్నో సలహాలిచ్చే వాడు. అంతేకాదు. ఆ అసహాయమ స్థితిలో దిగులుపడివున్న నాకు ఎంతో మనోబలాన్ని ధైర్యాన్ని ఆయన ప్రసాదించేవాడు - ఇక్కడ ఆయన అంటే చనిపోయిన 'లెనిన్ ఆత్మ' అన్నమాట ! అంతేకాదు మరో ఆశ్చర్యకరమైన అనుభవాన్ని ఆ సభలోనే ఈ విధంగా తెలిపింది. ''దార్యా లాజుర్కినా - సరిగ్గా నిన్న ఇదే సమయానికి నేను లెనిన్‌ను స్పష్టంగా చూశాను! ఆయన ప్రత్యక్షంగా నా ముందుకు వచ్చాడు. ఆయన జీవించివుండగా ఎలా ఉండేవాడో సరిగ్గా అలాగే కనిపించాడు. ఆయనతో మాట్లాడాను కూడా! మరో విషయంకూడా చెప్పాడు లెనిన్ నాతో - నాకిక్కడ దుర్భరంగా వున్నది! అందులోనూ ఈ ప్రదేశంలో 'స్టాలిన్' సమాధి ప్రక్కనే నాసమాధి ఉండటంవల్ల నాకెంతో ఇబ్బందిగా వుంది ! 'స్టాలిన్' దేశానికెంతో అపకారం చేశాడు. అతడి ప్రక్కనే నేనుండటం నాకేమాత్రం ఇష్టం లేదు!!'' అన్నాడు లెనిన్! అంటూ తన వింత అనుభవాలు అందరినీ ఆశ్చర్య చకితుల్ని చేస్తు వెల్లడించింది. ''దార్యాలాజుర్కినా''.

ఆమె చెప్పిన అనుభవాన్ని సోవియట్ పత్రిక ''ఇజ్వెస్టియా'' (Izvestia)కూడా ప్రచురించింది. కాని అందులో ''దార్యాలాజుర్కినా'' ఉపన్యాసం విన్న సభలోని వారంతా పిడుగులు పడుతున్నాయా అన్నట్లు సంతోషంతో చప్పట్లు చరిచి హర్షధ్వానాలు చేశారని మాత్రమే ప్రకటించారు గాని పార్టీరాజకీయాల 'దగా' కారణాలవల్ల దార్యా ప్రసంగంలోని 'లెనిన్' ఆత్మను గురించిన వివరాలు మాత్రం జాగ్రత్తగా సెన్సారుచేయబడ్డాయి, ప్రపంచ పత్రికలలోవెయ్యకుండా.

కాని అదే మహాసభ గురించిన వార్తలను ప్రచురించిన 'టైమ్' (Time)పత్రిక మాత్రం -20వ కమ్యూనిస్టు మహాసభలో చివరిలో జరిగిన ప్రసంగాలు, విచిత్రమైన అనుభవాలతో నిండివున్నాయి అని మాత్రమే ప్రచురించింది. అయినా ఆ రోజు ఆ సభలో ''దార్యా లాజురినా'' చెప్పిన **'లెనిన్ ఆత్మతో ' తన అనుభవాలను ప్రత్యక్షంగా విన్నకమ్యూనిస్టు కార్యకర్తలు చాలామంది వున్నారు.**

అంతేకాదు ఇంకో వింత ఏమిటంటే ఇది జరిగిన కొద్ది రోజులకే ''రెడ్ స్క్వేర్'' (Red Square)లో ఉన్న స్టాలిన్ సమాధి పెళ్ళగించివేయబడింది లెనిన్ సమాధి ప్రక్కనే వున్న స్టాలిన్ సమాధి దూరంగా **వేరేచోటికి తరలిచబడింది!** ఈ విషయాన్ని 'మేబోన్' (Mabone) వ్రాసిన 'రష్యాలోని అంతరంగిక సరిశోధన అన్న వ్యాసంలో 1962వ సంవత్సరం చివరిలో ప్రకటించబడింది.

నాస్తికులైన కమ్యూనిష్టుల నాయకులు కూడా 'లెనిన్ ఆత్మ' 'దార్యా'కు చెప్పిన సందేశం పాటించక తప్పలేదు. లెనిన్ సమాధి ప్రక్కనే ఉన్న 'స్టాలిన్' సమాధిని ఇన్నేళ్ళ తర్వాత తొలగించటానికి వేరేకారణం ఇంకేముంటుంది! ఆత్మ, దేవుడు. ఆధ్యాత్మిక అనుభూతులు అన్నీ అబద్ధం అని వాదించే ''కమ్యూనిష్టుపార్టీ'' సభ్యురాలైన 'దార్యా'

విషయాన్నెలా నమ్మింది! మతంలోని దివ్యానుభూతులను నిజం కావని విమర్శించే కమ్యూనిష్టులు అత్యంత ప్రధానమైన తమ 20వ కాంగ్రెస్ మహాసభలోనే 'దార్యా'ను ఈ విషయాలపై ఎలా ప్రసంగం చెయ్యనిచ్చారు?

అంటే అప్పటకే రష్యలో మార్పు ఆరంభమైంది సైంటిస్టులు చేసిన - చేస్తున్న ఆధ్యాత్మిక పరశోధనలే దీనికి కారణం ! అందులోను ముఖ్యంగా 'జోసెఫ్ కిర్లియన్' **(Joseph Kirlian)** కనిపెట్టిన కొత్తరకం ఫోటోగ్రఫీద్వారా, మానవ 'ఆత్మ' సత్యమని ఋజావు చేసే ఫోటోలే ఈ మార్పుని తెచ్చాయా? దీనికి సరైన సమాధానం కావాలంటే, ఆ 'కిర్లియన్ ఫోటోగ్రఫీ ' ఏమిటో దానిద్వారా మానవుడి ఆత్మను ఎలా ఫోటోగ్రాఫ్ చేస్తారన్న విషయం తెలియాలి!

అది వచ్చే ఆధ్యాయంలో తెలుసుకుందాం!



16

# నరక – లోకములు!

ఇంగ్లీషు చదువుకుని ఆధునికులమని విర్రవీగే బుద్ధిహీనులు తరచూ 'నరకము అనేది నిజంగాలేవు' (ఉంటే వీడి పాపాలకు తప్పక అక్కడికి పోవాల్సి వస్తుందనే భయం). నరకం, స్వర్గం అనేవి మనుష్యులను భయపెట్టడానికి, తగు కంట్రోల్‌లో వుంచడానికో కల్పించబడిన 'పుక్కిట పురాణాలు' అని* ప్రచారంచేస్తూ వుంటారు! ఇతరులను నమ్మించటానికీ, తామూ అలా నమ్మటానికీ వీరుచేసే వ్యర్థప్రయత్నం!

ఇలాటివారంతా విస్మరించే మహాసత్యం ఒకటున్నది. మనిషి చేసే ప్రతీపనీ అతని మనస్సు మీద తప్పక ముద్ర వేస్తుంది! ఇది ఎవ్వరూ కాదనలేని ప్రత్యక్షసత్యం!

అలాంటప్పుడు 'చెడు' పనులు అనగా హత్యలు, ద్రోహము,

గర్భవిచ్ఛిత్తి ద్వారా చేసే బ్రహ్మహత్య, భ్రూణహత్య వంటి మహాపాతకాలు చేసినవారి మనస్సు మీద చెరగని 'వాత' పెట్టినట్లు బాధకలిగే అనుభూతిని ముద్రగా వేయటమేకాకుండా ఇలాంటివారివల్ల బాధలుపడి మరణించినవారి ఆత్మలు ఘోషగా ఏడుస్తూ, 'శాపనార్థం' లేక ''ఉసురు'' తగులుతూండటం వంటి - ''వ్యధ'' (Agony) యొక్క 'వైబ్రేషన్సు' వీరి ఆత్మలకు పైలోకాల్లోనించి, పంపించే ప్రేతాత్మలుగా నిలిచి వుంటాయి . భూమ్మీద జీవించే మనిషికి పదార్థమయ శరీరం అడ్డుగోడగా వుంటుందిగనుక విపరీతమ్మైన బాధగనక, ఒక పరిమితి దాటితే మరణిస్తాడు!

అదే మరణించిన వ్యక్తి ఐతే శరీరం మరణించింది గనుక అతని మానసికమ్మైన జీవుడు (ఆలోచనలకు నాశనంలేదుగనక, జ్ఞాపకాలకు అంతంవుండదు! భయాలకు నివృత్తిలేదు) పైపరిస్థితులను అనంతంగా టి.వి.లో సినిమాలోని దృశ్యాలవలే చూస్తూనే వుంటాడు, అనుభవిస్తూనే వుంటాడు. ఇదే నరకలోక జీవుని లేక ఆత్మలస్థితి!

''శరీరం మరణించిందిగదా! దాంతోనే ఆవ్యక్తి చేసిన పనులు కూడా నశించాలి కదా!'' అన్న సందేహం ఎవరికైనా కలిగితే — ఒక సినిమాగాని T.V.లో తీసిన దృశ్యాలు పూర్తిగా రికార్డు అయింతరువాత ఆ పాత్రలో నటించిన సినీ నటులు గనక మరణిస్తే ఈ పాత సినిమాలను మనం బొమ్మల రూపంలోనైనా మిగుల్చుకుని చూడగలగటంలేదా!

అలానే, పదార్థంతో తయారైన శరీరం పోయినతరువాత ఆ శరీరంలోని ఆలోచనలు నశిస్తాయని ఋజువుకాలేదు! 'ఆలోచనలు' లేక 'జ్ఞాపకాలు' (Memories) అనేవి ఒక కెమేరాలోని ఫిల్ము మీద పడే నెగెటివ్ ఫొటో (Negative Photo) వంటివి! ఈ నెగెటివ్ ఫిల్ము

ఉన్నంతవరకూ మనమామూలు ఫొటో నశించిపోయిన తిరిగి మళ్ళీ ప్రింటుచేసుకోవచ్చు కదా!

మామూలు వ్యక్తి గత జీవితం ఒకపాజిటివ్ (Positive) ఫొటోవంటిదైతే దీనికి కారణమైన అతని **జీవాత్మ** లేక అతని 'ఆలోచనలు'గాని, లేక అతడుచేసిన **కర్మలు** సినిమా ఫిల్మ్ మీద ప్రింటుపడిన నెగెటివ్‌ఫిల్ములాగా సౌండ్(Sound) రికార్డుతోసహా ఆకాశంలో రికార్డు చేయబడివుంటాయి. దీనినే ఆకాసపు రికార్డు (Akashic Record) అంటారు, అది ఇప్పుడు విదేశాలలో కూడా జరుగుతున్న ''ఆధ్యాత్మిక-పరిశోధనలలో'' తేలిన సైన్సు సత్యం!

ఇందులో మొదటిది మనిషియొక్క ఆత్మల ఫొటోగ్రాఫు తీయగల నెగెటివ్‌లూ, ఫిల్మును రూపొందించిన **కిర్లియన్ ఫొటోగ్రఫీ** (Kirlian Photography) ఋజువుచేసిన ప్రత్యక్ష సత్యం! ఎక్సరే (X-ray) ఫొటోతో మనిషిలోని లోపలి అవయువాలు ఫొటోగ్రాఫు తీసినట్టే కిర్లియన్ ఫొటోగ్రఫీతో అంతకంటే లోపలవున్న జీవాత్మను ఫొటోతీశారు. దీన్నిబట్టి **'శరీరం మరణిస్తే వ్యక్తి మరణించడు'** అని నిర్ధారణ ఐంది! కాబట్టి అతని జ్ఞాపకాల రూపంలో భయాల రూపంలో జుగుప్స రూపంలో అతడు చేసిన **చెడుకర్మ** యావత్తూ ఏమాత్రం చెరిగిపోకుండా వుంటుంది. అని జెన్నీ సాండర్స్, మైకేల్ గెల్లాండర్‌వంటివారిపై చికిత్స-పరిశోధనద్వారా ఋజువు అవుతున్నది. దీనికింత చాలు.

మరణించిన జీవాత్మ వెనుక నిలచి మిగిలివుంటే అతడు అనుభవించే నరకాలు అతడి బాధలు ఎలా వుంటాయి! కొద్దిపాటి గతజన్మల జ్ఞాపకాలతో అమెరికాలో చికిత్సపొందినవారి, కేసుల వివరాల ఆధారంగా గ్రహించవచ్చు! కాని, ఇలాగ జన్మలెత్తే అవకాశంకూడాలేని పాపాలు అనుభవించే, ఆత్మల మాటేమిటి!

బిషప్ లెడ్‌బీటర్ (Bishop Leadbeater) అనే క్రైస్తవ మతగురువు రష్యన్ యోగిని బ్లావెట్స్కీ (Blavatsky) అనుగ్రహంతో పరమ గురువులను దర్శించగలిగాడు. వారుచెప్పిన సాధనలుచేయగా అతనికి తాను జీవించివుండగానే తన శరీరాన్ని విడిచిపెట్టి పైలోకాలను ప్రత్యక్షంగా చూసి తిరిగి ప్రతీరోజూ నిద్రలేచే సమయానికి తిరిగి, శరీరంలో ప్రవేశించి ఆయావిషయాలను చూసింది చూసినట్లుగా గ్రంథస్థం చేశాడు. ఇలాంటి గ్రంథాలే 'ది ఆస్ట్రల్ ప్లేన్' (The Astral Plane), దేవయాన (Devayana) వంటివి సాధకులకోసం వ్రాసిన పాఠ్యగ్రంథాలు.

శరీరం విడిచి ప్రేతాత్మల లోకంలో ప్రవేశించగానే ఒక పెద్ద సముద్రం అడుగున మునిగీతకొట్టే వారికి కలిగిన దృశ్యాలలాగే కనిపిస్తాయి. నీళ్ళ అడుగున జలచరాలూ, తిమింగిలాలు, నాచు చెట్లు చీకటికోణాలు సొరంగాలు వున్నట్లే సరిగ్గా మరణించిన ప్రేతాత్మల లోకంకూడా కనిపిస్తుంది.

ఒక **'జలాంతర్గామి'** లేక (Sub-merine) సముద్రంలో మునిగీతలో ప్రయాణిస్తూంటే చుట్టుపక్కలవుండే సముద్రం అడుగుభాగంలోని జీవులలాగే కిటికీలలోంచి చూసినప్పుడు కనిపించినట్లు పై అంధకార-లోకాలు నరకలోకాలు అన్నీ, స్వయంగా దర్శించాడు బిషప్ లెడ్‌బీటర్ మహాశయుడు.

ఇలాగ ప్రేతాత్మల లోకంలోవుండే జీవులను స్థూలంగా

(1) భువర్లోకం అడుగు భాగం (Lower Astral World)

(2) సువర్లోకం మధ్య భాగం (Middle Astral World)

(3) మహర్లోకం ఉన్నత భాగం (Causal World)

(4) స్వర్గ లోకం (Devachan)

అంటూ అతడు వర్ణించాడు!

ఇందులో ముందుగా శరీరం వదలిపెట్టిన ప్రేతాత్మలలోకం హంతకులు, హత్యచేయబడిన ఘోరమైన బాధలను అనుభవించి మరణించిన జీవులు, అలాగే ఇంకా హింసకు తన్నుకుంటూ భయంకరంగా అరుస్తూ - తామెప్పుడో మరణించిన సంగతికూడా గుర్తించని దుర్భరమైన ఒక పీడకల (Night Mare) వంటి మానసిక సుడిగుండంలోపడి గింజుకుంటూంటారు.

ఆ స్థితిలో అలానే ఇరుక్కుపోయి ఇలాంటివారు వంద సంవత్సరాల దాకా ఊబిలో కూరుకుపోయిన దున్నపోతుల్లాగా ఇరుక్కుపోయి బాధలు పడుతుంటారని జపాన్ యోగి హిరోషి మోతోయామా తాను పరిశోధించిన నలభై వేలమంది (40,000) గతజన్మల అనుభవాలు ఆధారంగా అనేక వివరాలు ఇచ్చాడు.

ఇందులో ద్వేషంతో కచ్చతో మరణించినవారు తాము ద్వేషించే ఆ వ్యక్తినే ఊహించుకొంటూ మరణిస్తారు. కాబట్టి కలలోని చిత్రాలలాగే వారిని ఎదురుగా చూస్తూ ద్వేషిస్తూ అంతకంతకూ ఆత్మలో ద్వేషం పెంచుకుంటూ, దానితో వల్లమాలిన కక్షతో కరుడు కట్టుకుపోయి, తిరిగి జన్మించే అవకాశంకూడా కోల్పోతారు!

''పుట్ట-గతులుండవు'' అంటూ తెలుగులో వాడుక పదంగా ఇందుకే ఏర్పడిందేమో! అలానే తీవ్రమైన భయమూ, విపరీతమైన బాధా, వల్లమాలిన ద్వేషం, అణచుకోలేని కామం, వికారంలాగ పీడించే ఆస్తిడబ్బుపై ఆశ కూడా మరణించినవారి ఆత్మలను ఇలాంటి అధోలోకాలకు (Lower Astral Worlds) చేరుస్తాయి!

ఇలాటి 'జీవులు' ప్రతీరోజూ బిషప్ లెడ్‌బీటర్‌ను ప్రేతలోకంలో కలిసి తాము మరణించిన స్థలమూ, హత్యచేయబడ్డ పరిసరాలు,

హంతకుని వివరాలు తమ శరీరం పాతిపెట్టబడి వున్న ఎముకలువున్న గోరీలు స్మశానాలురోజూ అలాంటి ప్రదేశాలకు త్రిప్పిచూపిస్తూ వుండేవాయనకు!

ఇక ఈ భయంకర దృశ్యాలను అతను చూసి తట్టుకోలేని స్థితి కూడా వచ్చింది. ఇందులో **రెండవ** ప్రపంచ యుద్ధంలో మరణించిన సైనికులూ ఉరిస్థంభాలకు వ్రేలాడే హంతకులూ, చిత్రవధ చేయబడి పోలీసు హింసలలో మరణించే రాజకీయఖైదీలు, నేరస్థులూ, రహస్యంగా పనిచేసి గూఢచార్యులుగా చడీ చప్పుడూ లేకుండా అంతం చేయబడ్డ చరిత్ర హీనులు, దుర్భర జీవితంలో వ్యభిచారంతో సుఖరోగాలతో గుడిసెలలో బ్రతికి దారిద్ర్యంతో జీవించి మరణించిన వేశ్యలు, వారిని వాడుకొని నిర్దాక్షిణ్యంగా హత్యచేసిన ఘోర హంతకులూ ! ...... ఇంకా యితర వర్గాలవారు అందరూ యిలాటి హత్యలు చేసిన అధికారులు, సైనికులు, అలాంటి హత్యలకు ఆదేశించిన రాజకీయ నాయకులు మరణించిన దశాబ్దాల తర్వాత కూడా ఈ యమలోకంలోని విపరీతమైన బాధలూ, చిత్రహింసలూ ఇంకా ఇప్పటికీ పడుతూనేవుండటం **ప్రేతలోకాలను** దర్శించిన అనేకమంది యోగులు వ్రాసిన పుస్తకాలే ప్రత్యక్షంగా నిరూపిస్తున్నాయి. ఇక్కడ యింతకంటే వివరాలు యివ్వవలసిన పనిలేదు!

ఇక మధ్యలోకం (**Middle Or Higher Astral World**)లో వుండేజీవులు రెండవ తరగతి. వీరు మరణించి **గతజన్మల** జ్ఞాపకాల నుండి తేరుకోడానికి 'విశ్రాంతి' పొందుతున్న ఆత్మలు!

ఇందులో పైన చెప్పినంతటి మహా-పాపాలు చెయ్యకపోయినా ఆధునిక సమాజంలో సభ్యత, సంస్కారం డబ్బు హోదాల కోసం ధనవంతులు అధికారంకై తపించే రాజకీయవేత్తలూ వ్యాపారస్థులూ

పేరుప్రఖ్యాతులకై లేక ప్రమోషన్లకై దొడ్డిదార్లలో నడిచిన ఉద్యోగస్తుల్లా మేధావి వర్గంవారే ఎక్కువమంది ఈ లోకంలో కనిపిస్తారు.

వీరు క్రింది జీవితంలో బైట ప్రపంచంలో జీవించినప్పుడు లోపల అణచిపెట్టుకొని పైకిరాకుండా దాచుకుని చేసిన పాపాలు, యిప్పుడు శరీరం లేదు గనుక బహిరంగంగా బైటకు వస్తాయి ఆలోచనలరూపంలో పొగలాగా! వీరికి తగు సలహాలనిచ్చి వారి గత జన్మల ప్రవర్తనను బేరీజువేసి గుణపాఠాలను నేర్చుకొని తిరిగి చేసిన తప్పులను దిద్దుకోడానికి తాము అన్యాయం చేసినవారి ఋణం తీర్చుకోడానికి లేక తను గత శత్రువుల చేసివున్న దానినుంచి తగు శిక్షణను అనుభవించడానికి అవసరమైన జన్మలు వీరికి ముందుగా ప్లాన్ చేయడంలో వీరికి, తగు సలహాలు ఇవ్వబడతాయి.

వీరికి వెంటనే **జన్మ లభించదు** కొంతకాలం వేచి వుండాల్సివస్తుంది! ఎందుకంటే జన్మించడానికి సిద్ధంగావున్న ఆత్మలెందరో పెద్ద క్యూలో నిలబడివుంటారు పసిపిల్లల రూపం ధరించి!

అందరికీ పునర్జన్మ ఎత్తడానికి పర్మిషన్‌కూడా ఇవ్వరు!! ఇది చాలా అన్యాయంగా కనిపించవచ్చు! కాని తాము భూమ్మీద జీవించినప్పుడు ప్రపంచాన్ని పేల్చివేయాలనో లేక వేలమందిని నాశనం చేయడానికో లేక ప్రపంచాన్నే నాశనం చేయడానికి ప్రయత్నించి విఫలమైన వారికి (చెంఘిజ్‌ఖాన్, హిట్లర్, స్టాలిన్ వంటి మనకు తెలియని వారెందరో) తిరిగి జన్మించే ఛాన్సు యిస్తే మిగతా ప్రపంచానికి తీరని అపకారం జరుగుతుంది. వీరికి ఆ స్వభావంమారి మారడానికి పదకొండు వందల సంవత్సరాలనుండి రెండు, మూడు వేల సంవత్సరాలు కూడా పట్టవచ్చు!

ఇకపోతే మిగతా జీవులు రానున్న జన్మలలో బంధువులుగా భార్యలుగా తల్లిగా తండ్రిగా ఏర్పడవలసిన జీవులసేకరణా వారిలో తగిన అనుభవాన్ని పొందే పరిస్థితుల ఏర్పాటూ, వాటికి తగిన గ్రహస్థితి ఏర్పడి తగు జాతకం ముహూర్తం కుదిరేదాకా వేచివుండాలి. అంటే ఒక వ్యక్తి కర్మను బట్టి అతనికి అవసరమైన కష్టసుఖాలు అనుభవింపజేసే గ్రహస్థితి గల జాతకం ఏర్పడ్డప్పుడే ఆ జీవుడు తల్లిగర్భంలో ప్రవేశిస్తాడు. ఇలా కర్మలు జన్మలు జాతకాలు ముడిపడి వున్నాయి. ఇది నాడీ గ్రంథాలలోని పూర్వజన్మ చరిత్ర ఋజువుచేసే ప్రత్యక్షసంగతి.

ఒకడు దుర్భర దారిద్ర్యం అనుభవించాల్సిన కర్మ వుందనుకుందాం. వాడు ధనవంతుని కుమారుడిగా జన్మిస్తే ఆ ఫలితం కుదరదు! అందుకని తగు బీదవాడు తలిదండ్రులుగా జన్మించే వీలున్న దంపతులు ఎంపిక చేసి దానికి సరిపోయిన గ్రహస్థితులు సమకూడినప్పుడే వీరికి జన్మించే అనుమతి లభిస్తుంది. ఎక్కువగా ప్రేమించినవారు, ఎక్కువగా ద్వేషించినవారు తరచూ భార్యాభర్తలుగా జన్మిస్తారు. అప్పుడే ఒకరితో ఒకరు తరచూ కూడావుండి వీరిని వారూ, వారిని వీరు బాధించుకునే అవకాశం లభిస్తుంది. జపాన్ యోగి మొతోయామా చూసిన అనుభవాలలో కూడా ఎక్కువమంది భార్యాభర్తలుగా ఒకరిని ఇంకొకరు గతజన్మలో హత్యలుచేసినా మోసంచేసినా హింసించినా ఆ 'కర్మదేవత' తీర్పులో దానికే జన్మిస్తారు! మొతోయామాకు తన తల్లిదండ్రుల జన్మరహస్యం కూడా యిలాగే కలిగింది. ఆయన తన అనుభవాల్లో దాచకుండా వ్రాశాడు.

మరణించి తిరిగి జన్మించడమే కాక యిటీవలి కాలంలో కొందరు అకస్మాత్తుగా గుండె ఆగి మరణస్థితిని పొంది ఆతరువాత వైద్యంవల్లనో యింజక్షన్ వల్లనో లేక యాదృచ్ఛికంగానో తిరిగి బ్రతుకుతారు. ఇలాంటి

వారి అనుభవాలను సేకరించి కొందరు డాక్టర్లు వారి యదార్థ అనుభవాలను ప్రచురించారు. మరణించిన తరువాత ఏమైంది! ఎవరిని కలిసిందీ క్రిందటి జన్మలో జరిగిన మంచిచెడు విశ్లేషణ అందులో తమ పని పూర్తి గాక యింకా ఏమి మిగిలివుందో అది తెలిపి వెనక్కి పంపి తిరిగి శరీరంలో జీవించినవారి అనుభవాలెన్నో ఈ అధ్యాయం చివర 'పరిశోధనా గ్రంధాలు' అన్న పట్టికలో ఇచ్చాను.

కాబట్టి 'నరకాలు' అనేవి సైన్సుపరంగా రూఢి అయిన యదార్థసత్యములు. ఈలోకాలగురించే వేదము, పురాణాలూ ఋషీశ్వరులు దివ్యదృష్టితో దర్శించిన సంగతులు వేరే ఇంకో అధ్యాయంలో గమనిద్దాం!



# 17

# ధ్యానంతో రోగుల 'గతజన్మ'ల్ని చూసే జపాన్‌యోగి 'మోతోయామా'!

మానవుడు జన్మించేది స్థూలశరీరంలోనే! ఈ భూమిమీద రక్తమాంసాలతో ఒక ఆకారం ధరించి జన్మించాలి! ఇది భగవదవతారానికీ, సామాన్యమానవుడికీ ఒక్కటే! పైకిమాత్రం శరీరం ఒక్కటిగానే కనిపిస్తుంది, పదార్థమయంగా! కాని ఈ శరీరంలోకి దిగివచ్చే 'ఆత్మ' పైనుండి ఎక్కడినుండి దిగివస్తుందో - అందులోనే వుంటుంది తేడా అంతా! ఈ తేడా ఏమిటో మనకి విమర్శనాత్మకంగా బోధపడాలంటే మామూలుగా మనిషిపుట్టడం, మరణించడం ఎలా జరుగుతాయో తెలియాలి.

మనిషి శరీరంతో జన్మించేముందు 9 నెలలకు పూర్వమే తలి

గర్భంలో ప్రవేశిస్తాడు. అంటే మనిషి 271 రోజులముందే ఆ జీవుడి అంతరాత్మ జన్మిస్తుందన్నమాట! మామూలు మనిషికి అయితే ఆ శరీరంలో ప్రవేశించే 'ఆత్మ' గతజన్మలో ఏ స్థాయికి చెందినదో అదే రకమైన మనిషిగా జన్మిస్తాడు. అంటే మరణించినందువల్ల ఒకమనిషికి ప్రత్యేకమైన ఆధ్యాత్మికజ్ఞానం ఏమీ కలగదు అజ్ఞానంలో మరణిస్తాడు కాబట్టి ఈ స్థూలశరీరంలో జన్మించే ప్రక్రియలలో లోపల జీవాత్మ మట్టికాయలో విత్తనంవలే తల్లి గర్భంలో ప్రవేశిస్తాడు నాలుగవమాసంలో! అంతకుముందు 3 నెలలకు పూర్వమే తండ్రిలోకి ప్రవేశిస్తాడు! తొమ్మిదినెలలు పిండోత్పత్తి క్రమంలో పెరిగి ఆ తర్వాత తన సుఖదుఃఖాలకు అనువైన గ్రహస్థితి ఏర్పడిన రోజున తన గతకర్మకు అనుకూలమైన జాతకంతో జీవుడుగా జన్మిస్తాడు.

అనగా ఆ జీవుడు జన్మించడంలో అతనికి ఏవిధమైన స్వేచ్ఛకాని, స్వాతంత్ర్యం గాని వుండదు. గాలిలో తేలి ఎగిరిపోయే ఆకులు, గడ్డి, ధూళివలే కాలంవల్ల నెట్టబడి కర్మవల్ల ముందుకు తొయ్యబడి ఈ జీవులు పైనుంచి క్రిందకు వర్షపు చినుకులవలే వందలు, వేల సంఖ్యలో దిగివచ్చి శరీరాలలో దూరి జన్మిస్తాయి !

ఇలాగ జన్మించడానికి పూర్వస్థితిలోవున్న ఆత్మలను ప్రసిద్ధజపనీస్‌యోగి మోతోయామా (Hirroshi Motoyama) ధ్యానస్థితిలో దర్శించి, వారి గత చరిత్రనూ ఏకారణంచేత వారు తిరిగి ఈ తల్లిదండ్రులకు ఈ కుటుంబంలో జన్మిస్తున్నారో దానికిగల హేతువులను పరిశోధించాడు! ఆ పరిశోధనల ఫలితాలే మనకు వెలుగుబాటను చూపిస్తాయి!

మోతోయామా తల్లిదండ్రులదే విచిత్రజననం! వారివురికీ ఒక్క క్షణం కూడా పడేదికాదు. అంతేకాదు రోజూ భరించలేని కష్టాలతో, రోషంతో అతడి తండ్రి మోతోయామా తల్లిని తిట్టడం, నానావిధాలుగా

హింసించడం జరిగేది. చాలారోజులు రక్తం కనిపించేలా ఆమెను బాధించడం పసివాడైన మోతోయామా నిత్యం చూస్తూనే పెరిగాడు!

సహజంగానే తల్లిదండ్రుల సమస్యపై దీర్ఘాలోచనలోపడ్డ మోతోయామా పసివయస్సులోనే మనుషులు ఇలాగ ఎందుకు భార్యాభర్తలుగా జన్మిస్తారో? వారి కష్టసుఖాలకు కారణమేమిటి అన్న సమస్యతో యోగసాధనలో దిగి అనేక దివ్యస్థలాలను దర్శించి చాలా ఏళ్ళు సాధనచేసి చివరకు భారతదేశంకూడా వచ్చి యోగాభ్యాసం నేర్చుకొని యోగసిద్ధిని కూడా పొందాక కనుగొన్నాడు!

తన తల్లీతండ్రీ ఇలా శతృవులుగా ఎందుకున్నారు? వారు భార్యాభర్తలుగా ప్రేమించి ఎలాగ పెళ్ళి చేసుకున్నారు? అన్నది మోతోయామా తెగని సమస్య!

## ధ్యానసమాధిలో - యదార్థం!

ఒకరోజు తల్లి బాధలను చూసి సహించలేక మోతోయామా ఆమెను తీసుకొని ఆలయంలోకి వెళ్ళి ధ్యానంలోకి వెళ్ళి భగవానుని ప్రార్థించాడు. చాలాసేపు ఆమె అంతరాత్మపైన, తన మనసు ఏకాగ్రంచేసి జన్మరహస్యం తెలుసుకోవాలని ధ్యానసమాధిలోకి వెళ్ళి దర్శించాడు. అప్పుడు అతనికి కనిపించిన సత్యం అతి విచిత్రమైనది.

దాదాపు 200 - సంవత్సరాలకు పూర్వం జపాన్ రాయబారిగా కొరియానుండి ఒక ఉన్నతాధికారి రావడం జరిగింది. అతడు త్వరలోనే జపాన్‌రాజు, రాణితో స్నేహం పెంచుకొని ఎంతో సన్నిహితుడయ్యాడు! దానితో జపాన్ ప్రభుత్వంలోని రహస్యాలన్నీ ప్రతీ ఒక్కటీ ఈ రాయబారికి తెలిసిపోయాయి. ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాక అతడు తిరిగి కొరియాకు ప్రయాణమైవెళ్ళే తరుణంలో జపాన్‌రాజువద్ద

మంత్రిగావున్న వ్యక్తి - మన ఇతడికి ప్రభుత్వరహస్యాలెన్నో తెలుసు కనుక ఇతడివల్ల ఎప్పటికైనా జపాన్‌కు ప్రమాదం కొరియానుండి యుద్ధంవల్ల సంభవించవచ్చు అని ఆందోళనపడి ఆ రాయబారికి ఇచ్చిన విందులో విషం పెట్టాడు.

చావుబ్రతుకులమధ్య కొట్టుమిట్టాడే అతనికి ఆఖరిక్షణంలో ఏం జరిగిందో తెలిసింది కక్షతో ద్వేషంతో కుమిలిపోతూ ప్రతీకారంకోసం దేవుని ప్రార్థిస్తూ మరణించాడు! మరణించే సమయంలో **జపాన్ ప్రభుత్వం మీదే తన ఆలోచనలన్నీ** కేంద్రీకరించి మరణించటంవల్ల అతడి ఆత్మ ''నరకలోకం''లో కుమిలి, **150 సంవత్సరాల తరువాత** జపాన్‌లో తిరిగి జన్మించింది.

అలానే మరికొంతకాలానికి విషప్రయోగం చేసిన ఉన్నతాధికారి కూడా తాను చేసిన పనికి పాపభారంతో మరణించి అతని ఆత్మ నరకలోకంలో విలవిలా తన్నుకుంటూ బాధలు పడింది — సరిగ్గా **విషప్రయోగం జరిగినవ్యక్తి మరణించే బాధలాగే!**

చివరకు ఆ మరణించిన వ్యక్తిపై **సానుభూతితో** తనప్రాణాలను విడిచిపెట్టడంవల్ల మరుజన్మలో స్త్రీశరీరంలో జన్మించాడు — మోతోయామా తల్లిగా! ఇదీ వారి జన్మల వెనుక జరిగిన కర్మల చరిత్ర!

ధ్యానంలో దీనిని దర్శించి మోతోయామా ఆశ్చర్యపోయాడు! ఈశ్వర సంకల్పానికీ, **కర్మయొక్క** గతి **నల్లనిపొగలాగ** — **''చెడు-కర్మ''** —

ఈ జన్మలోకూడా మోతోయామా తండ్రి తల్లిపై ద్వేషంతో కక్షతో కూడిన నల్లని సీసం పొగ వంటి చెడుకర్మ (ద్వేషం) తేజస్సు వుండేది. అలాగే తన తల్లిశిరస్సుపైన గతంలోచేసిన పాపం బరువుగా తలదించుకునేలా చేసిందీ! తండ్రి ఎంతహింస పెట్టినా, ఎన్ని

అవమానాలపాలు చేసినా నోరుమూసుకని అనుభవించాల్సిన పరిస్థితి కల్పించిందీ!

ఈ కర్మ కరిగే వరకూ తల్లికి బాధలు తప్పవు అని గ్రహించాడు మోతోయామా! ఆ తర్వాత చెడుకర్మను కరిగించే ఒక శక్తివంతమైన మంత్రాన్ని తన తల్లిచేత జపం చేయించి ఆమెకూ తండ్రికీ - అర్థం అయ్యేలాగా వారి పూర్వజన్మల వృత్తాంతం తెలియజెప్పాడు!

అలాగే తండ్రికి కూడా తగుకర్మ నివారణకై సాధనను, ధ్యానాన్ని చేయించాడు! ఆశ్చర్యంగా కొద్దినెలల్లోనే ఒకరిమీద ఒకరికి వున్న ద్వేషం మంచులా కరిగిపోసాగింది! తండ్రి తల్లిగురించి పట్టించుకోవడమే మానేశాడు - ఉదాసీనంగా!

ఇలావుండగా వున్నట్టుండి తండ్రికి ఉదరంలో క్యాన్సరు వ్యాధి సోకింది! డాక్టర్లు అతడిక మరణిస్తాడని చెప్పారు! దిగులుతో మృత్యుభయంతో క్రుంగిన తండ్రి మోతోయామావద్దకు వచ్చి వృద్ధాప్యంలో సానుభూతిని, కొడుకు సహాయాన్ని కోరాడు!

మోతోయామా తాను ధ్యానంలో చూసిందానికి ఆశ్చర్యపోయాడు! అతనికి కనిపించినదేమిటంటే తాను తండ్రిచేత చేయించిన జపధ్యానాల ఫలితంగా పూర్వజన్మలో ఆయన ఏర్పరచుకొన్న కక్షకారణం తెలియగానే సాధనశక్తివల్ల 'పాపం'-కాస్తా కరిగిపోయింది. అలాగే తన తల్లికూడా విషప్రయోగ హత్యచేసిన కర్మ అనేక సంవత్సరాలు యమబాధలుపడి అనుభవించాల్సిన చెడు'కర్మ' - ఆమెచేసిన జపంవల్ల, పశ్చాత్తాపంవల్ల, దాన ధర్మాలవల్లా మటుమాయం కాసాగింది! — ఇంకనుంచీ, ఇద్దరూ మిత్రులుగా, భార్యాభర్తలవలే మసులుకోబోయేలోగానే తండ్రికి మరణించే సమయం దగ్గరపడిందని — ఆయన ఆత్మను ధ్యానంలో యోగంలో దర్శించిన మోతోయామాకు స్పష్టంగా తెలిసింది. దీంతో, విషాదం

క్రుంగదియ్యగా మోతోయామా — ఇలాగవటానికి 'కారణం'కై ధ్యానించాడు 'కారణాత్మ'లుండే లోకంలోకి ధ్యానంలో వెళ్ళి!

## ఋణం — తీరిపోవటం !

ఆ **కారణం** మరింత ఆశ్చర్యకరంగా కనిపించింది! వారిద్దరూ భార్యాభర్తలుగా జన్మించడానికిగల '**కారణం**' ఒకరిపై ఒకరికి గల ద్వేషమే! గత జన్మలో బాధించినదానికి ప్రతిఫలంగా ఇద్దరూ భార్యాభర్తలుగా జన్మించారు! వారి, సాధనవల్ల చెడుకర్మ తొలగిపోగానే — ఇద్దరికీ **భార్యాభర్తలుగా నిలిచి వుండే కర్మనశింపు అయిపోయింది!** ఇద్దరి ఆత్మలూ వేరే ఎవరి దారివ వారు ప్రయాణించాల్సివుంది!

ఇది తండ్రికి చెప్పి, **మరణానికి సిద్ధం కావలసిందని** దైవం నిర్ణయం మంచికేననీ ధైర్యం చెప్పాడు! దానికి ఆయన తండ్రి — "నాకు చావుకు భయంలేదు కాని ఈ **క్యాన్సరు బాధ భరించలేకుండా వున్నాను**"! అని వాపోయారు! కడుపులో క్యాన్సరు (గతజన్మలో విషం ప్రయోగించినచోటనే ఉడికిపోతూ) బాధిస్తోంది!

దానికి మోతోయామా తానేప్రత్యేకంగా తండ్రికై ఉపవాసంచేసి జపధ్యానాలు ప్రారంభించాడు! రెండుమూడు వారాలలో **ఆయన బాధ, నొప్పి పూర్తిగా సర్దుకున్నాయి!**

రోగం తగ్గినందుకు ఆనందిస్తున్న తండ్రితో మోతోయామా - "ఇది **నివారణ మాత్రమే!** మీ జీవితం ఇంక మిగిలివున్నది, కొద్దికాలమే"! అన్నాడు విచారంగా!

అలాగే వారంరోజుల్లో ఏ **రోగమూలేని** మోతోయామా తండ్రి ఉదయమే దైవప్రార్థన చేసుకొని భోజనంచేసి విశ్రాంతిగా మరణించాడు!

## "ప్రారబ్ధం!" — శిరోధార్యం :-

'దృఢకర్మ'ను ''నివారణకాని (తండ్రి మరణంలా) కర్మను ఇలాగ సాధనతో ప్రతీవారూ కావాలంటే బాధను మాత్రం తగ్గించుకోవచ్చు''! — అంటాడు జపాన్‌యోగి హిరోషి మోతోయామా!

ఇక్కడ మనకి తెలిసే విషయం ముఖ్యమైనది — ప్రతీ మనిషీ ఈ ప్రపంచంలోకి జన్మించేది తన గతకర్మనను, దాని ఫలితాలను అనుభవించడానికే! ఇది ఎంత గొప్పవ్యక్తి అయినారే! చివరికి, ప్రధానులు, రాష్ట్రపతులు, యోగులూ, బాబాజీలకూ వారి గతకర్మలను అనుసరించే ఇప్పటి జీవితం నడుస్తోంది! యోగసాధనతో వారి ఆత్మను దర్శించితే వారి కర్మ ఏమిటో, వారికి ఈ జన్మలో భవిష్యత్తులో ఏమి జరగనున్నదో తెలుస్తుంది అంటాడు మోతోయామా!

కాని, భగవంతుని అవతారంమాత్రం గతజన్మ కర్మ ఏమీలేకుండానే కేవలం తనయొక్క సంకల్పంచేత పైలోకాల్నుంచి దిగివస్తుంది! ఇలా దిగివచ్చే అవతారాలు కూడా వేరువేరు అంతస్థులుగా వుంటాయి! కారణజన్ములు, భగవంతుని దూతలు, అంశావతారాలు పరిపూర్ణ సాక్షాత్తు భగవంతుని అవతారాలు! పేజీలు పెరగకుండా సంగ్రహంగా చెప్పాలంటే - పరశురాముడు వంటివి ఆవేశావతారాలు - ఆయన మహాభారతకాలం వరకూ జీవించివున్నా భగవంతుని అవతారం ఆయనలోనుంచి పనిచేసింది మాత్రం శ్రీరాముని శివధనుర్భంగం దాకానే! ఒక ప్రత్యేకవ్యక్తిద్వారా భగవంతుని కళ ప్రవేశించి తిరగి ఆ వ్యక్తిని వదిలివేస్తుంది! అంశావతారములు వ్యాసమహర్షి, సిద్ధగురువు కపిలాచార్యులు, యోగనాథుడు, దత్తాత్రేయుడువంటివారు! వీరు మానవులు కాదు! పైలోకాల నుండి దైవకార్య నిమిత్తం మానవలోకంలో అవతరిస్తారు! వారివారి కార్యాలను నిర్వహిస్తారు ! వీరిలో అందరూ భగవదవతారంలోని అన్ని అంశలనూ కలిగివుండరు! కొన్ని లక్షణాలు మాత్రమే వ్యక్తమవుతాయి! వీరిలోపల అంతరాత్మమాత్రం పరిపూర్ణ భగవత్‌జ్ఞానంతో

వుంటుంది! వేదాలు; పురాణాలు, మహాభారతం, భాగవతం, మానవజాతిని ఉద్ధరించడానికి ఒక్క చేతిమీద వ్రాసి అందించిన వ్యాసభగవానుడు ఇట్టి అంశావతారమే! పోతే కారణజన్ముల సంగతి వేరు!

## కారణ జన్ములు :

అవతార సిద్ధాంతం గురించి ప్రసంగం వచ్చినపుడు - మామూలు జీవులకాని (గతకర్మను అనుభవించటానికే జన్మించేవారు కాకుండా) ఈ లోకంలో జన్మించే ప్రత్యేక ఆత్మలు గురించి తెలియచేస్తాను!

కేవలం భగవంతుని అవతారమేకాకుండా ఈ ప్రపంచంలోకి జన్మించే మహాత్ములు, ఋషులు, పరమగురువులు, జీవన్ముక్తులు, నిత్యముక్తులు ప్రపంచంలో మానవజాతికి ఆధ్యాత్మిక సాయం చేయ్యడంకోసం జన్మిస్తారు. వీరిలో పరిపూర్ణ బ్రహ్మజ్ఞానం కలిగినవారు, భక్తివైరాగ్యములను ప్రపంచంలో ప్రవర్తింపచెయ్యడానికి వచ్చేవారు, ఇలాగ అనేకమంది కారణజన్ములు పుడతారు. వీరందరూ సాక్షాత్తూ భగవంతుని అవతారములోనుండి అంటే సాక్షాత్తు భగవంతుని అవతారాలే కాకపోయినా భగవదనుభవాన్ని ఎలా అందుకోవాలో మానవజాతికి ట్రైనింగ్గా నేర్పిస్తారు! ఈ కారణజన్ముల గురించి కొన్ని ఆసక్తికరవిషయాలు చాలమందికి తెలియవలసి వున్నాయి!

ఈ బ్రహ్మాండం అంటే - మన చుట్టూవున్న ప్రపంచం కంటికి కనిపించే ఆకాశము, నక్షత్రాలు, సూర్యచంద్రులూ గాలిమాత్రమే కాదు - ఇంకా చాలావున్నది.

కంటికి కనిపించే ఆకాశానికిపైన శక్తితరంగాలు అనగా విద్యుత్తు (Electricity) అయస్కాంత కిరణాలు (Magnetic Waves) కాంతికిరణాలువంటి శక్తుల స్పంధనలతో నిండివుండే శక్తిసముద్రం (Ocean of Energy) నిత్యం స్పందన అలలుగా స్పందిస్తూ వుంటుంది. ఇవి పైకి

పోయినకొద్దీ స్వచ్ఛమై (Transparant) మరింత ఉన్నతమైన ఆధ్యాత్మికశక్తితో నిండివుంటాయి!

మానసిక తరంగాలు అంటే మన మనసు కాకుండా మెదడులో తిరిగే ఆలోచనలవంటివి ఈ ఆకాశంపైనవుండే బ్రహ్మాండములో వున్నది. ఈ విశ్వానికి మనస్సు వంటిది (Universal Mind) దానిలో పైకిపోతే గతంలో యోగసిద్ధిని పొందినవారు ఆకాశంలో కూర్చుని ధ్యానిస్తూవుంటారు! ఈ లోకాలు రంగురంగులుగా ప్రత్యేకత కలిగివుంటాయి! ఇందులో తమలోకాలలో వుండే సిద్ధులు కొందరు పరమానందంలోతేలియాడుతూ భక్తిపారవశ్య సముద్రంలో జుర్రుకుంటూ అందులోనే కరిగిపోతూ మునిగితేలుతూవుంటారు! ఇంకా పైకిపోతే గతకర్మలు అన్నీ నశింపుచేసుకొని కర్మను జయించి దేవలోకంలో నిత్యనివాసం - సిద్ధింపచేసుకొన్నవారుంటారు! ఇంకా పైకిపోతే కేవలం సత్యలోకం అంటే శాశ్వతసత్యం సూర్యునికంటే వేయిరెట్లు కాంతితో వెలగిపోతూవుంటుంది! ఇలా పైనవున్న అంతస్తులన్నీ వేదాలలో ఏడులోకాలని వర్ణించారు! ఇలానే పాపాలు చేసినవారి ఆత్మలుకూడా రకరకా చీకటిలోకాలు శిక్షలు, యమయాతనలు, బాధలు భయాలతో నిండివుండే లోకాలు వున్నాయి! మరణించిన తర్వాత అనేకమంది జీవులు వారుచేసిన నేరాలకు బాధలు అనుభవిస్తూ ఈ లోకాలలో యమయాతనలు పడుతూవుంటారు! ఇలాంటి జీవులను ఎంతమందినో జపాన్‌యోగి మోతోయామా తన ధ్యానంలో దర్శించినవారికి తమ పాపంనుండి, చెడుకర్మనుండి బయటపడే సహాయంచేసి, ఆ జీవులకు మళ్ళీ మనుషులుగా జన్మించే అవకాశం కల్పించాడు!

ఇలాపైన వున్న అనేక లోకాలలోంచి ఆయా ఆత్మలు ఈ భూమిమీద జన్మిస్తారు! ఈ పుణ్యలోకాలలోనుంచి జన్మించే మహానుబావులు కర్మకారణంగా జన్మించరు. వారికి ఈ క్రింద మానవులు

పడే బాధలుచూసి జాలికలిగి మానవజాతికి సహాయం చేసే నిమిత్తం దయతో మనమధ్య జన్మిస్తారు! ఎన్నెన్నో బాధలుపడటానికి కూడా సిద్ధమై జన్మిస్తారు మనకోసం! ఇలాంటి వారే **'కారణజన్ములు'** ! ఈ కోవకి చెందినవారినే వేరువేరు గ్రంథాలలో **'భగవంతుని దూతలు'** లేక ప్రవక్తలు (రసూల్ మెస్సయ్య) ప్రత్యేకబుద్ధులు వైష్ణవులలో ఆళ్వార్లు, దివ్యసూరులు, సిక్కు-మతంలో గురువులూ, సంతులు అని వేర్వేరు పేర్లతో ఆభాషలలో వ్యవహరించేది ఈ రకమైన ''పైలోకాలనుంచి దిగివచ్చే'' కారణజన్ములనే!

వీరు దిగివచ్చే సమయం దైవనిర్ణయం ప్రకారం ఏర్పడివుంటుంది! లేదా భూమిమీద ఏర్పడిన అవసరంబట్టి భక్తులు, సాధువుల, అమాయకుల బాధలనుబట్టి అవసరార్థం ఒక్కొక్క కారణంవల్ల జన్మిస్తారు! కనుకనే వీరు కారణజన్ములు! ఆ పని పూర్తికాగానే వీరు తమ శరీరం విడిచిపెడతారు! ఏలోకంనుంచైతే వస్తారో తిరిగి ఆయాస్థానాలకు చేరుకుంటారు! ఇలాంటివారు భూమిమీద చేసే యజ్ఞాలు, యాగాలు, ప్రతిష్ఠలు, జపధ్యానాదులు ఇలాగ ఎంతో పుణ్యాన్ని వృద్ధిచేస్తారు! దానివల్ల వీరికి కలిగే లాభం ఏమీ తీసుకోరు! అలానే ద్రోహులను లోకాన్ని పీడించేవారిని, అత్యవసరంగా తప్పనిసరిగా శిక్షించవలసివచ్చినపుడు లోకహితం కోసం వీరు ఎవరికైనా ఎంతశిక్షనైనా వేయగలరు! వారిని అంతమొందించనూ కలరు. కాని దీనివల్ల వీరికి ఏ పాపమూ చెడుకర్మ అంటరు! ఒకప్పుడు వీరు బ్రహ్మచారులుగానూ, ఇంకొక జన్మలో గృహస్థులుగానూ వేరొకజన్మలో సన్యాసులుగానూ, ఇంకొక జన్మలో ప్రజానాయకుడుగానూ మరొకసారి తపస్సు చేసుకునే యోగులు, సాధువులుగానూ జన్మించవచ్చు! ఎలా జన్మించినా వారు మాత్రం సామాన్యమానవులుకారు! వీరిలో ప్రత్యేకమైన తేజస్సు అపరిమితమైన

తపశ్శక్తి అసాధారణమైన జ్ఞానము, సామాన్య మానవుడికిసాధ్యంకాని, దయ, జాలి కలిగివుండినిత్యమూ ఆనందస్వరూపులై ప్రపంచంలో అందరినీ ప్రేమిస్తూవున్న ఏ ఒక్కరికీ అంటకుండా తామరాకు మీద నీటిబొట్టువలే జీవిస్తారు! వీరు ప్రతీవారిలో భగవంతుని దర్శిస్తారు! వీరిని చూసిన ప్రతీవారికీ వీరిలో భగవంతుడే గోచరిస్తాడు! దీనినిబట్టి వీరు కారణజన్ములు, మామూలు కర్మజీవులుకాదు, అని తెలిసి వారిని స్థిరబుద్ధితో శరణుపొందినవారినవీరు అరనుగ్రహించి ఉద్ధరిస్తారు! వారి పాపాలను నాశనం చేస్తారు! అయితే వారి ఆజ్ఞలు అనుసరించి తు.చ. తప్పకుండా చేసేవారికే వీరు చేసే ఉపకారం దక్కుతుంది!

ఇలాంటి వారిలో శ్రీరమణమహర్షి, వివేకానందుడు, శ్రీరామకృష్ణ పరమహంస, మాస్టర్ సి.వి.వి., మెహర్‌బాబా, సంత్‌జ్ఞానేశ్వర్, సమర్థరామదాసు, శ్రీరామనుజాచార్యులు, మధ్వాచార్యులు, ఆదిశంకరాచార్యులు, చైతన్య మహాప్రభువు, అక్కల్‌కోట మహారాజు, శ్రీలాహిరీ మహాశయుడు, శ్రీయుక్తేశ్వర్గిరి, శ్రీఅరవిందయోగి, పాండిచ్చేరి మదర్, మీరాబాయి, అక్కమహాదేవి ఇంకా ఇలాంటి మహాత్ములు అనేకచోట్ల అనేక కాలాలలో జన్మించారు! ఇట్టివారే కారణ జన్ములు అంటే! (ఇలాంటి మహాత్ముల జీవితాలు భగవంతుని దీపాలు అన్న గ్రంథంలో చూడవచ్చు చివరపేజీలో అనుబంధం చూడండి!)

వేదకాలంనుంచీ పరంపరగా వస్తున్న మన హిందూసంగాంగంలో - ముఖ్యమైన అంశావతారాలు జన్మించిన తిథులు, ఏరోజున ఏనక్షత్రంలో ఏ మాసంలో ఏ అవతారం వచ్చిందో అన్నీ నమోదు చేయబడివున్నాయి! ఈ విశేషాలనుబట్టి జ్యోతిష ఖగోళ గణితం ద్వారా వెనక్కి లెక్కవేయగలిగితే ఆయా అవతారములు వచ్చినతేదీలు సైన్సుపరంగా నిర్దుష్టంగా ఋజువు చేయవచ్చు! ఇలాగ నేను శ్రీకృష్ణావతారం జననతేదీని

సంస్కృత మహాభారతంలో తిధివార నక్షత్రాలు తెలిపిన శ్లోకప్రమాణం ఆధారంగా నిర్ణయించాను! ఇది సంగ్రహంగా 'మహాభారత కాలనిర్ణయం' - అన్న గ్రంధంలో చూడవచ్చు! ఇప్పుడు మనకు దశావతారములు ఏ తిధులలో ఏ అవతారం వచ్చిందో మన హిందూపంచాంగం స్పష్టంగా రికార్డు చేసివున్నాయి!

ఉదా. కృతయుగాంతం జరిగినరోజున అంటే శ్రావణ బహుళాష్టమి, మళ్ళీ ద్వాపరయుగంలో శ్రీకృష్ణావతారం వచ్చింది!

ఉదా. చైత్రబహుళ తదియ, పూర్ణిమ వెళ్ళిన మర్నాడు మత్స్యావతారం రావడం జరిగింది! ఈ మత్స్యావతారం రెండు విధాలుగా వచ్చింది (1) ఈ బ్రహ్మకల్పం పూర్తికాగానే బ్రహ్మ యోగనిద్రలోకి ప్రవేశించినపుడు వేదాలను సోమకుడనే రాక్షసుడు అపహరించగా విష్ణుమూర్తి మత్స్యావతారంతో అవతారమెత్తి ఆ సోమకడిని సంహరించి ఆ వేదాలను రక్షించి తిరిగి బ్రహ్మకు ఆయన నిద్రలేవగానే అందచేస్తాడు! ఇది బ్రహ్మకల్పాంతంలో వచ్చే మహామత్స్యచరిత్రలోని మత్స్యావతరాం! ఈ సమయంలో రేవతీ నక్షత్రం చివరిభాగంలో అంటే మీనరాశి, ఆఖరి బింధులో సూర్య, చంద్ర, బుధ, శుక్ర, కుజ, గురు, శని, కేతువుల కలయిక జరిగినపుడు ఈ మహాత్స్యావతారం రావడం జరిగింది! ఇవి ప్రస్తుత కల్పారంభంలో జరిగిన ఖగోళ గణితంతో ఈ తేదీని వెనక్కి లెక్కిస్తే ఈ మహామత్స్యావతారం ఇప్పటికి 19, 75, 71, 98, 60 సంవత్సరములు అనగా మహామత్స్యావతారం జరిగి 197 కోట్ల సంవత్సరాలన్నమాట!

ఒకపోతే మీనావతారంగా విష్ణుమూర్తి వైవస్వత మనువు, ఏడుగురు మహర్షులను కలిపి ఒక పెద్దనావలో రిక్షించి జలప్రళయం వల్ల ఈ భూమిపూ మానవజాతి అంతరించిపోకుండా కాపాడిన అవతారం! ఇది వైవస్వత మన్వంతరం ప్రారంభంలో వైవస్వత మనువు దక్షిణ దేశంలో

ద్రవిడ భూపాలుడుగా పాలిస్తున్న రోజులలో జరిగింది! కాబట్టి మత్స్యావతారం గురించి రెండు అవతారాల తేడా గమనించాలి (ఒకటి) బ్రహ్మకల్పంలో వచ్చినది - రెండవది మనువులలో ఏడవవాడు వైవస్వతుడు. ఇతడు సూర్యవంశానికి మూలపురుషుడు! ఇక్ష్వాకుని తండ్రి. ఈ మత్స్యావతారం కథ మహాభారతంలో, రామాయణంలో, భాగవతంలో ఇంకా పూర్తి వివరాలతో మత్స్యపురుణంలోనూ ఇవ్వబడింది!

మనిషి జన్మలు కర్మలు ఎలా ఏర్పడతాయో గమనించాము! ఈపునర్జన్మల సిద్ధాంతాన్ని గురించి కొందరికి కలిగిన సందేహాలు సమాధానాలు ఇక్కడ పరిశీలిద్దాం!

1. ఈ జన్మలు ఇద్దరు భార్యగానూ, భర్తగానూ సన్నిహిత బంధువులుగా ఏర్పడటం ఈ జన్మకే పరిమితమై వుంటుందా? ప్రతీ జన్మలోనూ వాళ్ళే తిరిగి భార్యాభర్తలుగా జన్మిస్తారా? లేక ఏజన్మకాజన్మ కొత్త భార్యాభర్తలు బస్సుప్రయాణీకులవలే కలుస్తారా? ఏది సత్యం?

2. మనుష్యులు ఈ జన్మలు ఎక్కువ ప్రేమానుబంధాలు కలవాళ్ళు ఒకరిమీద ఒకరికి గాఢమైన అనుబంధం (Attachment) వల్ల తిరిగి ఈకర్మతో తీవ్రమైన ద్వేషం శతృత్వంకు జీవులుకూడా అలాగే ద్వేషంవల్ల లాగబడి ఒకేచోట జన్మించి లేక కలుసుకొని పూర్వవైరాలను సాధించుకుంటూ పోతారా? శతృత్వమా? అనుబంధమా? కలుసుకోవడానికి కారణమేమిటి?

3. ఈజన్మలో రోగాలు, ఆపరేషన్సు వ్రణాలు, శరీరంలో చెడుకర్మ ఫలానా అవయవానికి సంబంధించినది అంటూ ఎక్కడ రికార్డు అయివుంటుంది? దాన్ని తిరిగి ఈ శరీరం ఏర్పడ్డప్పుడు ఆ అవయవంలోకి చేరవేసి ఈ రోగం, వ్రణం, అక్కడే ఏర్పడేలాగా చెడకర ప్రయోగించేదెలా?

4. కర్మ మానసికమా? శారీరకమా? మంచికర్మా? చెడుకర్మా ?

రెండూ కర్మే అయితే రెండూ నశిస్తే ఏమవుతుంది? ఏది పుణ్యం? ఏది పాపం? ఎలా తెలిసేది? దీనికి సైన్సు వంటి నిర్దుష్టమైన అవగాహన ఎలా?

5. ఒకజీవుడు తను కర్మలను పూర్తిగా అనుభవించేసి ఒక జన్మలు ఎత్తవలసిన అవసరం లేనప్పుడు వాడి ఆత్మ ఏస్థితిలోకి వెడుతుంది? అతను ఎలా వుంటాడు. ఆత్మవిడిగా వుంటుందా? లేక ఆకాశంలో లయించి పోయినట్టు నామరూపాలు లేకుండా పోతుందా? మోక్షం అంటే ఇదేనా? మోక్షం పొందినవారికి జన్మలు వుంటాయి? వుండవా? యోగసిద్ధి కలిగిన మహాత్ముల ఆత్మకి, సామాన్య మానవుడి ఆత్మకీ, మరణించాక చూస్తే ఏదయినా తేడా కనిపిస్తుందా ? అలానే ముక్తపురుషుని ఆత్మ ఎలా వుంటుంది?

ఇలాంటివి జన్మలు కర్మల గురించిన ప్రశ్నలు అనేకులకు ఉదయించినవి వుంటాయి! వీటన్నిటికీ అనుభవ పరమైన సమాధానాలు జపాన్ యోగి మోతోయామా 50 ఏళ్లుగా చేసిన పరిశోధనల ఫలితంగా దాదాపు 60వేల మంది జీవాత్మలను దివ్యదృష్టితో పరిశీలించిన పరిశోధనల ఫలితంగా The Law of Karma అన్న ఇంగ్లీషు. గ్రంథంలో సంగ్రహంగా వివరించాడు: ఇది సైన్సువలే హేతుబద్ధంగా, సక్రమంగా, విశ్లేషించబడినది కావటంవల్ల ప్రపంచంలోని అన్నిదేశాలలోనివారు దీనిని సైన్సువలే ఆమోదిస్తున్నా! మెతోయామా విశ్లేషణ సారాంశాన్ని ఇక్కడ మీకు సంగ్రహంగా తెలియచేస్తాను!

1. ఆ ప్రశ్నకాధారం - ''ఏడేడు జన్మల అనుబంధం'' అంటూ తెలుగునోట వినిపించే సామెతల వెనుకవున్న విశ్వాసం హిందూ వివాహం కేవలం శారీరక సంబంధం కాదు! అది రెండు ఆత్మల అనుబంధం. అందుకే తెగతెంచుకోలేని విడదీయరాని కర్మబంధం! ఇది పెండ్లి సమయంలో చదివే వేదమంత్రాలైన వివాహమంత్రాల అర్థం గమనిస్తే తెలుస్తుంది! ఈ మంత్రాలను అనుగ్రహించిన ఋషులు దీర్ఘమైన తపస్సుతో

మనిషి జీవాత్మ ఎలా జన్మిస్తుందో - అలా జన్మలకు కారణమైన 'అనుబంధం' కర్మబంధంగా ఏర్పడి ఇద్దరూ భార్యాభర్తలు కావడానికి కారణమౌతున్నది. ఇది తెలిసినవారికే మన వివాహబంధం పవిత్రత తెలుస్తుంది ! ఇది డబ్బుతో ఏర్పాటు చేసుకొన్న కాంట్రాక్టు వంటిది కాదు. పురాణం పై ఆధారపడ్డది. 'తలాక్' విడాకులు ఇచ్చే వివాహవ్యవస్థవంటిది కాదు! అలానే ఇద్దరికీ అనుకూలంగావుంటే వుండనిచ్చి - ఎవరికి ఏరోజు ఇష్టం లేకపోతే అప్పుడు హోటల్ రూంలాగా క్యాన్సిల్ చేసుకునే అమెరికన్ పెండ్లికాదు! దీనికి కారణాలు నిశితంగా పరిశోధించి, గాఢంగా పరిశీలిస్తేగాని అర్ధంకావు!

మోతోయామా తల్లిదండ్రుల అనుభవాన్ని బట్టిచూస్తే ఇద్దరు వ్యక్తులమధ్య గాఢమైన ద్వేషంవున్నా అది భార్యాభర్తలుగా జన్మించేలాగా వారిద్దరినీ కలిపి కట్టివేస్తుందని తెలుస్తోంది! అలానే ఇద్దరు గాఢంగా ప్రేమించుకొని ఒకరులేనిదే ఇంకొకరు జీవించలేము అంటూ ఒకరినొకరు విడిచి వుండలేని రెండు ఆత్మల అనుబంధం అయితే అది అనేకజన్మలవరకూ వారిద్దరే భార్యాభర్తలుగా జన్మిస్తారు. ఇది ఆదర్శదాంపత్యం. ఇలాంటి పెండ్లిలో (1) శరీరాల కలయిక (2) ఒకరిమీద ఇంకొకరికి గాఢమైన ప్రేమ, ఆపేక్షలూ అనుబంధాలముడి (3) ఒకరికొకరు తోడుగా కష్టసుఖాల్లో తోడునీడగా అభిమానం, గౌరవం (4) ఒకరికొకరు తోడుగా కష్టసుఖాల్లో తోడునీడగా కలిసి జీవించే ఆధ్యాత్మిక సంకల్ప బలం వున్నపుడు వారిద్దరిలో కలిగే సత్యలోకాలలోని కర్మబంధమే అగ్నిహోత్రం మట్టువేసే ఏడు అడుగుల ప్రదక్షిణం 'సప్తపది'! ఇది తెలుగు సినిమా వెధవల పుణ్యామా అని వెటకారాలకూ, విమర్శలకూ చవకబారు డబ్బు చేసుకునే దగాకోరు డైరెక్టర్లకు నిలయమై ప్రజలను మరింత పతనం చేస్తుంది! కాని అసలైన సప్తపది అతి పవిత్రమైన, ఉన్నతమైన ఆదర్శం! పై రెండూ కాక ఇంకొక దైవికమైన దాంపత్యంకూడా ఏర్పడవచ్చు!

ఒకే. ఆత్మ రెండుగా చీలి (కవలపిల్లల్లాగా) అది స్త్రీ పురుషుల కిందకి వేరువేరు శరీరాల్లో జన్మించి అట్టివారు భార్యాభర్తలవుతారు! ఇది ఎంతో అరుదుగాగానీ జరగదు! కొన్నివేల సంవత్సరాలకి ఒక్కసారి అలా జరిగితే అది ఒక మహత్తర కారణంచేత ఆ రెండు జీవులూ భార్యాభర్తలుగా దిగివస్తారు! సామాన్యంగా అలాంటి వారి కడుపున అవతారమూర్తులుకాని, కారణజన్ములుకాని జన్మిస్తారు! పరిశుద్ధమైన ప్రేమవున్నా, ఈర్ష్యాద్వేషాలు లేని దాంపత్యంలోనుంచే అవతారమూర్తులు జన్మిస్తారు!

ఇనికాక మామూలు తరగతి జన్మలు - ఏ జన్మకాజన్మ భార్యాభర్తలు వేరువేరుగా ఏర్పడుతూ విడిపోతూవుంటారు! రైలు ప్రయాణంలోని మిత్రులులా! అలాంటి వారి జన్మ చూడగానే ఇట్టే గుర్తించవచ్చు! పేరుకి మాత్రం భార్యాభర్తలుకాని ఈయన సదా క్లబ్బుల్లోను, ఆమె నిత్యం మహిళామండలులలోనూ మరెక్కడో లేక రాజకీయాలలోనూ, జీవితం గడిపేవారు సాయంత్రం ఇంటికి వచ్చేముందు ఒకే అడ్రసుకోసం జన్మించే భార్యాభర్తలన్న మాట! వీరికి ఒకరులేకుండా ఒకరు జీవించలేమనే బాధవుండదు 'వీరు లేకపోతే మరొకరు' అన్నట్టుగా సరిపడకపోతే విడాకులు అన్నట్టుగా వ్యాపారసంస్థలు ఉద్యోగాలు, కాంట్రాక్టుపద్ధతిలో కట్నకానుకాలలిస్టుతో బ్యాంకులో ఎవరికెంత నిలవుందో అలాంటి అంశాలపై నిర్ణయించుకుంటారు. ఇలాంటి పెళ్ళిళ్ళు అద్దెకొంపల్లా ఉపయోగపడతాయేమో కాని, సొంతయింటిలాగా హాయిగావుంటూ సుఖాన్నిన స్థిరత్వాన్ని ఇవ్వజాలవు! భార్యాభర్తల ఆత్మలకు ఎదిగే పిల్లలకు గాఢమైన ప్రేమ ఎంతో అవసరం బలమైన ఆహారంలా! సరైన తల్లిప్రేమా, తండ్రి ప్రేమా లేక భార్యాభర్తలమధ్య అనుబంధం కరువై పెరిగేవారు క్లబ్బుల్లోనూ తాగుడుకో పేకాటకో లేక ఇతరులని పీడించే ప్రమాదకర

వ్యక్తులుగానూ తయారవుతారు! ఒకపండులోని విత్తనాలు ఆరోగ్యంగా పెరగాలంటే పండు పూర్తిగా ఫలించడం ఎంత అవసరమో పరిపూర్ణ దాంపత్యంకూడా ఆత్మయొక్క ఎదుగుదలకు అంతే అవసరం! అందుకే దీనిని ఆశ్రమం అన్నారు!

గృహస్థుని ఆశ్రమమే - అంటే ఆత్మని అభివృద్ధి చేసుకుంటూ తపస్సు చేసుకుంటూ ఇద్దరూ గాఢమైన అనుబంధంకల జీవులు కలిసి తరించటానికి ఏర్పాటుచేయబడ్డదే గృహస్థాశ్రమం! కేవలం పెండ్లి ఒక్కటే చాలదు! దీనికి వ్యక్తిలో గాఢంగా ప్రేమించే శక్తి వుండాలి! ఇంకా ఎన్నో వుండాలి! జీవితంలో పూర్ణత్వం కోరేవారికే ఇది లభ్యం. ప్లాటాఫామ్ బ్రతుకులవారికి కాదు!

3. ఈ ప్రశ్నకు ఆధారం - చెడుకర్మ ఈ జన్మలోనిది. వచ్చే జన్మలోని శరీరంలోకి ఎలాగ రవాణా చేయబడుతోంది అన్న అంశం! దీనిక ఈ శరీరం ఎలా ఏర్పడుతోందో తెలియాలి! ఆ రహస్యం యోగశాస్త్రంలో తెలుపబడివుంది! లేక యోగసాధన చేస్తే అనుభవంగా తెలుస్తుంది! అదెలావుంటుందో సూచిస్తాను! ఈ శరీరం మనం తినే ఆహారంతో ఏర్పడినది! అన్నమయశరీరం అంటారు! మనకి కేవలం శరీరమే కాదు మనకో మనసుంది! ఆలోచనలున్నాయి! అవీ మనలో భాగమే కాని పైకి కనబడవు. ఇలా పైకి కనిపించని మన ఆలోచనామయమైన వ్యక్తిత్వానికి ఈ మనసుతో తయారయ్యే శరీరం వేరే వుంటుంది దీనే సూక్ష్మశరీరం (Astral Body) అంటారు. ఇది యోగుల దర్శించగలరు. రష్యాలోని జోసెఫ్ కిర్లియన్ అనేవాడు కనిపెట్టిన కిర్లియన్ ఫోటోగ్రఫీ ద్వారా చనిపోయినవాడి శరీరంలోంచి పొగవంటి తెల్లని ఆకారం కలిగిన ఈ సూక్ష్మశరీరాన్ని విడిగా ఫోటో తీయగలిగారు. ఈ సూక్ష్మశరీరం చావదు. అన్నమయ శరీరం మరణించగానే అతని ఆలోచనలు అనుభవాలు మనోమయరూపంలోకి మారి ఈ సూక్ష్మశరీరంగా

ఏర్పడతాయి. గిన్నెలోని నీళ్ళు కాచితే ఆవిరిగా ఏర్పడి మేఘం అయినట్టు మనం చేసిన కర్మలన్నీ ఈ సూక్ష్మశరీరంలోనే దాగివుంటాయి! ఈ విషయం కిర్లియన్ ఫోటోగ్రఫీద్వారా సూక్ష్మశరీరం ఫోటోతీస్తే ఏ ఏ అవయవాలకు ముందుకాలంలో రోగాలు, వ్రణాలు కలుగుతాయో అలా చెడుకర్మ చేటుచేసుకున్న అవయవాల్లో నల్లటి పొగవంటి మచ్చలు సూక్ష్మశరీరం ఫోటోగ్రాపులో కనిపించాయి!

మనిషి జన్మించే సమయంలో ఈ సూక్ష్మశరీరంలోవున్నజీవుడు తల్లిగర్భంలో ప్రవేశిస్తాడు - గాలిలావున్న హైడ్రోజన్ బెలూన్‌లోకి ప్రవేశించినట్టు! అప్పుడా బెలూన్ పైన వుండే రంగురంగుల మచ్చలు బెలూన్ పూర్తిగా పెద్దదిగా నిండి కనిపించినట్లు సూక్ష్మశరీరంలో మచ్చలుగా మంచి చెడుకర్మల గుర్తులు ఏర్పడతాయి! దీనివల్ల ఆయాస్థానాల్లో రోగాలు, వ్రణాలు కలుతున్నాయి! ఇలా సూక్ష్మశరీరంవల్ల మనం చెడుకర్మలు చేసినా శరీరం కాలిపోయినా, దాని చెడుకర్మ కాలదు. ఆలోచనలను కాల్చలేముకదా? కాబట్టి, 'సూక్ష్మశరీరమే' ఒకజన్మలోని కర్మలను ఇంకొక జన్మలోకి రవాణా చేస్తుంది అని తేలుతున్నది! ఇదెలాగంటే టేబుల్ మీద పెట్టిన మెల్లపూలచెండు టేబుల్‌మీద వుండగానే దాని పరిమళం గాలి మోసుకువెళ్ళి ఎంతోదూరంలో ఘుమ ఘుమలాడుతోంది! మల్లెపూలు గాలిలోపోవు వాసన వెడుతుంది! అలాగ శరీరంలోని వాసనలే - మంచిచెడుగుల వాసనలు మంచీ చెడూ కర్మల ఫలితంగా గాలమోసుకు వెళ్ళినట్టే మనలోని గాలి ఊపిరితోపాటు మోసుకుని సూక్ష్మశరీరం తీసుకొని వెళుతుంది! ఇదే స్వభావాన్ని ఒక జన్మనుంచి ఇంకొక జన్మకు అదే స్వభావంతో జన్మింపచేస్తుంది! దీనిని నశింపచేస్తే జన్మలు నశింపచేయవచ్చు! ఆలోచనలు నశించేదెలా ? అదే పెద్ద సమస్య!

1. కర్మ మనసుతోచేస్తే మానసికం - ఒకరిని ద్వేషించడం లేదా ప్రేమించడం వంటిది!

2. శరీరంతో చేస్తే ఆ కర్మ శారీరకం - ఇతరులను కొట్టడం, వారికేదైనా పెట్టడం వంటిది.

3. పై రెండూ కాకా కర్మ ఆధ్యాత్మికం కూడా - జపం, ధ్యానం, ఉపవాసం వంటి ఆత్మను పరిశుద్ధిచేసే కర్మ ఆధ్యాత్మికం.

ఇలా భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక కర్మ ఫలితాలను తిరిగి అదేరూపంలో ఇస్తుంది. అనగా ఇతరులను ద్వేషిస్తే తిరిగి ద్వేషే లభిస్తుంది! శరీరకంగా చేసిన కష్టసుఖాలు అవే బాధలుసుఖాలుగా లభిస్తాయి. ఇక ఆధ్యాత్మిక కర్మ యోగసిద్ధి, బ్రహ్మజ్ఞానం చివరికి జన్మలు నశించి మోక్షంవంటి సత్కర్మ ఫలితాలను ఇస్తుంది. అంటే ఆధ్యాత్మిక కర్మవల్ల గతకర్మ నశిస్తుంది! మిగతా రెండూ ఒకకర్మవల్ల ఇంకొక కర్మ ఏర్పడుతున్నది!

ఇకపోతే మంచికర్మవలన తిరిగి జన్మించినపుడు సుఖం కలుగుతున్నది. ఇలా సుఖాన్ని కలిగించేది పుణ్యం! దుఃఖాన్ని కలిగించేది పాపం! మోక్షమనగా పుణ్యపాపాలు పూర్తిగా నశించినస్థితి. ఇట్టి స్థితి కేవలం మనిషి జీవిస్తూ తన పుణ్యపాపాలు ఖర్చుచేసుకోవడం వల్లనే రాదు! ఎందుకంటే ఒక కర్మ నశింపచేయడానికి మనిషి చేసే పనులవల్ల కొత్తకర్మ పుడుతూనే వుంది! కనుక ప్రాణాయామం వంటి యోగసాధనద్వారా మనసులోని ఆలోచనలు భస్మ చేస్తే కుండలినీ శక్తి అగ్నివల్ల గత చెడుకర్మ భస్మీపటం చేస్తే ఒకే జన్మలో పుణ్యపాపాలు నశిస్తాయి! దీనివల్ల మోక్షం కలుగుతున్నది. ఇలా మోక్షం కలిగించేది ఒక్క యోగసాధనే ! ఇది అన్నిటికంటే వేగమైన స్థితి! మిగతా పద్ధతులలో కర్మనివారణ జన్మలు పట్టవచ్చు!

దీనికి సూక్ష్మశరీరాన్ని ఫటోతీసిన రష్యన్ శాస్త్రజ్ఞుల పరిశోధన సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధన అన్న గ్రంధంలో వివరించాను (సైన్సుపరిశోధనలో జీవాత్మ లేక సూక్ష్మశరీరమే ఆలోచనలతో నిండివుంటుంది. కారణశరీరం ఆలోచనలకంటే పై స్థితిలో దీనిని ధ్యానంతో మోతోయామా దర్శించినట్లు చూస్తే తనకాదశలో మనలోని జీవాత్మ శరీరం ఏ స్థితిలో వున్నదో వివరాలు తెలుస్తాయి! దీనిలోనే తనిక గతించిన కర్మ ఎంతఖర్చు అయిందీ, ఇంకా ఎంత మిగిలివుంది? ఇలా ఇంక ఎన్నిజన్మలు వున్నాయి? ఈ జన్మ అంతం ... అవుతుంది. మొదలైన విశేషాలన్నీ కారణశరీరం నుంచే తెలుసుకోవాలి!

ఉదాహరణతో చెప్పాలంటే మనం బ్యాంకులో దాచుకున్న డబ్బువంటిది పుణ్యం. బ్యాంకులో చేసిన అప్పువంటిది పాపం. సూక్ష్మశరీరం చెక్కువంటిది. దానిమీద ఎంతకర్మ చేస్తే బ్యాంకులో అంతనిలవ ఖర్చు అవుతుంది. మనం బ్యాంకు, జమ చేసి ఖర్చు పెట్టిన రెండు పద్దులూ తెలిపే ప్యాసుబుక్ వంటిది! దీంట్లో మనం తీసుకున్న అప్పుకు జమచేసిన డబ్బు అనేక చెక్కుబుక్‌లద్వారా (జన్మలు) బ్యాంకులో వేస్తున్న ఖాతా! అన్నింటి సమగ్రరూపం తెలిపేది కారణ శరీరం. కారణ శరీరం అంటే ఈనాటి స్వభావానికీ, ఈ మన కర్మలకూ, ఈ జన్మకూ ఏదీ కారణమో అది!



18

# 'పై లోకాలు'
# దివ్యదృష్టితో స్వయంగా చూసిన 'మోతోయామా'

మనిషికి పైకి కనిపించే స్థూలశరీరమేకాక, దానిలోపల కంటికి కనిపించని సూక్ష్మశరీరం ఎలా వుంటుందో, దానిని ఫోటోగ్రాఫ్ తీసిన రష్యన్ శాస్త్రజ్ఞుడు జోసెఫ్ కిర్లియన్ (Joseph Kirlian) ఈ సూక్ష్మశరీరం అనేది యదార్థమైనదని అది మరణించే సమయంలో మనిషి స్థూలశరీరంనుంచి విడివడి ఏడురంగుల ఇంద్రధనస్సు కాంతితో వెలుగుతూ, ఒక బెలూన్‌లా ఆకాశంలోకి ఎలా వెడుతోందో గమనించాము. ఈ సూక్ష్మశరీరం లోపల దానికంటే అతీతమైనది ఇంకొకటి వున్నది! అదే కారణశరీరం.

## కారణలోకం :

ఈ సూక్ష్మశరీరం ఎలాగైతే మనం కలల్లో సంచరించే స్వప్నప్రపంచం అనబడే భువర్లోకములోని అడుగు అంతస్థులో సంచరిస్తూ వుంటుందో అదే పదార్థంతో తయారైన సూక్ష్మశరీరం ఆ లోకము దాటివెడితే దానికి పైన వుండేదే కారణశరీరం. అది సంచారం చేసేలోకం పేరే **'కారణ లోకం'**!

జపాన్‌యోగి 'హిరోషి మొతోయామా' మరణించిన వారి ఆత్మలపై చేసిన యోగపరిశోధనలో **'కారణ-శరీరా'**లగురించి అనేక ఆశ్చర్యకరమైన విషయాలు తెలియజేశాడు ! ఇందులో ముఖ్యమైనవి, ఇవి:-

1. మరణించిన ప్రతీఒక్కరూ ఈ కారణ-లోకంలోకి పోలేరు. భూలోకంలో గొప్పసాధనచేసిగాని, లేక, నిస్వార్థంగా మానవజాతికి అమూల్యమైన ఉపకారం చేసినవారు కాని, లేక తీవ్రమైన తపస్సు, యోగాభ్యాసం ప్రాణాయామం లేక ధ్యానంతో మనస్సును పవిత్రం చేసుకొని నిత్యజీవితపు కోరికలను **దాటినవారే** ఈ కారణలోకంలోకి వెళ్ళి సంచరిస్తారు.

2. ఈ కారణలోలో తిరిగే ఆత్మను 'కారణాత్మ' లేక 'కారణ-శరీరం' అనికూడా అంటారు. ఇక్కడ చేరగలిగిన ఆత్మలు దీపాల్లా వెలుగుతూ కరెంటు బల్బుల్లా వెలుగులు చిమ్ముతూ ఉంటాయి! వారి ఉద్రేకాలను, రాగద్వేషాలనూ పూర్తిగా వశంలో వున్న జీవులే ఇక్కడ వుంటారు.

3. ఎక్కువ ''అటాచ్‌మెంట్'' (Attachment) లేదా, జీవితంలో వ్యక్తులన్నా సొంతవస్తువులన్నా, స్వార్థమున్నా, ఆసక్తితో వాటిని

అంటిపెట్టుకున్నజీవులుగాని, ఇక్కడికి రాలేరు. 'భూలోకం'-లో వారికి జీవించివుండగా ఆసక్తి వున్నచోటే చుట్టూరా తిరుగుతూ సుడిగుండాలలో చిక్కుకుపోతారు.

4. ఈ 'కారణ లోకం'లో పరిశుద్ధము చేయబడిన (Purified Love) ప్రేమా, నిర్మలమైన సేవాభావము, దానివల్ల కలిగే **"నేనెవరు?"** అన్న సత్యాన్ని, అనుభవంతో తెలుసుకోవాలన్న తీవ్రమైన ఆసక్తి, తనకో ఆత్మవున్నదనీ, దానిని అభివృద్ధి చేసుకోవాలని **అదే సంకల్పంతో జీవించేవారికి** ఈ పుణ్యలోకాలలో మాత్రమే — ప్రవేశం!

5. క్రిందవుండే సూక్ష్మశరీరానికి, భువర్లోకంలో కంటే ఎక్కువ స్వేచ్ఛా వెలుతురూ వేగమూ ఇక్కడ వుంటాయి — నీళ్ళల్లో ఈదేవారిలాగా! సూక్ష్మశరీరం తిరిగితే గాలిలో తేలినట్టు, కారణప్రపంచంలోని ఆత్మలు సంచరించగలవు! కిందవుండే వ్యక్తులతోనూ స్థూలప్రపంచంలోనూ వుండే చెడుకర్మలు నశింపు చేసుకున్నవారే ఈ కారణప్రపంచంలో ప్రవేశించి వుంటారు!

6. యోగులుగా చాలకాలం తపస్సు చేసి సాధనలో పరిపూర్ణ లక్ష్యాన్ని చేరుకోలేనివారూ, భక్తి కలిగి గతకర్మవల్ల గమ్యాన్ని చేరక మోక్షాన్ని పొందలేనివారూ; ఇంకా పుణ్యజీవులు, ఈ లోకంలో - మరణించిన ఇతర జీవుల ఆత్మలకు సాయంచేస్తూ వారికి ఏ లోకం ఎక్కడవుంటుందో, ఎలా సంచారం చెయ్యాలో, వారికి కనిపించే అపూర్వాలు, మరణించినస్థితిలో వారికర్థం కాని ఆ లోకపు జీవిత విధానము తెలియచెప్పే ట్రైనింగుగా సాయం చేసే వాలంటీర్ల వంటి పుణ్యజీవులే ఈ కారణ ప్రపంచంలోని వారు!

7. తను తర్వాత పిల్లలుకాని, శిష్యులుకాని, సాధనలో పైకి రావాలని నిస్వార్థ సంకల్పంతో తపస్సుచేసే యోగులూ, ఇంకా కింద తమ శిష్యులతో కర్మబంధాల కారణలోకంలో వుంటారు.

ఎలాంటివారు ఈ కారణలోకంలోకి చేరగలరో తెలియడానికి ఒక ఉదాహరణ చాలు :- ఒకడు సంగీతం నేర్చుకోవాలని చాలాకాలం కష్టించి సాధకంచేసి గొప్ప ప్రవీణుడవుతాడు! అలా అయిన ఇద్దరు ముగ్గురిలో చాలామంది కీర్తికోసం తను గొప్ప సంగీత విద్వాంసుడు కావాలని డబ్బూ, గౌరవం, సంగీత పాండిత్యం కోసం కృషిచేసేవాడూ - కింద వుండే సూక్ష్మశరీరంలోనే వుంటూ వారికోరికలచుట్టూ పరిభ్రమిస్తూ వుంటారు; కారణలోకంలోకి చేరుకోలేక! అందులో ఒక్కడైనాసరే ఆర్తితో వేదనతో భక్తితో భగవంతునికై తపించి గానం చేసేవాడు వుంటాడనుకుంటే అలాంటివాడి ఆత్మ క్రిందిలోకాల చెడుకర్మ క్షయంకాగానే (ఆ కోరికలు తీరగానే) పై 'కారణ'లోకంలోకి తేలిపోతుంది! కాబట్టి కారణలోకంలోకి ఆత్మ వెళ్ళాలంటే గేటువద్ద ఎదురయ్యే వడపోత, ఆత్మయొక్క పై విశేషాన్ని పరిశీలించిన మీదటనే కారణలోకంలోకి ప్రవేశం — లభిస్తుంది.

పసిపిల్లలవంటి మనస్తత్వము, అసూయా ·అనుమానం, అహంకారంలేని నిర్మలమైన వ్యక్తిత్వం కలిగినవారు, మానవజాతి కోసం గొప్ప సైన్సు పరిశోధన లేక ఆధ్యాత్మిక సాధనలు ధారపోసేవారు, సమాజాన్ని బాగుచేయడానికి తన త్యాగంపైనే ఆధారపడి కృషిచేసేవారు (నివేదిత వంటివారు) ఈ కారణలోకంలోకి చేరుకోగలిగే ఆత్మలు! ఇక్కడి ఆత్మలలో చాలా కొద్దిమంది మాత్రమే భూలోకంలో జన్మిస్తారు! అదికూడా గతంలో తను పూర్తిచెయకుండా శేషంగా మిగిలిపోయిన పుణ్యకర్మలను పూర్తిచేయడానికే!

ఏ ఆత్మ అయినా సూక్ష్మశరీరంతోగాని, అంతకన్నా పైనవుండే కారణ ఆత్మతోకాని, ప్రయాణించాలంటే దానికి ముఖ్యమైన కొలబద్ద కర్మ!

## కర్మ :

ఇక్కడ దాటుకోవసిన కర్మలే. అన్నిటికన్నా ప్రాధమికమైన కర్మ తిండి, రుచి, వాసన, సెక్సు, కోరిక, బలమైన అనుబంధం, వదిలించుకోలేని అలవాట్లు. ఇవన్నీ ఆత్మను పైకి పోనీయకుండా కట్టివేస్తాయి! వారి తీవ్రమైన ఉద్రేకాలే ఆత్మలను సంకెళ్లుగా బంధిస్తాయి.

అకస్మాత్తుగా తీవ్రమైన భయానికీ, క్రోధానికీ, బాధకూ గురైన ఆత్మలుకూడా పై కారణలోకానికి చేరుకోలేవు. అకస్మాత్తుగా హత్యచేయబడ్డవారు, ఏక్సిడెంటులో మరనించేవారు, లేక తనను చంపిన వారిపై పగతీర్చుకోవాలన్న ద్వేషంతో మరణించేవారు, అది తీనేవరకు వారిదృష్టి పై లోకంమీద పడదు! అంతదాకా వారి తీవ్రమైనస్థితి వారికి సంకెళ్ళలాగా పై లోకానికి పోనివ్వదు! ఇది కర్మ!

ఇంకా అర్థం కావాలంటే ఒకమనిషి తోటలో నీరెండలో స్వేచ్ఛగా చల్లగాలిలో సంచారం చేస్తున్నాడనుకోండి, గులాబీపూల వాసనలమధ్య అతడు అలాగ ఎంతకాలం అక్కడ సంచారం చెయ్యగలడూ అంటే తనకి కరకరమని ఆకలివేస్తేనో, దాహమో లేక కాళ్ళుపీకటమో లేక మరొక పని ఏదైనా గుర్తుకువస్తేనో అదే ఆలోచనగా, ఎలా వెనక్కిలాగి ఆ స్వేచ్ఛనుండి మళ్ళిస్తోందో అలాగే కారణలోకంలో సంచారం చేసే జీవుల గతకర్మ కూడా వారిని వెనక్కి లాగుతుంది, ఆకలీ, కోరికలాగే! కాబట్టి వీటిని దాటి లేక నిత్యజీవితంలో పరిశుద్ధం చేసుకొని చెడుకర్మలన్న ఈ ఉద్రేకాలు కలగని జీవులే ఈ కారణ ఆత్మల లోకానికి చేరగలుగుతారు! అలానే తీవ్రమైన సుఖము, ఓర్చలేని బాధ ఈ డూ కూడా కర్మయొక్క

సంకెళ్ళే.

ఇలాగ జీవులను కిందకులాగే ముఖ్యమైన కార్మిక అడ్డంకులలో ముఖ్యమైనది:

(ఎ) స్త్రీ పురుషుల వాంఛ

(బి) త్రాగుడు లేక మద్యపానం

(సి) ఉద్యోగం లేక వృత్తిపై విపరీతమైన దృష్టి లేక తీవ్రకాంక్ష (Ambition)

(డి) తీవ్రమైన రుచులు, తిండి, ఇల్లు, ఆస్తి, డబ్బు వీటిపై మమకారము.

(ఇ) తన మనసుపై చెరగరాని గీతలాగ ముద్రపడి ప్రతీ చెడుప్రభావం అది ప్రక్షాళన పొంది, నిర్మలం కానంతవరకూ మన మనస్సుపైన పనిచేస్తూనే వుండి ఆ జీవుడి ఆత్మను పైకి పోనివ్వదు.

ఆకాశంలో నిర్మలంగా పెద్దకోరికా లేని స్వేచ్ఛా పుణ్యజీవులకే!! ఈ తేజస్సు చిమ్ముతూ వెలిగే కారణలోకాలలోకి ప్రవేశించే పర్మిషన్ లభిస్తుంది.



19

# బుద్ధదేవుని — 14-వ పునర్జన్మ టిబెట్‌ప్రభువు - దలైలామా!

అది శ్రావణ పూర్ణిమ! విష్ణుమూర్తి నక్షత్రమైన 'శ్రవణం'లో పూర్ణచంద్రుడు తెల్లగా తళతళా మెరుస్తూ ఉదయించాడు. అప్పుడే స్నానము, అనుష్టానం పూర్తిచేసి 'టిబెట్ ప్రభుత్వ అతిధిగృహం' నుంచి బయటకు వచ్చిన వేదవ్యాసకోసం ఒక పెద్ద ప్రభుత్వవాహనం వచ్చి ఆగింది! టిబెటన్ దుస్తులతో ఒక 'ఉన్నత ప్రభుత్వ అధికారికివుండే రాజలాంఛనాలతో, చేతిలో జపమాల ధరించిన ఆ 'ప్రభుత్వ దూత' వినయంగా సలాము చేసినట్లు వంగి నమస్కరించి 'శ్రీవేదవ్యాసను దలైలామా చూడగోరుతున్నార'ని నివేదించాడు! క్షణాలమీద టిబెటన్ రాజలాంఛనాలన్నీ బ్యానెట్‌పై ప్రదర్శిస్తూన్న పొడుగాటికారు పర్వత సానువులపై రోడ్డుమీద బాణంలా దూసుకుపోయింది చప్పుడులేకుండా!

---

★ ''కదిలే-బ్రహ్మం'' 'నడిచే-దైవం' నుంచి. (పునర్ముద్రితం.)

ఎదుట ఉన్నతమైన హిమాలయ పర్వతాలు! తపస్సు చేసుకునే ఋషీశ్వరునిల తెల్లని జటాజూటంలాగా మంచు శిఖరాలతో చెట్లమాటున నుంచి కనిపిస్తూ మళ్ళీ అదృశ్యమౌతున్నాయి! కొండల్పై నుంచి జాలువారే తెల్లని మంచు — గడ్డాలు, మీసాలవలే జాళ్ళుగా కిందకి దిగుతూ ఆ పర్వతపంక్తి ఒక గంభీరమైన వేదకాలపు ఋషి తపస్సు చేసుకున్నట్టుగా ప్రశాంత తపోముద్రలో ధ్యానిస్తున్నట్టుగా నిశ్చలంగా నిలిచివున్నది! శిఖరంపై ఉదయిస్తున్న పూర్ణచంద్రుడు అంతటా వెన్నెల మెరిసేలా కురిపిస్తున్నాడు!

కారు ఓపెద్దకోటలాంటి రాజద్వారం దాటి విశాలమైన ఓ పచ్చిక మైదానంలోకి అందమైన 'బౌద్ధ దేవాలయ' ఆరామం (Monastery) మధ్యగా వున్న 'దలైలామా' తపోవాటికలో ఆగింది! అది టిబెట్ ప్రభుత్వ స్థావరమూ, ఆధ్యాత్మిక కేంద్రంకూడా! కారుదిగిన వేదవ్యాసకు ఎదురుగా వచ్చి ఆహ్వానించిన టిబెట్ ప్రధాని 'చోగ్యాల్' అభివాదం చేస్తూ "**శ్రీ తథాగతులు మీకై నిరీక్షిస్తున్నారు!**" అంటూ అందంగా రంగు రంగుల లతలతో, పూలకుండీలతో అలంకరించబడిన ఆవరణ దాటించి చందన పరిమళాలు వెదజల్లే బౌద్ధకుటీరంలో ప్రవేశింపచేశాడు!

ఎదురుగా ఎత్తైనబంగారు నగిషీ పనితో చేసిన "ధర్మచక్రం" ఎడమవైపు ఒకపెద్ద "ధర్మ గంట" రకరకాల నగిషీలతో శిల్పంతో చెక్కడాలను, టిబెటెన్ వర్ణచిత్రాలనూ, ఆశ్చర్యంగా చూస్తూ సోఫాలోకూర్చున్న వేదవ్యాసను

"మీరు, శ్రీవారికి లాంఛనంగా పట్టువస్త్ర శకలాన్ని (Silken Scarf) తీసుకువచ్చారా?" అంటూ ప్రశ్నించిన 'చోగ్యాల్'తో శ్రీవేదవ్యాస 'అరే! మీ వాహనంలో నేరుగా ఇక్కడికే తీసుకువచ్చేసారు! నేనే తేవలసింది! అది ఎక్కడ దొరుకుతుంది?" అని ఆందోళనతో తానొక ముఖ్యమైన బౌద్ధ మర్యాదనూ, రాజ మర్యాదనూ

మరచినందుకు విచారం వెలిబుచ్చుతూ అన్నారు!

''పర్వాలేదు! నేను ఇలాంటి పరిస్థితి వస్తుందని ముందుగానే ఒక తెల్లని సిల్కువస్త్రఖండాన్ని టిబెటెన్ సన్యాసుల వద్దనుంచి సేకరించి పవిత్రంగా తెప్పించి వుంచాను!'' అన్న చోగ్యాల్‌వంక విప్పారిన నేత్రాలతో చూసిన వేదవ్యాస దృష్టిలో కృతజ్ఞత, అభిమానమూ, ప్రేమా ఒక్కసారిగా ప్రకాశించగా ప్రధాని చోగ్యాల్ అలాగే శ్రీవేదవ్యాస ముఖాన్ని ఆశ్చర్యంతో చూస్తూ నిలబడ్డాడు!

లోపలనుంచి 'ఖంగ్'మని గంటమోగింది! తృళ్ళిపడి శ్రీవేదవ్యాసను ద్వారంవరకూ తీసుకునివెళ్ళి ఆయన పేరును ప్రకటించి బయటకు తప్పుకున్నాడు చోగ్యాల్! దలైలామా సింహద్వారం వద్ద వేదవ్యాస ఒక్కరే క్షణకాలం నిలబడ్డారు! ఆ అపూర్వ, అమృత క్షణాన్ని గంభీర ధ్యానముద్రలో నిలిచి, మనసా ఆస్వాదిస్తూ .. మరుక్షణంలో ఏదో ఒక వింత వెలుగు, తనలో కరెంటువలే మెరుపు మెరిసినట్లు ఫ్లాష్ కాగా నిటారుగా నిలబడి రెండుచేతులూ ఎత్తి 'ఆశీర్వచన ముద్ర'తో దీవిస్తూ దలైలామా గదిలోకి ప్రవేశించారు వేదవ్యాస!

''శ్రీబుద్ధదేవుని జన్మభూమికి, మా భారతదేశంనుంచి టిబెట్ ప్రజలపైనా మీపైనా ఇవే బుద్ధదేవుని అనుగ్రహాశిస్సులు!! ఇదే అనుగ్రహవర్షంకై ఇదే వర్షిస్తున్నాను!'' అంటూ మెరుపు మెరిసినట్టుగా లోపలకు ప్రవేశించారు!

క్షణకాలం ఉలిక్కిపడ్డ దలైలామా ఆంతరంగిక దృష్టితో గంభీరంగా లోపలికి చూస్తూ రెండుచేతులూ తన తలపైకి 'నమస్కార ముద్ర'లో ఎత్తిపెట్టి వినయంగా వంగి అభివాదన చేశాడు .... మూడుసార్లు మరీమరీ వంగి.... బుద్ధదేవుని పేరున! ఈ అభివాదన అపూర్వము! దలైలామా ఎంతటివారికైనా బుద్ధదేవుని అవతారంగా ఊహించరానిది!! ఆశీర్వదించడమే తప్ప ఆశిస్సులు తన ఉన్నత సింహాసనంపై కూర్చుని

ఎదుర్కోవడంగాని, అందులో, తలవంచి నమస్కరించి అభివాదన చేయడంగాని, ఎప్పుడూ జరగని వింత! అలా ఎందుకు చేశారో ఎవరికీ అంతుపట్టలేదు! ఏదో మహత్తరమైన కారణం మనం ఊహించరానిది ఉండి వుంటుందని వేదవ్యాసతో తర్వాత శ్రీచోగ్యాల్ అన్నారు!

ఆరు అడుగులపైగా ఆజానుబాహుడైన, గంభీరమైన విగ్రహం దలైలామాది! స్పష్టమైన సాముద్రికంగా దివ్య లక్షణాలతో పసిపిల్లవానిని తలిపింపచేసే నవ్వుతో కలకలా నవ్వేశాడు దలైలామా! సాదరంగా వేదవ్యాస రెండు చేతులూ పట్టుకొని తనవైపుకు లాక్కొని తనపక్కనే సోఫాలో కూర్చుండ పెట్టుకున్నారు! ఒహో! అది మహోన్నతఘడియ! అమృతఘడియ! అమృత ఘడియ!

బుద్ధదేవుని జాతకంపై జ్యోతిషపరిశోధన చేసి సరియైన బుద్ధదేవుని జననకాల నిర్ణయంకూడా శ్రీవేదవ్యాస చేపట్టవలసిన పరిశోధనావసరం ఎంతైనా వున్నదంటూ, తధాగతులు శ్రీదలైలామా నచ్చచెప్ప జూశారు తన సహజమైన దైవీ ప్రేమతో నిండినమాటలతో!

ముందుగా టిబెట్ భాషలో ఆయన ప్రసంగిస్తుంటే అనువాదకుడు ఇంగ్లీషులో తెలియచెప్పటం సరిగా రుచించలేదు ఇరువురుకీ!

''దలైలామావారికి స్వచ్ఛమైన ఇంగ్లీషు పాండిత్య వుండవలెనే! మీకు అనువాదకులు అవసరమా?'' అన్న వేదవ్యాసవంక చిరునవ్వుతో చిలిపిగా చూస్తూ తలపంకించి తనపక్కనేవున్న అనువాదకునకు లేచివెళ్ళమని సౌంజ్ఞచేసారు హస్తసౌంజ్ఞతోనే! అతను లేచి వినయంగా వంగి నిష్క్రమించాడు!

''ఇప్పుడు చెప్పండి! టిబెట్ భవిష్యత్తు ఎలానడుస్తుంది? మా ప్రజలకు, ముందు ముందు ఇంకా ఏమిజరగనున్నది? మేము త్వరలో 'లాసా' (Lhasa) తిరిగి వెళ్ళేసూచన ఏమైనా మీకు కనిపిస్తోందా?

మీనుండి వినగోరుతున్నాను!'' అన్నారు దలైలామా ఆతృతగా ఆసక్తిగా వేదవ్యాసవంక చూస్తూ!

''భవిష్యత్తు సర్వమూ ఎరిగివున్న మీరు ఆధ్యాత్మిక అవసరాలు తెలిసిన సాక్షాత్తూ బుద్ధదేవుని ప్రతినిధులు! 'రానున్న భవిష్యత్తు' ఏనాడో మీరు మీ గత జన్మలోనే '13-వ దలైలామా'గా దర్శించారు! ' ఈచైనా దండయాత్ర టిబెట్‌పైకి రాగలదనీ ప్రపంచమంతటా రాక్షస శక్తుల విజృంభణ ఆధ్యాత్మిక 'బుద్ధ-ధర్మాన్ని, ధ్యానాన్ని' సమూలంగా నాశనంచేయాలనే దృష్టితో హింస, రక్తపాతం, దండయాత్రలతో, టిబెట్‌పై విరుచుకుపడతాయిని ఏనాడో ఎదురుచూసిన 'తమ భవిష్యత్ దృష్టి'తో తెలిపిన ఆ 'దుష్టకాలం' ఇప్పుడు రానేవచ్చింది!

''ఇది తమరు తెలిసివుండే నన్నే ప్రశ్నించడం నాకు ఇబ్బందినీ, మొహమాటాన్ని పెట్టేస్తున్నది'' అన్నారు శ్రీవేదవ్యాస మందహాసంతో!

ఆ మాటలకి 'అర్థం' తెలియాలంటే ప్రస్తుత 'పధ్నాలుగవ' దలైలామావారి 'పూర్వజన్మ - చరిత్ర' గత అవతారంలో ' ఆయన ముందే చెప్పిన భవిష్యత్తు' తెలిస్తేగాని అర్థం అవదు!

''గతంలో పదమూడవ(13-వ) దలైలామాగా జన్మించినవారు ప్రపంచంపైకి టిబెట్‌పైకి ప్రళయకాలం పరుగిడి వస్తున్నదని తూర్పునుంచి, ఈశాన్యం నుంచీ, చైనీస్ పిశాచశక్తులు పవిత్ర టిబెట్‌పై దాడిచేయగలవని చెబుతూ తాము ఆటైముకు గుర్తుగా ''ఆకాశంలో ఇనుప పక్షి (Iron Bird) ఎగరటమే దాని గుర్తు!! అంటూ విమానాలతో, విదేశీయులు పవిత్ర - టిబెట్ గడ్డపై కాలుపెట్టడమే ఈచెడుకాలాన్ని'' సూచించి గతించిన పదమూడవ దలైలామా చెప్పిన 'భవిష్యత్ వాక్యాలను' ఉదహరించారు వేదవ్యాస! దానితో శ్రీ దలైలామా మనసు గతంలోకి పరుగులు పెట్టింది! గతించిన జ్ఞాపకాలతో ఆయన కళ్ళు నీలాకాశంలోకి తేలిపోయాయి!

## 13-వ 'దలైలామా' నిర్యాణం:-

పదమూడవ దలైలామా అప్పట్లో తన నిర్యాణం పొందే రోజు సమీపించిందని ముందుగానే హెచ్చరిక చేశారు! టిబెట్ రాజధాని 'లాసా'(Lhasa)లో బౌద్ధ బిక్షువుల, 'అర్హంతులు', బౌద్ధసిద్ధులు అనేకులు ధ్యానముద్రలో దలైలామా చుట్టూ చక్రాకారంగా కూర్చునివున్నారు! ఆయన రానున్న కాలగతిని వారికి వివరించి టిబెట్‌నీ ప్రాచీన ఋషుల ధర్మాలనీ అతి జాగరూకతతో కాపాడవలసిన 'సమయం' రక్షించవలసిన 'తరుణం' ఆసన్నమైనాయని వారికి హెచ్చరికచేస్తూ తాపసికులు యోగులు పరమగురువులపై - పడ్డ బాధ్యత బహుగురుతరమైనది, కష్టమైందీ, ఎలా నిర్వహిస్తారో జాగ్రత్త!

## 13-వ దలైలామా - 'పునరవతరణ' :

అంటూ, ఆ తర్వాత తాను శరీరం విడిచి ఏ దిక్కుగా జన్మించబోతున్నదీ వివరించారు! తను యోగ-సమాధిలోకి వెళ్ళి శరీరం విడిచిపెట్టగానే కపాలభేదనం చేసుకుని పైకి వెళ్ళిపోతాననీ, అపుడు నిర్జీవమైన తమ కళేబరం తల ఎటువైపు తిరిగి వాలిపోయి వుంటుందో ఆ దిక్కుగానే తాను జన్మిస్తానని, తనకై అటే అన్వేషించాలనీ, వారికి తగు సూచనల్నిచ్చారు!

ఈ ప్రపంచంలో అనేక చోట్ల అనేకమంది యోగులు, దివ్యపురుషులు జన్మిస్తుంటారు! ఎందరో మహానుభావులు! ఆ అందరిలోనూ తనను ప్రత్యేకంగా గుర్తించడమెలాగో వారికి సూచించారు! తాను పుట్టే ట్రైవు (చూచాయగా) తన శరీరంమీద కనబడే ముప్పైరెండు (32) దివ్యసాముద్రిక చిహ్నాలు పద్మం, శంఖం, వంటి దివ్యలక్షణాలను గుర్తించడం ఎలానో తెలిపి అందరినీ ఆశీర్వదించి 'యోగం'లో ప్రవేశించారు!

అలా నిర్యాణంపొందిన పదమూడవ దలైలామా ముఖం ఏదిక్కుగా తిరిగివున్నదో సరిగ్గా ఆ దిక్కుగానే అన్వేషిస్తూ మారువేషాలతో యాత్రగా బయలుదేరారు ముఖ్యమైన పరమ-గురువులూ, 'లామా'లూ!

మూడు సంవత్సరాల తర్వాత టిబెట్‌కు ఈశాన్యంగా 1935లో, మంచుకొండల నడుమ ఒక చిన్న కుగ్రామంలో ఒకరైతు కుటుంబంలోని జపధ్యానపరాయణుడి ఇంట వాకిట్లో 'చెర్రీ చెట్టు' కాలంలో అకస్మాత్తుగా పుష్పించింది!

ఇదివొక వింత సూచన!! పురిటి మంచంచుట్టూ ఒక అలౌకికమైన 'ఇంద్రధనుస్సు' కనిపించింది! — ఇది రెండవ దివ్యసూచన!!!

ఇంకా తల్లికి ఇతర దివ్యమైన కలలు ఎన్నో దేవతల దుందుభిలవంటి విచిత్రవాయిద్యాలు, వారికి వినిపించాయి! అవన్నీ భర్తకి తెలపగా, ఆలయంలోని పెద్దలు, గురువులూ ఒక దివ్యపురుషుడో, బోధిసత్వుడోకాని, జన్మించే సమయంలోనే ఇలాంటి 'దివ్యసూచనలు' కనపడతాయి! మీరు అదృష్టవంతులు కాబోతున్నారు! అన్నారు!

ఇవి జరిగిన కాలానికి - పవిత్రమైన శ్రీరుపూర్ణిమ 'దినంరోజు' ఆషాడశుద్ధ పూర్ణిమ 5-జూలై-1935న బుద్ధదేవుని అవతారంగా పధ్నాలుగవ దలైలామా అవతరించారు! పసిపిల్లవాడైన దలైలామాను దివ్యపురుషునిగా గుర్తిస్తే వారి ఆస్థాన మంత్రులు తల్లిదండ్రులైన బిడ్డను తమ వద్దనుండి తీసుకుపోతారేమోనని బిడ్డను వారికి కనిపించకుండా బైటికి పోనివ్వకుండా జాగ్రత్తగా పెంచారు! పిల్లవానికి మూడవ సంవత్సరం దాటవచ్చింది! తప్పటడుగులతో ఇంటి ఆవరణలో ఆడుకుంటూ ఆకాశంలోకి ఎదురుచూడసాగాడు.... ఎవరికోసమో! అక్కడ హిమాలయ పర్వతం మంచులోయలలో 'పరమ

గురువులు', యోగులు, ఆందోళనపడసాగారు - మూడో సంవత్సరము కావొస్తున్నది - పదమూడవ దలైలామా నిర్యాణం పొంది! వారు ఇంకా ఎక్కడ జన్మించినదీ ఇంతవరకూ ఆచూకీ లభించలేదు! టిబెట్ ప్రజలలో కల్లోలం ప్రారంభించింది! మూడేళ్ళుగా తమ 'పరిపాలకుడు' సద్గురువూ లేకుండా టిబెట్ ప్రభుత్వం ఖాళీగా వున్నందుకు!

పెద్దలందరికీ దిక్కుతోచలేదు! చివరికి ఒక ఉపాయం ఆలోచించారు! భవిష్యత్తును తెలియచేసే మంచు-సరస్సులో దివ్యదృష్టికై ప్రార్థనలూ చేశారు! ఆ చెరువు చుట్టూ పూజలూ, హోమాలూ జరిపారు! యోగులు తుమ్మెదనాదంలా ఝుమ్మని ఓంకారం చేస్తూ, ఉపవాసం చేసి జపిస్తూ రోజుల తరబడి ధ్యానించారు! అకస్మాత్తుగా - లేతనీలిరంగుతో నీలిమంచు ప్రతిఫలించే చెరువు అడుగుభాగం మట్టిలేకుండా నిర్మలంగా వజ్రపు ఖండంలా ప్రకాశించింది! లేత వెన్నెల నీలమైన ఆ మంచుపై ప్రతిఫలించి ముత్యపుచిప్పవలే ఇంద్రధనుస్సురంగులతో వెలగి దానిమధ్య ఒక అద్భుతమైన చిత్రం T.V.చిత్రంలోలాగా ఏర్పడసాగింది!

యోగులందరూ ఊపిరి బిగపట్టి ఆత్రంగా చూస్తూన్నారు! ఏమి కనిపిస్తుందోనని!!!

నీలమైన హిమాలయ 'సరస్సు'పై ఒక పాలవంటి తేజస్సు పొగమంచులా కమ్మింది? ఇంద్రధనుస్సులా ఏడురంగులీనుతూ! ఒక పెద్ద భవనం, దానికి చెక్కపనితో చేసిన ఇంటి కప్పు - చైనీస్ పద్ధతిలో వంపులు తిరిగివున్నది! ఆ ఇంటిముందు ఒక చెర్రీ (Cherry-tree)చెట్టు కాలంగాని కలంలో పుష్పించి వున్నది! ఇంటి ప్రాంగణంలో ఒక ''యాక్ బర్రె'' మేస్తున్నది!

లోపల పరిటి మంచంచుట్టూ గుండ్రంగా ఇంద్రధనుస్సు వెలుగుతున్నది, చంద్రుడిచుట్టూ వర్షపు గూగులా (పరివేషం)! బొద్దుగా

జుట్టులేని గుండుతో కనుబొమ్మలులేని, విభూతి పండువంటి ముఖ సౌందర్యంతో ముద్దులు మూటకట్టే బాబు ఉయ్యాలలో తనలో తానే నవ్వుకుంటున్నాడు!

ఆనందంతో ఉలిక్కిపడ్డారు, ఆ దృశ్యానికీ! అంతే! క్షణంలో మాయమైంది ఆ చిత్రం! అందరూ విచారించారు తమతొందరపాటుకు!

అదే రూపురేఖలుగల ఇంటివసుందర పిల్లవానికోసం మారువేషాలలో అయిదుగురు సిద్ధపురుషులు, 'గోంపా' (Gompa)లూ, ప్రత్యేకబుద్ధులూ, బోధిసత్వులూ, వచ్చిచేరుకున్నారు. ఆ ఇంటి పనివారందరి కింద! కొందరు వంటవారిగా చేరారు! మరికొందరు అంట్లు గిన్నెలు తోమి పశువులవద్ద సేవచేసేవారు, కావాలని చింకిబట్టలు - చరిగిపోయినవి వేసుకుని మరీ కనపడేవారు! దాసీవారిలాగా కనిపించడానికి! ఒక పరిచారకుడు పిల్లలను ఎత్తుకుని ఆడించేపనిలోచేరి, బాబును చేరదీసాడు!

''చోగ్యాల్! కదూ! మీరు! నా సలహాదారుడు!'' అంటూ చిన్నబాబు పనివాడి వేషంలోవున్న ప్రధానిని గుర్తుపట్టేసాడు! సందేహంలేదు ఈ బాబు పూర్వజన్మలో పదమూడవ దలైలామాయే! తనవద్ద ముప్పై ఏళ్ళు పనిచేసిన దివాన్‌ని పేరుపెట్టిపిల్చి తానేగుర్తించాడు! అలా ప్రారంభమైంది దలైలామా అన్వేషణ, ఆయన గుర్తింపు!!

మహావైభవంతో పట్టాభిషేకం 10-3-1940 నాడు జరిగింది. ఎన్నో పరీక్షలు, దివ్యమైన టెస్టులు అన్నిటిలోనెగ్గి, పదునాలుగవ దలైలామాగా ఆ బాబు గుర్తించబడ్డాడు! శ్రీ 'టెన్సింగ్ గ్యాల్పో' (Tenzing Gyalpo) అనబడే దలైలామా!



20

# 'సనాతన హిందూమతం'లో పునర్జన్మ!

హిందూమతంలో పునర్జన్మసిద్ధాంతం గురించి రాసేబదులు **'పునర్జన్మసిద్ధాంతమే'** హిందూమత మూలస్తంభాలలో ఒకటని రాయడం ఉచితంగా తోస్తుంది!

యుగయుగాలుగా పవిత్ర భాతరావనిలో సనాతన ధర్మం పేరిట **'జీవనవిశ్వాసం'**గా ఈ భారతజాతికి ఊపిరిగా ఉన్న నాలుగు ముఖ్య నమ్మకాలలో **పునర్జన్మ** ప్రధానమైనది!

''జన్మ కర్మ చ మే దివ్యం
ఏవం యోవేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం ''పునర్జన్మ''
నైతి, మామేతి, సో ఽ అర్జున!!

అంటూ భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు ''ఓ అర్జునా! ఎవరైతే ఈ 'పునర్జన్మ'ల వెనుక నిహితమైవున్న దివ్యమైన 'సత్యాన్ని' యదార్థంగా అనుభవంతో గ్రహిస్తారో వారు తిరిగి మళ్ళీ ఈ పునర్జన్మలు పొందరు. (ఎందుకంటే వారు నా నిజతత్త్వంలో లయమైపోతారు గనుక)!'' అంటూ అర్జునునికి బోధించిన పరమసత్యంగా సకలవేదసారమైన భగవద్గీతలో పునర్జన్మ సిద్ధాంతం నిహితం చేయబడింది! ఇంతేకాక ప్రతి హిందువుడూ తనయొక్క దగ్గిర బంధువులు మరణించినప్పుడో వారి తల్లిదండ్రులు మరణించినప్పుడో వారి శరీరం దహనం చేయమబడ్డతర్వాత పదిరోజులపాటు జరిపే కర్మకాండ (పెద్దకర్మ) అనేది చేసేటప్పుడు ఆయా వేదమతంత్రాలలో నిహితం చేయబడిన ''పునర్జన్మరహస్యాలు'' ముడిపడివున్నవి! అందుకే తల్లిదండ్రులకు కుమారులు చేయవలసినదానికి ''కర్మ'' అనిపేరు! ఈ ''కర్మ''అనే 'లింకు'ద్వారానే మనిషి తల్లిదండ్రులతోనూ రక్తసంబంధీకులతోనూ భార్యాభర్తలతోనూ పొంది పునర్జన్మలూ, ఆ జన్మలలోతనకి రాబోయే బంధుత్వ శత్రుత్వాదుల ఏర్పాట్లూ అన్నికూడా ముడిపడివున్నాయి! దీనితోపాటు జ్యోతిషంలో జాతకంలోని గ్రహాలదశలలో ''కర్మాధిపతి''యొక్క దశగాని **'అంతర్దశ'**గాని ఎప్పుడు వస్తుందో అప్పుడే తల్లిదండ్రుల 'కర్మ' చేసేకాలం (కర్మాధికారం) ఏర్పడివుంటుంది! కాబట్టి తన పూర్వీకులకు ప్రతి హిందువుడూ చేసే 'కర్మకాండల'తో మంత్రాలు పూజలు, ముడిపడివున్నాయి! ఇలా జన్మలూ కర్మలూ, ఒకదానితో ఒకటి ముడిపడి జడలోని పాయలవలే అల్లుకొనిపోయి వుంటాయి! దీనినిబట్టే ఒక మనిషిని చూసినపుడు మనకి నిష్కారణంగా ప్రేమ పుట్టుకొనివస్తుంది!, అలాగే మరొక మనిషిని చూడగానే మనలో, ఏదో విడమరచి చెప్పలేని, కారణంచెప్పలేని 'వ్యతిరేక' (శత్రుత్వం) భావం కూడా పుట్టుకొనివస్తుంది! ఇది 'పునర్జన్మ' లేక గత జన్మలలో మనకు వారితో అనుబంధాలూ,

ఆపేక్షలూ బంధుత్వాలు, ప్రతీ జన్మలోనూ కలుగుతాయి! దీనివల్ల సుఖదుఃఖాలూ, సంయోగ వియోగాలూ, ఎడబాట్లు మళ్లీ తిరిగి కలుసుకోవటాలూ సుఖదుఃఖాలనే ముళ్ళచక్రాలకు కట్టివేసి, (బంధించే) 'నూనెగానుగ'లో తిప్పినట్లు నువ్వులనూనె పిండినట్లు జీవుల కాలగతిలో సుళ్ళు తిరుగుతూండే ''సంసారచక్రంలో'' చిక్కి భ్రమిస్తూవుంటాడు మనిషి!

''మనం ధరించే బట్టలుగనక చిరిగోలేక జీర్ణించి పాతవైపోయినపుడో వాటిని విడిచిపెట్టి మళ్ళీ కొత్తబట్టలు ధరించినట్టే మనిషి శరీరంలోవుండే **'అంతరాత్మ'** తాను పైన **'ధరించివున్న శరీరం'** కూడా జీర్ణించి పాతదైపోగానే దానిని విడిచిపెట్టి ఇంకొక కొత్తశరీరాన్ని ధరిస్తుంది! అంటూ

''అర్జునా! జననం, మరణం అనేది మనలోని 'ఆత్మ' ఒక శరీరం నుంచి ఇంకొక శరీరంలోకి వస్త్రాలు మార్చినట్టు మార్చుకోవటమే! నిజానికి మరణమనేది ఆత్మకు లేదు!'' అంటూ బంధు మరణాలకి దుఃఖించే అర్జునునికి జ్ఞానస్వరూపుడైన శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో చేసిన తత్వబోధనే, ఈ క్రింద శ్లోకాలలో జ్ఞానంగా ఉపదేశించాడు!

*''వాసాంసి జీర్ణాని, యధా విహాయ*
*నవాని గృహ్ణాతి నశోకపరాణి*
*జీర్ణాని నరోపరాణి''*

*''అధచైనం నిత్యజాతకం*
*నిత్యం వా మన్యసే మృతం*
*తథాపి త్వం మహాభాహో*
*నత్వం శోచితు మర్హసి!''*

కాబట్టే, ఓపార్థా! ఇలాగ ప్రతినిత్యం జన్మిస్తూవుండేవాడికి, ప్రతినిత్యం మరణించేవాడి కోసం దుఃఖించేదెందుకు? ఇలా చూసినా

మహాబాహుడవైన నీలాంటి వీరుడు ఇలా బేలపడి దుఃఖించరాదు అంటూ చేసిన భగవద్గీతోపదేశంలో అనేకసార్లు మానవుడికి పునర్జన్మలు, కర్మలు యదార్ధ సత్యమని దృఢంగా చెప్పబడివున్నాయి!

అంతేకాదు, ఈ జన్మలు, పునర్జన్మలు అవతారమూర్తులకి కూడా జన్మలు-కర్మలూ తప్పవున్నాయి!

కాకపోతే, కారణజన్ములైనవారికీ, అవతారమూర్తులకూ, తామెందుకు జన్మించామో గుర్తుంటుంది! అలానే గతంలో తామెప్పుడు జీవించామో ఇప్పుడు తమతో జీవించే వ్యక్తుల గతజన్మలు, వారి రానున్న జన్మలూ కూడా వారికి ముందే తెలుస్తాయి! అట్టి భగవత్స్వరూపుల సలహానూ, ఉపదేశాన్ని పాటించక అజ్ఞానంతో - తామెవరో గుర్తులేక ప్రస్తుత సుఖదుఃఖాల సుడిగుండంలోపడి కొట్టుకుంటూ కక్షలూ, అసూయలూ, ఆపేక్షలూ, ద్వేషాలబలంతో చేసే అనేక తప్పులు ఫలితంగా జీవుడు రానున్న జన్మలలో తీరనిబాధలు అనుభవించడం కూడా హిందూమతంలో ప్రత్యక్షంగా కనిపించే యదార్ధం!

ఇలాంటి అనుభవాలే పునర్జన్మలు, గతజన్మ జ్ఞాపకాలు నిజమని ఋజువుచేసే సాక్ష్యాధారాలు శాంతిదేవిపునర్జన్మ వంటి అపూర్వమైన కేసులు!

అలానే గతజన్మలో తన భక్తులైన ఇద్దరు సన్నిహితులకు షిరిడీసాయి వారికి చేసిన సలహాని, పాటించక వారి ఇష్టానుసారం ప్రవర్తించినందువల్ల వారికి భవిష్యత్తులో ఒకరు కక్షతో సర్పంగానూ, ఇంకొకరు పిరికితనంతో బాధ్యలేన స్వార్ధంతో కప్పగానూ జన్మించారు! ఈ యదార్ధ అనుభవం చెన్నబసవప్ప, వీరభద్రప్పల గాధలో చూడవచ్చు! ఇది షిరిడీసాయి సచ్చరిత్రలో వ్రాయబడివున్నది ఒకనాడు షిరిడీలో సాయిబాబా కాలవగట్టునే కూర్చునివుండగా ఒకకప్ప ప్రాణభయంతో తనని పుట్టుకొని

మింగబోతున్న పాముకిచిక్కి, రోదించటం విని సాయి తన సటకానెత్తి వారిద్దరినీ తీవ్రంగా మందలిస్తూ

'' ఓరి! వీరభద్రప్పా! చెన్నబసవప్పా! బుద్ధిలేదా? జన్మలు మారినా మీ బుద్ధి మారలేదా?'' అంటూ వారిని విడదీసి ఆ తర్వాత వారి గతజన్మల చరిత్రను ఎలా వర్ణించాడో చదివితే కర్మభూమియైన ఈ భారతదేశంలో జన్మించిన ప్రతిహిందువుడికీ శరీరం గగుర్పాటుతో పులకించక మానదు!

ఇలాగ శ్రీమద్భగవద్గీతలోనే గాక సాయివంటి సద్గురువుల చరిత్రలోనే కాక, బుద్ధదేవుని గత 400పైన జన్మలు ఎక్కడెక్కడ జన్మించినదీ ఏ పుణ్యంవలన ఆయన క్రమంగా అభివృద్ధితో పరిపూర్ణ యోగసాక్షాత్కారాన్ని పొందినదీ, తెలిపే అపూర్వ అనుభవాలే శ్రీ బుద్ధ జాతక కథలు! వాటిని అజంతా చిత్రాలలోనూ, అమరావతీ శిల్పాలలోనూ కూడా బౌద్ధమతం పునర్జన్మల యదార్థసత్యంగా శాశ్వత ప్రకృతి శాసనంగా అంగీకరించినది!

దీనివల్లనే గౌతమబుద్ధుడు జన్మతఃనే గాక, గతజన్మలలో కూడా హిందూమతంలోనివాడే! ఆయన బ్రిటిష్‌దొరల అబద్ధాలచరిత్రలో రాసినట్టుగా హిందూమత వ్యతిరేకి కాదు! అలానే ఏసుక్రీస్తు యదార్థబోధనలలో ఆయన పునర్జన్మలను గుర్తించడమేకాక తన రానున్న 'పునరావతారణ' గురించి చెప్పిన వాక్యాలు బైబిల్‌లో చూడవచ్చు! వీటన్నిటికంటే మూలమైనది ప్రాచీన ఉపనిషత్తులలో కఠోపనిషత్తులో, విశేషంగా ఒక బాలఋషి నచికేతుడు ఎలాగ యోగశక్తితో యమలోకానికి వెళ్ళి యమధర్మరాజును కలిసి, నిర్మలమైన తన అమాయకత్వంతో మృత్యుదేవతను సహితం మెప్పించి అపూర్వమైన మరణరహస్యాన్ని ఉపదేశంగా పొందాడో ఆ గాథనుదాని ఉపదేశాన్ని 'యమనచికేత సంవాదం' అని కఠోపనిషత్తులో చూడవచ్చు!

అలానే సావిత్రీ, సత్యవంతుల కథలో సావిత్రి నిర్మలమైన తన పాతివ్రత్యమహిమచే సత్యస్వరూపుడైన ధర్మదేవత లేక యమధర్మరాజునుండి వరాన్నిపొంది అల్పాయుష్కుడైన తన భర్తను బ్రతికించుకొని, తన మాంగల్యాన్ని ఎలా కాపాడుకుందో స్త్రీని, పతివ్రతలనూ పూజించే ఈ భారతదేశం ఎన్నటికీ మరచిపోదు!

ఇప్పటికింత చాలు! వేదాలు, పురాణాలు ఉపనిషత్తులు, భాగవద్గీత, ఒకటేమిటి! బుద్ధదేవుని మహిమలు సాయినాధునివంటి సిద్ధగురువుల అనుభూతులు తవ్వినకొద్దీ ఇసకపాతర, ఆదీ అంతమూలేని సాక్ష్యాధారాలెన్నో లభిస్తాయి!

ఇంతకీ మిగిలే శేషప్రశ్న మనిషి ఈ పునర్జన్మల చక్రంలో పడి సుడిగుండంలో తిరుగుతూవుండే తన ఆత్మను జనన-మరణాల గానుగలోంచి రక్షించే మార్గమేది? కర్మను, జయించటం లేదా కర్మనుండి విముక్తిని సాధించాలి! కర్మను జయించడం ఎలా?

ఈ సమస్య పునర్జన్మకు సంబంధించినది కాదు! దీని వివరాలు నా మరొక గ్రంధం **''అణుయుగంలో హిందూమతం''** లో కర్మసిద్ధాంతం పునర్జన్మలు అన్న అధ్యాయంలో చూడవచ్చు! మరి పునర్జన్మ సిద్ధాంతం ఇంతటి ప్రత్యక్షసత్యమై వుండగా బ్రిటిష్ తెల్లదొరలు దీనికి వ్యతిరేకంగా ఎందుకు ప్రచారం చేశారు? మెకాలే, ఇంగ్లీష్ చదువుల నెపంతో ఈ జీవిత సత్యాలను మూఢవిశ్వాసాలుగా నల్లమసి పూసి ఎందుకు తప్పుదోవ పట్టించాలని యువతరాన్ని బలితీసుకున్నాడు! ఇది ఆఖరి అధ్యాయంలో పరిశీలిద్దాం!



# 21

# ఇంతకీ .... మీరనేది ఏమిటి?

''పునర్జన్మ సిద్ధాంతం'' కేవలం హిందూమతం వారి నమ్మకాలమీద ఆధారపడ్డ మూఢవిశ్వాసం కాదని అణుయుగంలో కూడా ఆధునికసైన్సు పరికరాలతో నాస్తిక కమ్యూనిస్టు రష్యాలోని జోసెఫ్ కిర్లియన్, జపాన్‌లోని మెూతోయమామా, అమెరికాలోని డా॥ విట్టన్, టిబెట్‌లోని దలైలామా యొక్క పూర్వజన్మ, అవతారాలు, ఇంకా ఎన్నో సైన్సు సాక్ష్యాధారాలతో ఋజువైన యదార్ధ సత్యం అని ఇంతవరకూ అధ్యాయాలలో మీ ముందుంచటం జరిగింది!

ఇది కనీసం 5000 సం॥ల నుంచీ అంటే ఈ కలియుగం ప్రారంభమైందని చెప్పబడే 18-2-3102 B.C. శుక్రవారం ప్రమాధినామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమినాడు శ్రీకృష్ణనిర్యాణం జరిగినరోజునే ప్రారంభించిన కలియుగాదినుంచీ అవిచ్ఛినంగావస్తున్న వేదమతంలోని ముఖ్యసిద్ధాంతాలలో ఈ పునర్జన్మ ప్రాధమికమైనది. ఇది, యదార్ధమని ఋషులు, యోగులు, అవతారపురుషులు దృఢంగా నమ్మడమేకాక

నిజజీవితంలో ఆచరించిన సనాతన ధర్మంలోని ముఖ్యమైన పునాదిరాళ్ళలో ఒకటిగా గుర్తించబడింది! ఇది అనాది వేదమతం అనబడే సనాతన ధర్మానికి ధ్వజస్థంభంవంటి మూలస్థంభాలలో ఒకటి!

అందుకే ఈ భారతదేశంలో వేదమతాన్ని నాశనం చెయ్యాలంటే ఈ దేశాన్ని రాజకీయంగా చిన్నాభిన్నం చేయాలంటే ప్రజలను విడదీసి స్థాపించే డివైడ్ అండ్ రూల్ (Divide and Rule) అన్న బ్రిటిష్‌వారి కుటిల రాజనీతికి మొదటి బలిపశువుగా మూఢవిశ్వాసాలపేరిట తెల్లదొరల ప్రచారం మొదలైంది! ఇది క్రైస్తవమతం (Christianity) అనే ముసుగుతో ఇంగ్లీషుచదువు అనబడే ఆధునిక సంస్కృతి (Western Education) అన్న తెల్లకోటింగుతో 'చదువుకున్న నిరక్షరాసుల'తో మొదలైంది గురుకుల విద్యావిధానాన్ని రూపుమాపడం ఇంగ్లీష్ డిగ్రీల రూపంలో!

నిజానికది క్రీస్తుమహాశయుడు బోధించిన నిజమైన క్రైస్తవమతం **కాదు!** ఇది తెల్లవాడు తయారుచేసిన **సొంత కలగలుపు** క్రైస్తవమతం, మీద ఆధారపడ్డది! ఈ రెండింటికీ తేడా తెలియని నల్లజాతి క్రైస్తవులను తెల్లజాతి క్రైస్తవులు నీగ్రోలుగానూ, అమెరికాలో కూలీ (Coolies) దక్షిణాఫ్రికాలోనూ, బానిస వ్యాపారుల్లో కోట్లు గడించిన జఫర్సన్ (Jeffersun) వంటి విశ్వమానవ ఊకదంపుడు ఉపన్యాసాలు గాళ్ళతోనూ ప్రారంభమైంది!!

వేల సంవత్సరాలుగా మనదేశంలో చనిపోయిన మనిషి తిరిగి 'పునర్జన్మ' ఎత్తటం అనేది, ప్రాచీనసాంప్రదాయ సిద్ధమైన యదార్థ సత్యంగా భావిస్తున్నారు. ఇది పల్లెలలోని పామరజనం దగ్గిర్నుంచీ అణువణువునా ప్రతివారిలోనూ జీర్ణించిన హిందూమత సనాతన విశ్వాసం. అంతేకాదు! ప్రతీవాడూ తానుచేసిన మంచిచెడుగుల ఫలితాలనే పుణ్యపాపాల రూపంలో వచ్చే జన్మలో అనుభవిస్తాడన్న భయంవల్ల - ఈ జన్మలో చేసే ప్రతీపనీ మానవుడు ఒళ్ళు

దగ్గరపెట్టుకొని జాగ్రత్తగా ప్రవర్తించి ఆచరించాలన్నదే మన సనాతన వేదమతంలోని మూలసిద్ధాంతం.

కాని ఇంగ్లీషు చదువులు మనదేశంలో ప్రవేశపెట్టిన ''**మెకాలే**'' (Macauley) మాత్రం పునర్జన్మ సిద్ధాంతాన్నీ, దానికి ఆధారభూతమైన '**కర్మ -సిద్ధాంతాన్నీ**' మూఢ విశ్వాసాలకింద దుష్టప్రచారంచేసి, దూషిస్తూ, ఎద్దేవా చేయడం బ్రిటీషువారిని అనుకరించటం భారతీయులకు అలవాటుచేశాడు. ఇది ఇలా చేయటంలో అతని ఉద్దేశ్యం దూరదృష్టితో ఒక ప్లానుప్రకారం చేశాన ని అతనివ్రాతలలోనే ఇలా తెలిపాడు -

> ''దీనివల్ల ప్రతి హిందువుడూ క్రమంగా తనమతంమీద విశ్వాసం కోల్పోవటం, వేదాలన్నా తన ప్రాచీన సాంప్రదాయాలన్నా అగౌరవం ఏర్పడటం జరుగుతుంది. దీనివల్ల కొందరు బహిరంగంగానే నాస్తికులౌతారు. మరికొందరు నామమాత్రంగా పైకి హిందువుల మాదిరిగా బాహ్యవేషంగానే నటించినా, నిజానికి వారు మన పాశ్చాత్యుల మనస్తత్వాన్నీ వేషభాషలను అనుసరిస్తారు! దీనివల్ల మనం క్రైస్తవమతంలోకి భారతీయులందరినీ మార్చివేయడం సాధ్యపడుతుంది. నాదృష్టిలో భారతదేశం ముప్పై సంవత్సరాల లోపుగానే క్రైస్తవ దేశంగా మారిపోవడం తథ్యం!''

అంటూ దాచకుండానే తన సంకల్పాన్ని బైటపెట్టాడు. ఫలితంగా ''హేతువాదులు'', సత్యాన్వేషకులు', 'గతి - తార్కికవాదులు' (Dialectical Materialists) అన్నముసుగులో జాతిద్రోహం నోటికివచ్చినట్లు '**పునర్జన్మ సిద్ధాంతం**' '**కర్మ సిద్ధాంతం**' - వంటి వేదమతంలోని మూల సిద్ధాంతాలపైనే ప్రత్యేకించి దాడి చేయనారంభించారు. వీళ్ళు ముస్లిములనూ బైబుల్‌నూ మాత్రం ఏమీఅనరు. పనిగట్టుకుని

హిందువులపైనే దాడిచేస్తారు. ఇలాటి దొంగ హేతువాదులనబడే ''అవకాశవాదులు'' - ఇంకా ఇప్పటికీ వున్నారు.

ఫలితంగా బెంగాల్‌లో 'బ్రహ్మసమాజం' పేరుతో దేవాలయాలలోని విగ్రహారాధనను తిరస్కరించే ఉద్యమం బహిరంగంగానే ప్రారంభమైంది. రాజా రామమోహన్‌రాయ్, రమేష్‌చంద్రదత్తు వంటి 'బ్రిటీషు - భారతీయులు' (British Indians) అనేవారొక క్రొత్త సంకరజాతిగా వెల్లివిరిశారు.

చూస్తూవుండగానే భారతదేశం క్రిష్టియన్ దేశంగా మారిపోసాగింది. దీనిని రాజకీయంగా వాడుకోవటానికి బ్రిటీషు ప్రభుత్వం లక్షల రూపాయలు ప్రభుత్వ గ్రాంట్లను ఇచ్చి హిందూప్రజల సొమ్ముతోనే క్రిస్టియన్ కాలేజీలు, చర్చిలు, కాథలిక్ కాలేజీలవంటివి కేరళలో మొదలుపెట్టి దేశమంతటా స్థాపించారు.

ఇది చాలదు అన్నట్టు మన భారతీయ విద్యావిధానాన్ని పూర్తిగా రూపుమాపి 'ఇంగ్లీషు చదువు' అంటూ ముసుగుతొడిగిన క్రైస్తవమతం నేర్పే యూనివర్శిటీలు అనేకం స్థాపించారు. ఇదే మన దేశచరిత్రలో ''ఇంగ్లీషు విద్యావిధానం'' అనే ఇంగ్లీసు డిగ్రీ చదువులకు మూలం! మద్రాసు యూనివర్శిటీ, అలహాబాదు యూనివర్శిటి, బొంబాయి యూనివర్శిటీలవంటి చోట్లా, ప్రత్యేకించి పవిత్ర హిందూ యాత్రాస్థలాల్లోనే, క్రైస్తవ కేంద్రాలను విద్యావిధానం పేరుతో కల్తీచేసే డిగ్రీకోర్సులను ప్రవేశపెట్టాడు మెకాలే! ఇదంతా 1858 నుంచి 1901లోపల జరిగిపోయింది.

దీనితో మన ప్రాచీన **'గురుకుల విద్యావిధానం'** మూత పడింది! సంస్కృతకళాశాలలు, విద్యాపీఠాలకు ప్రభుత్వం డబ్బు ఇవ్వటం - హిందూమతానికి శత్రువులైనవారిని ప్రోత్సాహించటం - నిలిపివేశారు!

బహిరంగంగా హిందూ దేవుళ్ళనూ, వేదాల ఆలయాలనూ, విగ్రహారాధననూ, ప్రత్యేకించి బ్రాహ్మణులను దూషించే ప్రభుత్వ విధానం అనేక ముసుగులలో బ్రిటీషువారే చేపట్టారు. నేర్పించారు! 'ద్రవిడ కజగం', 'ఆర్యద్రావిడశత్రుత్వం', 'జస్టిస్‌పార్టీ', 'పీపుల్స్‌పార్టీ', 'కాస్మోపాలిటిన్ క్లబ్బులు' వంటి అనేక ముసుగు రూపాలలో సమాజంలో త్రాగేవారినీ, మద్యమాంసాలను తెల్లదొరలతో కలిసి సేవించేవారినీ సమాజంలో గౌరవించబడటం, దాన్నే గౌరవసూచకంగా బీదప్రజలకు 'ఎరగా' చూపి వేలాదిమందిని - 'ఇంగ్లీషుదొరల మాదిరి'గా సూటుబూటూ వేసుకొని ధారాళంగా ఇంగ్లీషు మాట్లాడటమేంగొప్పగా, వారితో షేక్‌హాండ్ (shake hand)లు ఇవ్వగలగడం, కాలేజీ ఇంగ్లీషు డిగ్రీ పొందగలగడమే, అర్హతలుగా ప్రభుత్వంలో ఉద్యోగాలిచ్చేవిధానం మొదలైంది. ఇందులో భాగంగానే ''ముస్లిం-లీగ్''ను ప్రోత్సాహించి, జిన్నాను దువ్వి 'పాకిస్తాన్'ను భారత్‌కు ప్రక్కలో బల్లెంగా చేసి దేశాన్ని చీల్చటం జరిగింది! వీటన్నిటికీ ''మెకాలే-చదువు''ల పేరుతో హిందూసాంప్రదాయాలను నాశనంచేసే విధానం కారణం.

దీని ఫలితంగానే సనాతన హిందూ సాంప్రదాయంలో పుట్టిన గాంధీగారు కూడా సూటూ బూటూ వేసుకొని లండన్ వెళ్ళి దొరల మాదిరిగా మాంసం, తిని 'గొప్పవాడైతే'నేకాని మనదేశానికి స్వతంత్రం రాదని నమ్మి ఇంగ్లండు వెళ్ళి తాను ఎలా పతనమైందీ గాంధీగారు ఆయన **'ఆత్మకథ'**లో వ్రాశారు - సత్యాన్ని నమ్మే మహాత్ముడు కాబట్టి! కాని, అలా పైకి రాయకుండా బ్రిటీష్-బానిసగా మారిపోయిన స్వచ్ఛమైన సాంప్రదాయిక హిందువులు కోకొల్లలు!

మహర్షి దేవేంద్రనాథ్ కుమారుడు రవీంద్రనాథ్ టాగూరుగా మరితేనే ఆయన 'గీతాంజలి'కి నోబుల్‌ప్రైజు లభించింది.

హిందూమతాన్ని నమ్మినందువలననే సత్యాహింసలకు ప్రాణాలు అర్పించిన గాంధీమహాత్మునికి నోబుల్‌ప్రైజుకు శాంతికి (World Peace) అర్హత లేకపోయింది. ఇది తెల్లవారి జాతిద్వేష చరిత్రలో సిగ్గుతో తలదించుకోవాల్సిన అధ్యాయం. అలానే -

జవహర్‌లాల్ నెహ్రూ తన తండ్రి మోతిలాల్ ఉద్బోధనతోనే కాశ్మీరీ బ్రాహ్మణుడి వేషభాషలు వదిలి తెల్లదొరలతో ముస్లింలతో మద్యమాంసాలు సేవించే 'హిందూ సాహిబ్' గా మారడం నెహ్రూ పండితుని ఆత్మకథలోనే చూడవచ్చు !

ఇలాంటివారే M.N. రాయ్, వంటి ప్రముఖులు మన హిందూ విశ్వాసాలకు 'సెక్యులరిజం' అనే మసిపూసి మూఢాచారల క్రింద ప్రచారం చేసిన భారతీయులు.

ఇందులో ప్రస్తుతాంశంగా మనకి ఇప్పుడు కావలసింది రెండు ముఖ్యాంశాలు.

1. హిందూమతంలోని మూలసూత్రమైన పునర్జన్మ సిద్ధాంతం, కర్మ సిద్ధాంతాలను అమెరికాలో బ్రిటన్‌లో వేలాది డాక్టర్ల హాస్పటల్స్‌లో యదార్ధసైన్సు సత్యంగా అంగీకరించడం అన్నిటికన్నా, పరమాశ్చర్యకరమైన విప్లవాత్మకమైన మార్పు!
2. ఇంత పెద్ద ఎత్తున క్రైస్తవమతంలోకి భారతదేశాన్ని మార్చే ప్రభుత్వ ప్రణాళికను తట్టుకొని ఇంకా భారతదేశం ఈనాటికీ వేదాలను నమ్మే సనాతన దేశంగా ఎలా జీవిస్తున్నది?

## క్రిస్టియన్ దేశంగా భారతదేశం ?

ఈ రెండింటికీ సమాధానం చరిత్రపేజీలలోన కనిపిస్తుంది. అందులో రెండవకారణం హిందేశం క్రిస్టియన్ (Christain) దేశంగా మారకపోవడానికి దైవ సంకల్పంతో మనదేశంలో జన్మించిన

''కారణజన్ములే''! — శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీరమణమహర్షి, శ్రీషిరిడీ సాయినాథుడు, శ్రీశివానందయోగి, శ్రీఅరవిందులవంటి ఎందరో ఆధ్యాత్మికజ్యోతులు దేశం నాలుగుమూలలా ఒక్కసారిగా వెలిగాయి!

ఇంగ్లీషు చదివినా కాసీ ఆత్మజ్ఞానాన్నిపొంది **'జీవించే హిందూమతం'**గా మనమధ్యనే తిరిగిన శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతిగా కంచికామపీఠం పరమాచార్యులు నూరేళ్ళు మనమధ్య దీవిస్తూ జీవించటం!

ఇది జరక్కపోయివున్నట్లైతే వివేకానందుడు పుట్టినా అతడు ఇంగ్లీషు డిగ్రీ చదివి క్రైస్తవుడిగా మారిపోయివుండటం ఖాయం. ఇకపోతే రెండవ ఆశ్చర్యకరమైన విషయం - సైన్సు పరిశోధనతోనే హిందూమత మూలసూత్రమైన పునర్జన్మ సిద్ధాంతం యదార్థమని ఋజువుచేసే వేలాది, వందలాది కేసులు అనుభవాలను **'పూర్వజన్మ జ్ఞాపకాల'**తో పుట్టే మనుష్యులే ప్రత్యక్ష నిదర్శనాలు !

ఇలాంటివి హిందూమతం మీద అభిమానంపోక అభిమానంతో ప్రచారం చేసే వారెవరైనా వ్రాస్తే అంత విలువలేదు! కానీ క్రైస్తవులుగా పుట్టి, క్రిస్టియన్లుగా జీవిస్తూ డాక్టర్లుగా వృత్తిచేసున్న జోయెల్ (Joel) విట్టన్ (Dr.Whitton) వంటి ప్రఖ్యాత ఇంగ్లీషు వైద్యుల అనుభవాలే ఇందులో మీకు నేను అందించేది! ఇదంతా **మెడికల్ రీసెర్చి** (Medical Research)లో భాగంగా డాక్టర్ **విట్టన్** ట్రీట్‌మెంట్ చేసిన పేషంట్ల అనుభవాలే!

ఇవి ఇంగ్లీషులో అనేక పుస్తకాలలో ఉదహరించబడ్డాయి. వీటిని తెలుగులో మన సామాన్య ప్రజలకు అందించే ప్రయత్నమే ఈ పుస్తకం!

ఇది ఒకసారి చదివితే చాలదు! నూరేళ్ళ నిద్ర నుంచి

త్రుళ్ళిపడి మేలుకోడానికి మాత్రమే యిది పనికి వస్తుంది. మేలుకున్నాక ఇంగ్లీషు మత్తునుంచి, హేతువాదపు 'కోమా' నుంచి, సెక్యులరిజం అనే ఎయిడ్స్ వ్యాధినుంచి మీ ఆత్మను ప్రక్షాళనం చేసుకోడానికి ఈ పరిశోధన ఫలితాలు సైన్సుపరమైన సత్యంగా మీరు మనస్సుకు పట్టించుకుంటూ చదవాలి! అంతేకాదు - మీ జీవితంలోని సమస్యలు - కుటుంబకలహాలు, విడాకులు, రోగాలు అందులోనూ వైద్యానికి లొంగని మొండిరోగాలు, అర్థంలేని మానసిక డిప్రెషన్ వంటి రుగ్మతలు - అనేక సమస్యలవెనుక మీ గత జన్మలోని మీరు చేసిన పూర్వజన్మకర్మల ఫలితమే యిప్పుడు ఎలా అనుభవిస్తున్నారో ఆకళింపుచేసుకోడానికి పనికివచ్చే ఒక సైన్సుపరిశోధనా సారం! ఇది ఒక సైన్సువేదం! మన జీవితాన్ని మన దృక్పదాన్ని, మనం చేసే ప్రతిపనినీ మార్చివేయగల హోమియోపతీ మందువంటి తీవ్రపొటెన్సీగల మహాసత్యం! ఇది మీ ముందు ఉంచుతున్నాను. ఇది మీ భవిష్యత్తు జీవితాన్ని వెనక్కు తిరిగి సింహావలోకనం చేసుకోవడానికీ మాత్రమే కాకుండా, మరణించినవారి ప్రేతాత్మలు మీపై స్పిరిట్సుగా (Spirits) ఎలా పనిచేస్తున్నాయో తెలియజేసే సైన్సు పరిశోధన!

అందుకే విశ్వమానవులు సమానమని బోధించిన క్రీస్తుమహాశయుని పేరుతో తెల్లజాతి దురహంకారాన్ని ఆసియా, ఆఫ్రికా, చైనా, ఈజిప్టులోని నల్లజాతుల అణచివేతకు ఒక రాజకీయ పనిముట్టుగా (Political Tool) మాత్రమే అని అక్కడి నల్లజాతివారిని హింసించే తెల్లజాతివారి జాత్యహంకార (Apatheied Policy) తెలిసిన మహాత్మాగాంధీవంటి వారికెందరికో తెలుసు! నిజానికి బ్రిటిషువాడు ప్రచారం చెయ్యాలనుకున్నది క్రీస్తుమహాశయుని ఆధ్యాత్మిక బోధనలుకానేకాదు! ఆయన పేరును మాత్రమే రాజకీయంగా దండుకొని (ఈనాడు గాంధీగారి పేరుతో లంచగొండి దగాకోరు, సారావ్యాపారస్థులు

హర్షద్ మెహతాలు, కాంగ్రెస్‌పేరు చెప్పి ఓట్లు దండుకునేది) క్రీస్తుపేరుతో సనాతన మతవిశ్వాసాలు రూపమాపటమే ఈ తెల్లజాతి సంకల్పం! ఇది గ్రహించలేని నల్లజాతి 'బానిస' (నిజంగా బానిసలే) కులంపేరిట ప్రాంతీయ, రాష్ట్రాలపేరిట ఉత్తర, దక్షిణ, ద్రావిడ ఆర్య, అనేక రాజకీయ నినాదాలపేరిట కొట్టుకు చస్తున్నారు!

.... బ్రిటిష్‌వాడు వెళ్ళిపోయినా ఈ రావణాసురుడి కాష్టం అలానే కాలుతోంది! హిందూ ముస్లింలమధ్య లేచిన తగాదా ఇండియా, పాకిస్థాన్, ఆరనికుంపటిగా వెలిగించారు తెల్లదొరలు! అలాగే 1999 కలియుగాంతంలో జరగబోయే ఘోరమైన మారణహోమంలో క్రైస్తవమహాశయుడి పేరు చెప్పుకొని చర్చిఫాదరీలు త్రాగుడు వ్యభిచారం డబ్బు సంపాదన పరరాజ్యాలపై దండెత్తే సైన్యాలతో పోప్‌పీఠంపై కూర్చున్న పోప్ (Pope) పేరుతో మతంపేరిట రాజకీయాలు నడిపించే 'సైతాను' అనుయాయుని (Anti Christ Followers) వీరికే, రానున్న నిజమైన అవతారపురుషునికీ జరిగే ఘోరయుద్ధంలో తేలిపోతుంది! ఇదంతా ఎందుకు చెప్పాల్సివచ్చిందంటే ''పునర్జన్మ సిద్ధాంతాన్ని బైబిల్‌నుంచి ఎందుకు తొలిగించారో క్రైస్తవఫాదరీలు 800 ఏళ్ళుగా పవిత్రగ్రంథమైన బైబిల్‌లోని ఆధ్యాత్మిక సత్యాలను (Word of God) తొలగించి వాటిస్థానే మతంపేరిట, చర్చిఅధికారం పేరిట యూరోప్‌లో రాజకీయాలు నడిపించిన చరిత్ర ఇప్పటికైనా కళ్ళు తెరిస్తే మన భారతీయ క్రైస్తవలకు కనిపించే నగ్నసత్యం!

ఇప్పుడిప్పుడే కళ్ళు తెరుస్తున్నారు క్రైస్తవసోదరులుకూడా! అందుకే వెయ్యేళ్ళపైగా పోప్‌పీఠం ఏ నల్లజాతీయుడికీ దక్కలేదు! క్రీస్తు తెల్లవాడా? కాదు! రోమన్ కాథలిక్ ఇనపకటకటాల వెనుక నిజంగా నడుస్తోంది క్రైస్తవమహాశయుని బోధనలు కాదు చర్చిమతం పేరిట తెల్లజాతి దురహంకారమే! అది భవిష్యత్తులో అంతం కాబోతున్నది! నోస్ట్రడామస్

చెప్పిన భవిష్యత్తుప్రకారం ఇప్పుడు రాబోయేవాడు ఆఖరిపోప్ (ముసుగులో యాంటి క్రైస్తు వస్తాడు)।

ఇదంతా ఎందుకంటే క్రీస్తుమహాశయుడు ఆయన బోధనలు నిజమైన ఆధ్యాత్మిక సత్యాలు ఏనాడూ పునర్జన్మని కాదనలేదు! అసలైన క్రీస్తుబోధనలు ఏనాడో తుంగలోతొక్కేశారు! చర్చిబిషప్‌లు ఫాదరీల పొట్టలు పెంచుకున్న సైతాన్ శిష్యులు!

ఎప్పటికైనా క్రీస్తుమహాశయుని అసలైన చరిత్ర బయటికి వస్తే ..... వస్తే, అందులో బయటపడే మహాసత్యాలు ఇవి ....

1. ఏసుక్రీస్తు తెల్లవాడు కాదు సత్యమైన ఆసియా జాతివాడు **(Asian Coloured Race)**

2. జీసెస్ అనే యోగి అసలు పేరు **'ఈశా'** లేక ఈశపుత్ర! (Son of God)అని భవిష్యపురాణంలో ఇవ్వబడిన వ్యక్తి నిజమైన యోగ్యుడు! ఆయన బోధనలలో ముఖ్యమైనది పునర్జన్మ సిద్ధాంతం! పునర్జన్మ సిద్ధాంతం సనాతనధర్మంలో ముఖ్యమైన భాగం! వేదకాలపు ఋషులు ఈ పునర్జన్మసిద్ధాంతాన్ని కఠోపనిషత్తులో నచికేతుడనే ఋషి స్వయంగా యమలోకానికి వెళ్ళి మృత్యువు రహస్యాలను సాక్షాత్తు యముడితో తర్కించి అనుగ్రహంగా పొందిన జ్ఞానం ''యమః నచికేతసంవాదం'' రూపంలో వున్నది!

3. పునర్జన్మ సిద్ధాంతం రామ, కృష్ణ, బుద్ధ కల్కివంటి అవతారమూర్తులకే వర్తించే ధర్మచక్రం అయినపుడు ఇక సామాన్యజీవులకు పునర్జన్మ యదార్థ సత్యమని వేరే చెప్పక తప్పదు!

4. భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడే స్వయంగా పునర్జన్మ

యదార్థమని అది సామాన్య జీవులకు, అర్జునునివంటివారికి, తనవంటి అవతార మూర్తులకే కూడా వర్తించే శాశ్వతసత్యమని క్రింది వ్యాకాలలో తెలిపాడు!

"బహూనిమే వ్యతీతాని ...
...... జన్మాని తవచార్జునా
తాన్యహం వేద సర్వాణి
నత్వం వేత్థ పరంతప"
- భగవద్గీత

"అర్జునా! నాకూ, నీకూ కూడా అనేక జన్మలు గడిచిపోయినా నాకు అవి తెలుసును (గుర్తువున్నవి), నీకు మాత్రం గుర్తులేదు (తెలియదు)!" అంటూ స్పష్టంగా పునర్జన్మలు సత్యమని జన్మలు, కర్మలు తప్పవని భగవద్గీతలో చెప్పాడు!

ఏసుక్రీస్తు తాను కూడా తిరిగిజన్మిస్తానని చెప్పడమేకాక పునర్జన్మ సిద్ధాంతం తనకి కూడా వర్తిస్తుందని తెలిసేలా, తాను తిరిగి భూమిపై జన్మించే సమయంలో **జరిగే ప్రళయాలు, కలియుగాంత** లక్షణాలు, ప్రళయకాలం అన్నపేరుతో Day of Judgement అని తెలిపాడు! దీనినే **రెండవ పునర్జన్మ** లేక The Second Comming అనీ, **Return of Christ** అని క్రైస్తవులు కూడా నమ్ముతారు! ఇక పునర్జన్మ సిద్ధాంతంలో వీరు నమ్మనిదేముంది? ఇలానే బైబిల్ వెతికితే జాన్ బాప్టిస్ట్ (John the Baptist), ఎలీషా ఇంకా తదితరులు తిరిగి జన్మించారని వారిని ప్రజలు గుర్తించలేదని Elisha has in deed come. You Know him not అని చెప్పిన వాక్యాలే నిదర్శనం!

బౌద్ధమతంలోకూడా బుద్ధదేవుడు అనేక పూర్వజన్మలు ఎలా ఎత్తినవి ప్రతీజన్మలోనూ చేసిన పుణ్యము ఫలితంగా ఉత్తమజన్మ ఎలా లభించినదీ? తాను చేసిన త్యాగం ఫలితంగా జ్ఞానం, తపస్సు ఎలాగ

మరుజన్మలు లభించాయెూ కూడా వర్ణించబడి వున్నది బుద్ధ జాతకకథలలో!

ఈవిధంగా పరిశోధనా దృష్టితో చూస్తే ఇంకా సైన్సురీసెర్చిలో లభించే కిర్లియన్ ఫోటోగ్రఫీవంటి సాక్ష్యాధారాలను, అటు వేదకాలపు ఋషుల సనాతనధర్మంలో లభించే పునర్జన్మ సిద్ధాంతానికి ఎట్టిభేదమూలేదు!

ఇదే సత్యాన్ని టిబెట్‌లో అవతరించిన 14గురు దలైలామాలు, ప్రస్తుత దలైలామా అనుభవంలోకూడా ప్రత్యక్షంగా తెలిసిన వివరాలను నేను ఆయనను కలిసినపుడు ఎలాగ తెలిసిందా ''కదిలేబ్రహ్మం నడిచే దైవం'' అన్న నాగ్రంథంలో ఇచ్చాను! దీన్ని పాఠకుల ఉపయోగార్థం కొన్నిభాగాలను మాత్రం ఇక్కడ పునర్ముద్రిస్తున్నాను!

ఇకపోతే మిగిలివున్నదల్లా ఒక్కటే! మనిషి మరణించాక ఆత్మఅనేది మిగిలివుంటుంది కదా! ఆత్మలోనే మనం చేసిన పుణ్యపాపాలు మనతోకూడా వస్తాయి! పుణ్యములు అనగా ఏమిటి? అంటే ఇతరులను బాధించటం, పీడించటం, హింసించటంవంటి నేరాలను ఏమి చేస్తే కర్మసిద్ధాంతం ప్రకారం తిరిగి అవేబాధలు ఆ చేసిన వారికే నరకం, స్వర్గం అనే పేరిట ఎలాగ అనుభవించాల్సి వస్తుందోకూడా మైకేల్ గెల్లాండర్ అనుభవాలలోనూ గమనించాము!

దీనిని బట్టి కర్మసిద్ధాంతం, పునర్జన్మసిద్ధాంతవముతో ముడిపడివున్నది! ఎలా ముడిపడివుంటుందో జపాన్‌యెూగి యెూతోయామా సమాధిస్థితిలో దివ్యదృష్టితో దర్శించిన తన తల్లిదండ్రుల గతకర్మను గూర్చి తెలిపే అధ్యాయాలలో గమనించాము!

ఇలాగ కర్మలు జన్మలు ఈ కలియుగంలో కూడా ప్రత్యక్షంగా ఋజువుచేశాయి! శాంతిదేవి పునర్జన్మవంటి అనుభవాలు

ఋజువుచేస్తున్నాయి! అలాంటిదే లెనిన్ ఆత్మను దర్శించి స్త్రీ రష్యాలో పొందిన అనుభవంకూడా!

కాబట్టి 'ఆత్మను నమ్మను', 'జన్మలు, కర్మలు అబద్ధం', 'దేవుడు లేడు' 'నరకం, స్వర్గం నమ్మం' అని చెప్పే నాస్తిక కమ్యూనిస్టులైనవారికి కూడా ఆత్మవుంటుంది అని లెనిన్ ఆత్మ అనుభవం ఋజువు చేస్తోంది! ఇంతవరకే ఈ పుస్తకం యొక్క ఉద్దేశం!

మిగతా విషయాలు కర్మ దేవతలు పైలోకాల్లో వుంటారా? ధర్మదేవతలు కూడా వుంటారా? ప్రతీక్షణం వేలాది, కాదు లక్షలాదిమంది జన్మిస్తూ మరణిస్తూ ఒక పెద్ద రైల్వే ప్లాట్‌ఫారంలాగా రద్దీగావున్న పునర్జన్మల లోకాలలో రైల్వే టికెట్లు లేక విమానంటికెట్లు రిజర్వేషన్ పనిచూసే ప్రయాణికుల ఏర్పాటు (Travel Arrangements) చేసే ఒక వ్యవస్థ (Organization) వంటిది వున్నదా? పితృదేవతలంటే వీరేనా? ఫలానావ్యక్తి ఫలానాచోట జన్మించాలని అలానే అతని గతకర్మను అతనికి సానుభూతితో విశ్లేషించి మనశ్శాంతిని కల్పించే సలహాదారులు వంటి పైలోకాల్లోని ఇవన్నీ హిందూమతం తమ మరణించిన పెద్దలకు పెట్టే శ్రాద్ధకర్మలు లేక ఆబ్దికం, సంవత్సరీకం వంటి ఆధ్యాత్మిక రహస్యాలను ఈనాటి సైన్సుదృష్టితో విశ్లేషించి తెలుసుకోవానుకుంటే అవన్నీ వేరేగ్రంథంగా హిందూమతం మూలసిద్ధాంతాలు అనే అధ్యాయాలకింద నాగ్రంధం ''**అణుయుగంలో హిందూమతం**'' **"Hinduism in the space Age"**లో చూడవచ్చు!

మనిషి మరణించిన తర్వాత ఆత్మ అనేది మిగిలివుంటుంది! అది ఈ శరీరంకంటే సత్యమైనది!! పునర్జన్మలు, నరకము, కర్మలు, యమబాధలు అనేవి తప్పకవుంటాయి! ఆత్మహత్యతో మరణించినవారు, హత్యలు చేయబడ్డవారు, ఘోరమైన బాధలు లేక హింస లేదా కష్టాని

సెక్సువల్ల ఏర్పడే జెలసీతో ఆత్మహత్య చేసుకునేవారు కాని పై ప్రేతాలోకాల్లో కొన్ని దశాబ్దాలలో వందల ఏళ్ళుకూడా బాధలు పడుతూవుండాల్సి వస్తుంది!

ఈ పునర్జన్మ సిద్ధాంతం వేదాల్లో ఉపనిషత్తులలో భారత భాగవతాల్లో ఉపదేశించినది యదార్థ సత్యము! సహేతుకంగా పాఠకులముందు పెట్టడమే నావంతు!

అది నమ్మటమో, నమ్మకపోవటమో యదార్థసత్యాలను నమ్మి మన జీవితాలను వెలుగుబాటలో నడిపించుకుంటే సుఖసంతోషాలను అవలీలగా పెద్దకష్టమే లేకుండానే పొందవచ్చు!!!

- అలా సుఖమనుభవించకుండా ఏదివుంటే అది మనం గతంలో చేసిన కర్మ లేదా పూర్వజన్మ చరిత్రపై ఆధారపడి వుంటుందని అమెరికన్ డ్రాక్టరు నిరూపించిన నమ్మలేని నిజం!!!

ఆధ్యాత్మిక సాధకులకు ఇది వెలుగుబాట! ఆత్మపురోగతికి అడ్డంగా నిలిచే, మనం చేసే గతకర్మలు ఎలా పనిచేస్తాయో తెలిపే విజ్ఞానవీచికలు యిందులోని అనుభవాలు!

పునర్జన్మ సిద్ధాంతం హిందూమత మూఢ విశ్వాసంకాదు! అమెరికాలోని వైద్య విజ్ఞానం కాచివడపోసి యదార్థమని రూఢీచేసిన సనాతన వేదధర్మం యొక్క ఉపదేశసారం! మన గతకర్మలను ప్రక్షాళన చేసుకుంటేనే కాని ఆత్మసాక్షాత్కారం, యోగసిద్ధి, మంత్రసిద్ధి, దేవతాదర్శనం ఎందుకు కలగవో మనకు అర్థమయ్యేలా చేసే నిజాలు! హిందూమతాన్ని ఒక సైన్సులాగ డిగ్రీకోర్సులో బోధించే - వేదిక్ యూనివర్శిటీ ప్రచురించే పాఠ్యగ్రంధంగా దీన్ని మీకు అందిస్తున్నాను సంతోషంగా ! దీనివల్ల హిందూమతంలో డిగ్రీకోర్సు ఒకటి మీకు లభిస్తున్నదని తెలుస్తుంది మీకు! ఇందులో సైన్సుపరంగా బోధించే

వేదాలలోని సత్యాలు - ఇటు సైంటిస్టులకే కాదు, అటువేదమంత్రాలను వర్ణించే వేదపండితులకు కూడా అర్థంకాని దేవరహస్యాలు, ఆధ్యాత్మిక సత్యాలు ! ఇవి డిగ్రీకోర్సుద్వారా కులమత భేదాలు లేకుండా ఆసక్తివున్న మీలో ప్రతి ఒక్కరికీ అందించాలనే నేను ఈగ్రంధాన్ని మీకు అనుగ్రహ పూర్వకంగా అందిస్తున్నాను. ప్రతివారూ చదివి, అనుభవంలో ఉపయోగించుకునే పాఠ్యగ్రంధంగా దీన్ని రూపొందించి మీకు అందిస్తున్నాను.

ఓం శాంతి శ్శాంతిః శ్శాంతిః

ఇట్లు

భవదీయుడు

డా॥ వేదవ్యాస

